అక్టోబరు 2013
రూ. 12/-

# చతుర

* సింహప్రసాద్ నవల

ఒక ఆడ + ఒక మగ .. 6

## రమణీయ ప్రకృతి దృశ్యం!

ఇదేదో సహజసిద్ధంగా ఏర్పడిన లోయ కాదు. ఇది జేమ్స్ టరెల్ అనే ప్రపంచ ప్రసిద్ధి చెందిన కళాకారుడు రూపొందించిన బిలం. ఐర్లాండులోని లిస్ ఆర్డ్ కంట్రీ ఎస్టేట్‌లో పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్న ప్రదేశమిది!



# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. **280/-** చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర

ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది



అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డిడి లేదా ఎంఓ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.
ఆన్‌లైన్ చందా చెల్లింపునకు (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)

వివరాలకు : vipula.chatura@eenadu.net - vipula.chatura@gmail.com

# మనసున ఉన్నదీ...



★ విశిష్ట ముఖచిత్రంతో వెలువడిన సెప్టెంబరు 2013 'చతుర' ఎంతో విశిష్టతను సంతరించుకుంది. చతుర కతలు, థాచర్ చతురోక్తులు, కొత్తగాలి మానసిక ప్రశాంతతను కలిగించాయి. ముఖ్యంగా పుట్టగంటి గోపీకృష్ణ నవల 'దేవుడితో పంతం' జీవితానికి అద్దం పట్టేదిగా ఉంది. అంతేకాదు, నవలలోని ప్రతిపాత్ర స్వార్థంకోసం మనుషులు ఎలా పాకులాడుతారో చిత్రించింది. 'చతురంగం' మెదడుకు పదును పెడుతోంది.

– *టి.వి.డి.ఎన్ సీతారామారావు,* విజయవాడ

★ సెప్టెంబరు 'చతుర' నవల 'దేవుడితో పంతం' గతంలో స్వర్గీయ ఎన్‌టీఆర్ నటించిన 'దేవాంతకుడు' సినిమాను గుర్తుచేసింది. కథనం, వాక్యపటిమ, వివరణ చాలా బాగున్నాయి. రచయితకు ధన్యవాదాలు!

– *కన్నేపల్లి నారాయణమూర్తి,* శ్రీకాకుళం

★ పుట్టగంటి గోపీకృష్ణ నవల 'దేవుడితో పంతం' ఆద్యంతం ఉత్కంఠగా చదివించింది. తనదికాని పొలంలో అడుగుపెట్టరాదని చెప్పకనే చెప్పి దేవుని ఔన్నత్యాన్ని చూపింది. ముఖచిత్రం విషయంలో కొత్తదనాన్ని చూపిస్తున్నందుకు అభినందనలు.

– *హైమవతి,* మంచిర్యాల

★ సెప్టెంబరు 'చతుర'లో వచ్చిన నవల 'దేవుడితో పంతం' ఎంతగానో ఆకట్టుకుంది. సహదేవుడి రూపంలో దేవుడు, ఆదిత్య ఆలోచనలకు సమాధానంగా ఇచ్చిన వివరణ చాలా బాగుంది. దేవుడు రాసిన రాతను మానవుడు మార్చడానికి ప్రయత్నిస్తే ఎంత ప్రమాదకరంగా ఉంటుందో రచయిత చెప్పారు. కథను ఆదిత్యకు కలలో చూపించడం బాగుంది.

– *జి. దివాకర్‌రావు,* కుంటిభద్ర, శ్రీకాకుళం జిల్లా

★ సెప్టెంబరు నవల 'దేవుడితో పంతం' ఆద్యంతం ఉత్కంఠగా చదివించింది. చిన్నచిన్న తప్పులే పెనుమార్పులకు కారణమవడం ఒకింత ఆశ్చర్యానుభూతులకు లోనుచేస్తూ బాగా ఆకట్టుకుంది. 'విజేత' కథ నేటి వర్తమాన పరిస్థితులను ప్రతిబింబించింది. 'అక్షరధార' శీర్షిక చతురకు కొత్తదనం తెస్తోంది. ప్రాచీన శాస్త్రాలను శోధిస్తూ సత్యాన్వేషణ కావించడం ముదావహం.

– *శివలెంక చంద్రశేఖర్,* హైదరాబాద్

★ నేడు ప్రతి పత్రికలోనూ వస్తున్న ప్రేమలు, పెళ్లిళ్లు, కుటుంబ పరిస్థితులు వంటి అంశాలకు భిన్నంగా ఉంది సెప్టెంబరు చతుర నవల 'దేవుడితో పంతం'. ముగింపు బాగుంది. రచయితకు ధన్యవాదాలు.

– *ఎం. శ్రీనివాస్,* హైదరాబాద్

★ సెప్టెంబరు నవలలో సమకాలీన రాజకీయాలను విశ్లేషించిన తీరు వాస్తవికంగా ఉంది. బ్యాంకుల లావాదేవీలు, వ్యాపారాల గురించి బాగా తెలిపారు. ఆదిత్య పాత్రద్వారా సామాన్యుని వ్యవహారశైలిని చిత్రించారు. మల్హోత్రా గురించి చదివేటపుడు ఆమధ్య 'కింగ్‌ఫిషర్'లో నెలకొన్న సంక్షోభం గుర్తొచ్చింది. మహేష్‌లాంటి ముఖ్యమంత్రులను పాఠకులు కోరుకునేలా చిత్రీకరించారు.

– *జి. గోపాలకృష్ణ,* శ్రీకాకుళం

★ పుట్టగంటి గోపీకృష్ణ నవల 'దేవుడితో పంతం' ఎంతగానో ఆకట్టుకుంది. కొత్తగాలి యువతకు, చతురంగం పిల్లలకు ఆహ్లాదాన్నిస్తున్నాయి. చతురప్ర.జ. ద్వారా పెద్దలకు చక్కటి సూక్తులు తెలుస్తున్నాయి. మొత్తంగా చతుర అందరికీ ఉపయుక్తంగా ఉంటోంది.

– *ఎమ్.వి. సత్యసంపత్,* నర్సీపట్నం

★ సెప్టెంబరులో ప్రచురించిన పుట్టగంటి గోపీకృష్ణ నవల 'దేవుడితో పంతం' ఆద్యంతం ఆకట్టుకుంది. విభిన్నమైన కథ, దానికితగ్గ కథనం, ఒకదానికొకటి పోటీపడుతూ బిగి సడలకుండా నడిచి మమ్మల్ని ఆనందింపచేశాయి.

– *తోటపల్లి శశికళాధర్,* గుంతకల్లు


చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

# చతుర

సంపుటి -36 సంచిక - 9
429వ సంచిక, పేజీలు : 132
అక్టోబరు 2013





'అమెరికా కంపెనీల పనులు చేస్తూ ఆ సంస్కృతినిక్కడ అమలు చేస్తున్న నువ్వు పెళ్లిచూపులకొచ్చిన నా బాయ్ ఫ్రెండ్ జగ్గీకి హితోపదేశం చేశావట?' అంది శృతి.

దానికేం చెప్పాలో తోచక మౌనంగా ఉంది స్వప్నిక.

'పడకగదిలో జగ్గీ మంచి ఘటికుడు. ఓసారి నువ్వూ ట్రయల్ వేస్తావా?' అంది శృతి.

'షటప్! స్టాప్ ది నాన్సెన్స్' అరిచింది స్వప్నిక.

'అంత కోపమేంటి? అవుననో కాదనో చెప్పొచ్చు' అంది శృతి.

'ఇలా మాట్లాడితే నేనెళ్లిపోతా' అంది స్వప్నిక కోపంగా.

'ఉన్నమాటంటే ఉలుకెందుకు? కావాలంటే నీ బాయ్‌ఫ్రెండ్ అనురాగ్‌ను నేనూ పంచుకోనా?' అంది శృతి నవ్వుతూ.

ఆ తర్వాతేమైంది? ఇంతకీ ఈ ఇద్దరమ్మాయిల కథేమిటి? స్త్రీపురుషుల సంబంధాలను విశ్లేషించిన **సింహప్రసాద్** నవల

**ఒక ఆడ + ఒక మగ**

6వ పేజీలో..

బొమ్మలు : పిన్నాడ రవి

స్త్రీస్వేచ్ఛను పెళ్లి
హరిస్తుందనేది సాఫ్ట్‌వేర్
ఇంజనీర్ స్వప్నిక దృఢ
విశ్వాసం. సాంప్రదా
యిక వివాహం స్త్రీని
బంధనాలకు గురిచే
స్తుందనీ, అందులో
సుఖసంతోషాలు ఉండవని
భావిస్తుంటుంది. అలాగే స్త్రీపురుష
సంబంధాలకు సంబంధించి తను
నమ్మిన పంథాలో పయనించి నలుగురికీ
ఆదర్శంగా నిలవాలనుకుంది.
తన అభిప్రాయాలను తెలియజేస్తూ తనలాగే
ఆలోచించే మగాళ్లకోసం ఇంటర్నెట్‌లో ప్రకటన ఇచ్చింది.
ఆ తర్వాత ఏమైంది?
ఇంతకీ ఆమె నమ్మిన సిద్ధాంతమేంటి?
ఆచరణలో ఆమె గ్రహించిన దేమిటి?
ఆధునిక యువత పోకడలను అద్భుతంగా విశ్లేషించిన

సింహప్రసాద్

# ఆడ + మగ జిక

ఆమె రాధ.

అతడు కృష్ణుడు.

యమునా తీరంలో పిల్లనగ్రోవిని పెదాల కానించి మోహనరాగం సమ్మోహనంగా ఆలపిస్తున్నాడతడు.

ఆ రాగలహరిలో యమునా తరంగ మృదంగ నాదాలతో పోటీపడుతూ నర్తిస్తోందామె. ఆమె కాలి మువ్వలు ఘల్లు ఘల్లుమని మోగుతూ అతడి గుండెల్ని ఝల్లు ఝల్లు మన్పిస్తున్నాయి.

అతడు తాళలేక దూరంగా నిలవలేక ఆమెని సమీపించి, సన్నని నడుమును పిడికిట్లో బంధించాలని చూశాడు. కనీసం సందిట్లో బందీ చేయాలని యత్నించాడు.

ఊహుం... ఆమె అందలేదు. అందుకోమని వూరిస్తూ కళ్ళతో రెచ్చగొడుతూ దూరంగా జరిగింది. వగలు చూపి కవ్విస్తూ హొయలొలికించింది. సయ్యాటకు సై అంటూ సిద్ధపడ్డాడు.

ఆమె ఊరిస్తోంది. ఊగిస్తోంది. అతడు ఊరుకోలేదు. వెనుకనుంచి చుట్టేశాడు. మెడమీద ముద్దుల ముద్దరేశాడు. ఆమె వెన్నముద్దలా కరిగిపోయింది. అతడ్ని నిలువరించాలని చూసింది. జడ పట్టుకుని లాగాడు. అల్లరిగా నవ్వేడు. అతడి చూపుల చిక్కంలో చిక్కుకుపోయి గిలగిల్లాడింది.

మరుక్షణం చిత్రంగా అతడి చేతుల్లో కవ్వమై గిరాగిరా తిరిగింది.

అతడామెతో సరాగాలాడాడు. కోలాట మాడాడు. ఆమె అతడి మురళీనాదానికి నాగినియై ఆడింది. రాసలీలకు సంసిద్ధమైంది.

అంతలోనే తేరుకుని తల విదిలించి దూరంగా జరిగింది. ఆగ్రహజ్వాలల్ని వెలిగక్కాలని చూసింది. అతడి సన్నని అర నవ్వూ అల్లరి చూపులూ చల్లని నీళ్లు కుమ్మరించాయి. ఆగ్రహం కాస్తా అనుగ్రహంగా మారిపోయింది. మెత్తబడిపోయింది. మదిలోని అలజడిని అణచుకోలేక బేలగా చూసింది.

అతడు నవ్వేడు. లాలించాడు. దాసాను దాసుడ్నన్నాడు. దాసోహమయ్యాడు.

ఆమె వరదయమునయ్యింది. చుట్టేసింది. ఉక్కిరి బిక్కిరి చేసింది.

జంటగా చిందులు వేసి వేసి ఒకరిలో ఒకరు ఐక్యమైపోయారు.

ఇద్దరం కాదు ఒక్కరమే అన్నారు. ఆత్మ పరమాత్మల సంయోగమిదే అన్నారు.

నేపథ్యగానం లేదు. కేవలం వివిధ సంగీత వాయిద్యాల శబ్దాల కనుగుణంగా మైమరచి నర్తించారు.

ప్రేక్షకులు మంత్రముగ్ధులై చూశారు.

ప్రదర్శన ముగియడం ఆలస్యం కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. ఆ అద్భుత ప్రదర్శనకి నిలబడి చప్పట్లు కొట్టారు.

'టెక్ పీపుల్' అనే సాఫ్ట్‌వేర్ సంస్థ ఏర్పాటు చేసిన 'టెక్ మీట్' కార్యక్రమంలోని ఓ సాంస్కృతిక అంశమిది.

"వావ్!" అంటూ స్టేజి మీదికొచ్చింది యాంకర్.

"మనల్నందర్నీ యమునా నదీతీర విహారం చేయించిన రాధాకృష్ణులు - సారీ ..స్వప్నిక అండ్ అనురాగ్‌లకు స్వాగతం! సుస్వాగతం!"

వారిద్దరూ స్టేజిమీద కొస్తోంటే మళ్ళీ చప్పట్లు మార్మోగాయి. ఇద్దరూ వినయంగా నమస్కరించారు.

కంపెనీ ఎం.డి. స్టేజి ఎక్కి మైక్ అందుకున్నాడు.

"మన టెక్ పీపుల్‌లో ఇంతగొప్ప కళాకారులున్న సంగతి ఇప్పుడే తెలిసింది. వారికి నా హార్టీ కంగ్రాట్స్. మన విదేశీ క్లయింట్లు వచ్చేరు గనుక మన కల్చర్ని చాటే ఐటమ్స్ వుంటే బావుంటుందని చెప్పేను. ఒన్ వీక్‌లోనే ఇంత గొప్ప ఐట

# ఎస్సెమ్మెస్‌ల ద్వారా శస్త్ర చికిత్స

ఫిన్నిష్ రచయిత హన్నులుంటిమాల 2007లోనే కేవలం మెసేజీలనే గుదిగుచ్చి ఒక నవలను రాసాడు. యూరప్, ఇండియా పర్యటించే హీరో తన బంధుమిత్రులకు పంపిన మూడువేల మెసెజీలే ఈ నవల. ఎస్ఎంఎస్‌లలో ఉపయోగించే అబ్రివేషన్స్, ప్రత్యామ్నాయ పదాలు, స్పెల్లింగ్, గ్రామర్ తప్పులు మొదలైనవి ఆ ఎస్ఎంఎస్‌లలో చోటు చేసుకోవడం వల్ల ఈ నవల నిజంగా జరిగిందా? అని కొందరు పాఠకులు భ్రమకు గురయ్యారు. 323 పేజీల ఈ నవలను నోకియా సంస్థ ప్రచురించింది.



ఐదు నిమిషాల్లోనూ, ఒక్క నిమిషంలోనూ అత్యధికంగా ఎస్ఎంఎస్‌లు అందిన రికార్డు బ్రిటన్‌కు చెందిన థామస్ ఉడ్‌వార్డ్‌కి చెందుతుంది. 2011 జూన్‌లో 1213 వ్యక్తుల నుంచి ఎస్ఎంఎస్‌లను అతను అందుకున్నాడు. ఓ నెలలో అత్యధిక ఎస్ఎంఎస్‌లను పంపి, అందుకున్నవారిలో రికార్డుని నెలకొల్పింది అమెరికాకు చెందిన థాచర్. 5.59 లక్షల మెసేజీలను పంపి, 7, 532 మెసేజ్‌లను అందుకుందామె. ఓ జర్మన్ డాక్టర్ ఉగాండాలో ఓ మనిషి ప్రాణాన్ని కాపాడటానికి తనకు తెలియని అపెండిసైటిస్ ఆపరేషన్‌ను చేసి ఆ రోగి ప్రాణాలను రక్షించాడు. దాని గురించి జర్మనీలోని తన మిత్రుడు ఎస్ఎంఎస్‌ల ద్వారా వివరిస్తోంటే, వాటిని చదివి ఆ ప్రకారమే శస్త్రచికిత్స చేశాడాయన. హాలండ్‌లోని ఓ స్కూలులో జరిగిన ఆటల పోటీల విజేతల పేర్లు ఆఖరి క్షణందాకా రహస్యంగా ఉంచి, స్టేజీమీద పేర్లు ప్రకటించే వ్యక్తి చేతిలోని సెల్‌ఫోన్‌కి విజేతల పేర్లను ఎస్ఎంఎస్ చేసింది స్కూల్ యాజమాన్యం. ఈ పద్ధతిని ఇప్పుడు పాశ్చాత్య దేశాలన్నీ అనుసరిస్తున్నాయి.

మ్‌ని ప్రిపేర్ చేసి, ప్రదర్శించారు! ఇందుకు కారకులైన వారందర్నీ మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను"

కొందరు విదేశీయులు స్టేజి మీదికొచ్చి రాధాకృష్ణుల వేషాల్లో వున్న స్వప్నిక, అనురాగ్‌లతో ఫొటోలు దిగారు.

మేకప్ తీసేసుకునొచ్చింది స్వప్నిక.

"హాయ్' 'వండ్రఫుల్', 'ఫెంటాస్టిక్ ఫీట్' అంటూ అభినందనలతో ముంచెత్తారు కొలీగ్స్.

కించిత్తు గర్వంగా ఫీలవుతూనే చిన్నగా నవ్వింది స్వప్ని.

"స్వప్నీ! నీ పెర్ఫార్మెన్స్ అదుర్స్!"

"నువ్వేమీ అనుకోనంటే ఒక్కమాట. మీ జోడీ అదిరింది. మీ కెమిస్ట్రీ చూస్తోంటే మీ మధ్య ఏదో ఫిజిక్సు వున్నట్టే వుంది" కొంటెగా నవ్వింది మనస్వి.

"కలర్స్ వెయ్యకే బాబూ, అతగాడు వింటే లవ్ గేలం పట్టుకునొచ్చేస్తాడు" మరొకరన్నారు.

"స్వప్ని సంగతి నీకు తెలీదు. ఎరని కొరికేసి చక్కగా ఈదుకుంటూ వెళ్ళిపోయే రకం. నువ్వు సరిగ్గా అబ్జర్వ్ చేశావో లేదో స్వప్నిలో రాధకన్నా సత్యభామ ఎక్కువగా కన్పించింది. రాధలా సబ్మిసివ్ కాదు స్వప్ని. యామై కరెక్ట్?" రూమ్మేట్ గాయత్రి అడిగింది.

"అఫ్‌కోర్స్..." గలగలా నవ్వేసింది స్వప్నిక.

★ ★ ★

'ఇట్స్ బ్యాడ్ బ్యాడ్ వరల్డ్' సెల్‌ఫోన్ కాలర్ ట్యూన్ విని దానివంక చూసింది

స్వప్నిక. తండ్రిఫొటో కన్పించింది.

"హలో డాడీ.."

"ఏమ్మా.. ఎలా ఉన్నావు?"

"ఫైన్ డాడ్. మీరెలాగున్నారు? బీపీ, షుగర్ టాబ్లెట్సు టైం ప్రకారం వేసుకుంటున్నారా? మమ్మీ మోకాళ్ళ నొప్పులెలా వున్నాయి?"

"యోగా చేస్తున్నాంగా.. కొంచెం నయమేలే. నీకు హాస్టల్లో సౌకర్యంగా వుందా?"

"నాట్ బ్యాడ్. ఒక్క పూటేగా. డిన్నర్ కేంటీన్లో చేసేస్తున్నా"

"బాగా లేటవుతోందా స్వప్నీ?"

"అమెరికాలో ఆఫీసులు మూస్తేగాని మేం ఇక్కడ కంప్యూటర్లు షట్ డౌన్ చెయ్యడానికి లేదుకదా!" నవ్వింది.

"ఈ కంప్యూటర్ ఉద్యోగాలతో వచ్చిన చిక్కే ఇది! జీతాలు బాగా ఇస్తారన్న మాటేగాని మనిషికి సుఖముండదమ్మా. అర్ధరాత్రిదాకా ఆఫీసులో చాకిరీ చెయ్యాలంటే- రేపు పెళ్ళయ్యాక మరీ కష్టం"

"లీవిట్ డాడ్. ఐటీలో నాలాటి వాళ్లు లక్షలమందున్నారు. ఇంకేవిటి డాడ్?"

"ఏలూరు సంబంధం వద్దనేశాం. అతగాడి జీతం పాతిక వేలేనట. నెలకి నలభై వేలు సంపాదిస్తున్న నీకతడు సరిపోడని చెప్పేశా"

"ఓకే డాడ్. పెళ్లికేం తొందర్లేదు"

"కాని అబ్బాయిల పేరెంట్స్ వెంటాడుతున్నారంటే నమ్ము. అందంగా వుంటావు. బీటెక్ చేసి సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌గా జాబ్ చేస్తున్నావు. నిన్ను కోడలిగా ఎగరేసుకుపోవాలని చూస్తున్నారంతా. అవునూ.. మొన్న ఈ-మెయిల్లో ఫొటో పంపేనే.. చింతా వారబ్బాయి ఎలా వున్నాడు?"

"ప్చ్. నలుపు తెలుపు సినిమాల్లోని విలన్లా వున్నాడు"

"అయితే డ్రాప్ చేసేద్దాంలే. నిన్న మ్యారేజ్ బ్యూరోవాళ్లు పంపించారే.. అతడెలా వున్నాడు?"

"ఓకేగాని హాయిట్ 5.6 ఇంచెస్. కనీసం నాకన్నా సిక్స్ ఇంచెస్ ఎక్కువ లేకపోతే బాగుండదు డాడ్"

"సరేనమ్మా. అలా వున్నవాళ్లనే చూద్దాం. నీకన్నివిధాలా నచ్చిందే చేస్తాను. పిల్లల ఇష్టాయిష్టాల్ని కాదనే అందర్లాటి తండ్రిని కాదు"

"ఐనో ఇట్ డాడ్. అయామ్ ప్రౌడాఫ్ యూ.."

లైన్లో కొచ్చింది తల్లి.

"ఇందాకట్నుంచి మీ మాటలన్నీ వింటూనే వున్నాను. అబ్బకి తగ్గ కూతురు, కూతురికి తగ్గ అబ్బానూ! ఒకరు తానా అంటే రెండోవారు తందానా అంటూ తాళం వేస్తున్నారు. మీ పద్ధతేం బావో లేదు. ఆడపిల్లన్నాక అణకువగా వుండాలి"

"మమ్మీ దండకం చదవొద్దు, ప్లీజ్"

"ఏ వయస్సుకా ముచ్చటున్నారు. వచ్చిన సంబంధానికల్లా వంకలు పెడితే నీకింక పెళ్లెలా అవుతుందే?!"

"అవ్వకపోతే పోనియ్.. హాయిగా ఫ్రీగా వుంటాను"

"నోర్ముయ్యి. పైన తథాస్తు దేవతలుంటారు!"

"వాళ్ళు తథాస్తు అంటే బావుణ్ణు" తల్లిని ఉడికించడానికంది.

"సరిసర్లే. నీ నోటికి హద్దూపద్దూ లేకుండా పోయింది. మరీ నేల విడిచి సాము చెయ్యడం మంచిది కాదు. వచ్చిన వాటిల్లో నీకు నచ్చిందేదో చెబితే మాట్లాడి ముహూర్తం పెట్టిస్తాం. ఇదివరకట్లా మగపెళ్లివారు కట్నాలూ లాంఛనాలూ అంటూ గొంతెమ్మ కోర్కెలు కోరడం లేదు. అందుకు సంతోషించాలి"

"మైడియర్ మమ్మీ. కాలం కాంతివేగంతో మారిపోతోంది. అమ్మాయిలే ఎదురు కట్నం డిమాండ్ చేసే రోజులా

# సైకిల్ కథ

పారిస్‌కు చెందిన పియరీ 1815లో నడిచే ఓ యంత్రాన్ని కనిపెట్టాడు. అదే తొలి సైకిల్. దాని హక్కులను మిబాక్స్ అనే ఇంగ్లండ్ దేశస్థుడికి అమ్మాడు. మిబాక్స్ ఆ సైకిల్‌కు కర్ర చక్రాలకు బదులు ఇనుపవి అమర్చాడు. చక్రం బలంగా ఉండటానికి కడ్డీలను పెట్టాడు. ఇనుప చక్రానికి గట్టి రబ్బర్ టైర్ తొడిగాడు. 1876లో లాసన్ సైకిల్ చైన్‌ని కనిపెట్టి, దాన్ని మరింత అభివృద్ధి చేసాడు. ఆ గొలుసుతో చక్రాలు వేగంగా తిరగసాగాయి. సైకిల్ వినియోగం పెరిగింది.




చక్రాలు తిరిగేటప్పుడు కలిగే ఒరిపిడికి చప్పుడు కాకుండా 1877లో ఒకతను బాల్‌బేరింగ్స్ కనిపెట్టాడు. జాన్ బొయిడ్ రబ్బర్ టైర్లను, లోపల ట్యూబ్‌ని కనిపెట్టాడు. అంతకుముందు గట్టి టైర్ వల్ల వేగం సాధ్యమయ్యేది కాదు. అది ఇప్పుడు పెరగడంతో సైకిల్ ప్రాచుర్యం పొందింది.

1895 నాటికి సైకిల్‌ని ధనవంతులు మాత్రమే వినియోగించేవారు. అప్పట్లో సైకిల్ తొక్కే వారిని హీరోలా చూసేవారు. రెండు చక్రాల మీద పడిపోకుండా బ్యాలెన్స్ చేయడం అబ్బురంగా ఉండేది. 1896లో ఇద్దరూ కలిసి వెళ్లే ఏర్పాటు గల సైకిళ్లు తయారయ్యాయి.

సైకిళ్లు విరివిగా వచ్చాక వాటికోసం మంచి రోడ్లు వేయాలని ప్రజలు ఉద్యమించసాగారు.

సైకిళ్ల వినియోగం పెరిగేకొద్దీ కంపెనీలు అధికమయ్యాయి. తమ కంపెనీలో తయారైన సైకిల్ ఎక్కి ఊరంతా తిరిగేవారికి జీతాలు ఇచ్చే ఉద్యోగాలు ఉండేవి. సైకిళ్లను సైన్యం, అగ్నిమాపక దళాల్లో ఉపయోగించేవారు.

క్రమేపి సైకిల్‌ను తొక్కే పనిలేకుండా, దానికి పెట్రోల్‌తో నడిచే యంత్రాన్ని జత చేసారు. అదే నేటి మోపెడ్. దాని హార్స్ పవర్ పెంచి స్కూటర్‌గా మలిచారు. 1960లో మన హైదరాబాద్‌కు 'సిటీ ఆఫ్ సైకిల్స్' అని పేరు ఉండేదట.




# ఎత్తైన శివుడు!



నేపాల్‌లో 2010లో నూట నలభై మూడు అడుగుల ఎత్తయిన శివుడి విగ్రహాన్ని ఆవిష్కరించారు. భారతీయ వ్యాపారవేత్త కమల్ జైన్ దీని నిర్మాణ ఖర్చుని భరించాడు. సిమెంట్, కాంక్రీట్, ఇనుముతో నిర్మించిన ఈ విగ్రహానికి జింక్, కాపర్‌లతో పైన నగిషీలు దిద్దారు. మెడలో పాము, చేతిలో త్రిశూలం గల ఈ విగ్రహాన్ని బదరీనాథ్‌లోని ఆదిశంకరాచార్య మఠానికి చెందిన స్వామీజీ మాధవ్‌శరణ్‌జీ మహరాజ్ ఆవిష్కరించారు.

ఖాట్మండుకు ఇరవై కిలోమీటర్ల దూరంలో గల సంగా అనే గ్రామంలో నాలుగు లక్షల చదరపు అడుగుల రిసార్టు వద్ద ఇది ఉంది. ఆ ప్రదేశం పర్యాటక ప్రాంతంగా అభివృద్ధి చెందడానికి అక్కడ ఈ విగ్రహాన్ని ఏర్పాటు చేసారు. అక్కడ పిల్లల పార్క్, రెస్టారెంట్, స్పా, హెల్త్ సెంటర్, యోగా, ధ్యానకేంద్రం, పదహారు గదుల గెస్ట్‌హౌస్ కూడా ఉన్నాయి.

చ్చాయి. ప్రతి పదిమంది మగాళ్లకి ఎనిమిది మందే ఆడవాళ్లున్నార్ట!" పకపకా నవ్వింది స్వప్నిక.

"చాల్లే సంబడం. వయసొచ్చిన ప్రతి ఆడపిల్లా మెడ నిండాలనీ ఆపైన ఒడి నిండాలనీ కోరుకుంటుంది. నువ్వేమిటే ఇలా తలతిక్కగా తయారయ్యావ్!"

"మమ్మీ! ఇది అమ్మల కాలమూ అమ్మమ్మల కాలమూ కాదు. మీకు లేని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మాకున్నాయి. మాకు ఆర్థిక స్వేచ్ఛ వుంది. సమాజంలో గుర్తింపు వుంది. గౌరవం వుంది. పురుషుడితో సమానంగా పోటీ పడగల అవకాశాలు ఉన్నాయి. మాకేది బావుంటే అలా, ఎలా బావుంటే అలా జీవించగల హక్కా వుంది"

"అలా అని విర్రవీగడం తప్పు. ఆడదైనా మగాడైనా ఎవరి హద్దుల్లో వాళ్లుంటేనే సుఖం, సంతోషం. నలుగుర్తో నారాయణ కులంతో గోవింద అని పెద్దలు వూరికే అన్లేదు. అందరిలానే మనమూ.. అందరితోబాటే మనమూనూ!"

"నీకో కొటేషన్ చెప్పనా? నలిగిన దారిలో నడిచేవాళ్లు సామాన్యులు. కొత్త దారి తొక్కేవాళ్లు వైతాళికులు. మొదటి వారు చరిత్రలో జీవిస్తారు. రెండోవారు చరిత్ర సృష్టిస్తారు"

"మనకా చరిత్రలూ చట్టుబండలూ ఎందుకే తల్లీ.. పసుపుకుంకాలతో పిల్లాపాపల్తో నిండునూరేళ్లు చల్లగా వర్ధిల్లితే అంతేశాన!"

"నిన్నింక ఆ దేవుడు కూడా మార్చలేడు. మీ బూజు పట్టిన మెదళ్లని యాసిడ్‌తో కడిగినా అవి శుద్ధి కావుగాని నన్ను వదిలేసెయ్యి మమ్మీ!"

"ఓ అయ్య చేతిలో పెట్టేదాకా ఎలా వదుల్తాను, చెప్పు?"

తలపట్టుకుంది. "డాడీ సేవ్ మీ..."

ఆమె గట్టిగా అరిచేసరికి తండ్రి లైన్లోకొచ్చాడు.

"మీ అమ్మ చాదస్తాన్నేం పట్టించుకోకు స్వప్నీ. నీకెలా బావుంటే అలా వుండు. నా సపోర్టు నీకే"

"థాంక్యూ డాడ్. ఐ లవ్యూ డాడ్" ఉత్సాహంగా సెల్ ఆఫ్ చేసింది.

వారి సంభాషణంతా విన్న గాయత్రి మెల్లగా అంది "మీ అమ్మగారి ఆరాటాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించు"

"ట్రాష్. ఆవిడంటే సత్తెకాలపు మనిషి. నీకేమయ్యిందే!"

"లోకాన్ని చూసిన అనుభవం వారిది. మనం చిన్న వయస్సులో పెద్ద జీతాలు సంపాదిస్తున్న వాళ్ళం. మన సంపాదన మన విలువల్ని తొక్కెయ్యకూడదు"

"చేతినిండా డబ్బుండటం వల్ల నిర్లక్ష్యంగా బిహేవ్ చేస్తున్నాననంటావ్?"

"నీది మనీ ఇచ్చిన భరోసా. తెగింపు. భద్రత. కాదంటావా?"

"నాకవన్నీ అనవసరం. సంప్రదాయాల సంకెళ్లని ఛట్‌ఫట్‌మని తెంపేసి కొత్త మార్గం పట్టాలని వుంది. సరికొత్త జీవన విధానానికి నాంది పలకాలని వుంది. ఆడది తలచుకుంటే ఏం చేయగలదో, ఈ సమాజాన్నెలా ఆటాడించగలదో ఎలుగెత్తి ఈ జనానికి చాటాలని వుంది. స్త్రీ శక్తి ఏ

## కొత్తగాలి...

**గాంధీ టోపీనే కాదు..**
**బాపూజీ ఆదర్శాలనూ**
**తలకెక్కించుకోవాలి**
**అపుడే ప్రజాస్వామ్యం పదిలం**

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

మిటో ప్రపంచానికి చూపించాలనుంది!"

స్వప్నిక వంక విస్మయంగా చూసింది గాయత్రి.

★ ★ ★

కూకట్‌పల్లి జె.ఎన్.టి.యు. దగ్గర కంపెనీ క్యాబ్ ఎక్కింది స్వప్నిక. అను రాగ్ విష్ చేశాడు.

"హాయ్! మీరెక్కడుంటున్నారు? "

"ప్రగతినగర్‌కి ఈ మధ్యే మారాను. అక్కడి పద్ధతులూ, ఆ గ్రీనరీ నాకు బాగా నచ్చాయి. మీకు తెలుసా? ప్రగతినగర్లో సిగరెట్లూ, బ్రాందీ విస్కీలు అమ్మరు. ప్లాస్టిక్ బ్యాగ్స్ వాడరు. ఐడియల్ విలేజ్" అన్నాడతను.

"విన్నాను. మా ఫ్రెండొకరు అక్కడ ఫ్లాట్ కొనుక్కున్నారు"

"మీరూ కొనండి. చీప్ అండ్ బెస్ట్" స లహా ఇచ్చాడు.

"మెల్లగా ప్లాన్ చెయ్యాలి"

"మన డాన్స్ ప్రోగ్రాంకి మంచి అప్లాజ్ వచ్చింది. నాకంటే మీకే ఎక్కువ మార్కు లేశారు మా ఫ్రెండ్స్"

కించిత్తు గర్వంగా ఫీలయ్యింది. తిరిగి తనని పొగుడుతుందని ఆశించిన అను రాగ్ కాస్తంత నిరాశపడ్డాడు.

"మీ బ్లాగ్‌లో లేడీస్ గురించి బాగా రాశారు. మీ భావాలతో మనస్ఫూర్తిగా ఏకీ భవిస్తున్నాను. మీరన్నట్లు ఆడవాళ్ళ మైండ్‌సెట్ మారాలి. మగవారితో సమా నంగా అన్ని రంగాల్లోనూ విజయం సాధి స్తున్నారు. అటువంటప్పుడు తమని తాము తక్కువగా భావించుకోవడం, అర్థం లేని నీతుల్నీ సంప్రదాయాన్నీ పట్టుకు వేలాడటం అనవసరం. అసలు పూర్వకా లపు స్త్రీకి, ఆధునిక మహిళకీ పోలికే లేదు. వారి దృష్టీ, దృక్పథం ఆ మేరకు మార్పు చెందాల్సిందే"

తన అభిప్రాయాలని ఒక మగాడు మెచ్చుకునేసరికి పొంగిపోయింది స్వప్నిక. తన భావాలు సరియైనవన్న నమ్మకం పెరిగింది. తను సవ్యమైన దారిలో నడు స్తోందన్న విశ్వాసమూ బలపడింది.

"మగాళ్లు మారాలి.. మగవారి దృక్పథం మారాలి.. బుద్ధి మారాలి.. అంటారు గాని నిజానికి మారాల్సింది ఆడవారే. నూతిలోని కప్పల్లా ఆలోచించడం మాను కోవాలి. అన్నివిధాలా మగాడితో సమాన మన్న భావనని పెంచుకోవాలి. విశ్వసిం చాలి. ఆచరణలో పెట్టాలి"

"ఐ సపోర్ట్ యూ"

హైటెక్ సిటీలోని టెక్ పీపుల్ కంపెనీ ముందు క్యాబ్ ఆగింది.

ఇద్దరూ చిర్నవ్వులతో వీడ్కోలు చెప్పు కుని ఐడీ కార్డ్స్ స్వైప్ చేసి లోపలికి ప్రవే శించారు.

ట్రయల్ ప్రాజెక్టుని రన్ చేస్తోంటే టీమ్ లీడ్‌గా బాధ్యతని అప్పగిస్తున్నట్టు హెచ్చార్ నుంచి ఉత్తర్వు అందింది స్వప్నికకు.

'చేయగలనా? ' సందిగ్ధపడింది. ఒక్క క్షణమే. ఆ వెంటనే 'ఐ కెన్ డూ' అను కుంది స్థిర చిత్తంతో.

థాంక్స్ చెప్పి టెక్నికల్ డైరెక్టర్ని కలి సింది.

"నువ్వు గూడ్స్ డెలివర్ చేస్తావన్న నమ్మకం వుంది. అందుకే కొత్త ప్రాజెక్టు లోని ఓ పార్ట్ నీకప్పగిస్తున్నాం. ఫైవ్ మంత్స్ టైముంది. కాని నేన్నీకు ఫోర్ మంత్సే ఇస్తున్నాను. యూ హేవ్ టు ప్రూవ్ యువర్ సెల్ఫ్"

భరోసా ఇస్తూ చూసింది.

"ఇందులో టెక్నికల్ డీటెయిల్స్ వున్నాయి. నీ టీమ్‌లోకి ఎవరెవర్ని తీసు కుంటానంటావో హెచ్చార్‌కి చెప్పు. హీ విల్ ఇష్యూ నెసెసరీ ఆర్డర్స్"

ఏనుగెక్కినంత సంబరంగా వుంది



స్వప్నికకి. తనిప్పుడు టీమ్ లీడ్! లీడర్!!

తనకున్నలాంటి క్వాలిఫికేషన్సే వున్న ఓ గ్రూప్‌కి తను లీడర్. తను చెప్పినట్టు వాళ్ళు చేస్తారు. తనక్కావాల్సింది చెప్పి, వాళ్లచేత చేయిస్తుంది. డెడ్‌లైన్ లోపే ప్రాజెక్టుని పూర్తి చేయిస్తుంది.

కేంటీన్లోకెళ్లి వేడివేడి టీ సిప్ చేస్తూ తండ్రికి ఫోన్‌చేసి తన ఆనందాన్ని పంచింది.

"ఓహ్ గ్రేట్. నాకు తెలుసు మై బేబీ. యూ ఆర్ గ్రేట్. ఇంకా గొప్ప పేరు తెచ్చుకుంటావు. నాకే కాదు, మన వంశానికీ గొప్పపేరు తీసుకొస్తావు"

"ఇదంతా మీరిచ్చిన ప్రోత్సాహం వల్లే సాధ్యమైంది డాడ్. ఆడపిల్లనని తక్కువగా చూడకుండా అబ్బాయిలా పెంచారు. చదివించారు. నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దారు. యూ ఆర్ మై మెంటర్ డాడ్"

"చదివిన చదువును సార్థకం చేసుకుంటున్నావు. నాకు చాలా ఆనందంగా వుంది తల్లీ. నువ్వో ఇంటిదానివైతే చాలు.. హాయిగా కృష్ణా రామా అనుకుంటూ కూర్చుంటాం" అంది తల్లి.

"ఆఫీసులో వున్నాను మమ్మీ, పెళ్లి భారతం విప్పొద్దు..."

"త్వరగా ఇన్ని అక్షింతలు వేస్తే మా బాధ్యత తీరిపోతుంది. మా తపన అర్థం చేసుకోవే. జీవితం లెక్కల ప్రకారం నడవదు. కాస్త అటూ ఇటూ అవుతుంది. మనమే సర్దుకుపోవాలి"

"సారీ మామ్. ఎడ్జస్టవడం అన్న పదం నా డిక్షనరీలో లేదు. బై" నవ్వుతూ కట్ చేసింది స్వప్నిక.

ఆ వెంటనే అనురాగ్‌ని తన టీమ్‌లోకి తీసుకోవాలని నిశ్చయించుకుంది.

అతడి పని నచ్చా? లేక అతడు తన అభిప్రాయాలను బలపరుస్తున్నాడనా? లేక తనతో డ్యాన్స్ చేసినందున ఏర్పడిన సాన్నిహిత్యమా? అదీ ఇదీగాక అతడంటే ఏర్పడిన సాఫ్ట్ కార్నరా?

ఇందులో ఏదైనా కారణం కావొచ్చు. లేదా అన్నీ కావొచ్చు. ఏమైతేనేం ఆమె నిర్ణయం తీసేసుకుంది!

★ ★ ★

'టెక్ పీపుల్'లోనే పనిచేసే నీహారిక, కామేశ్వర్రావు ఆత్మహత్య చేసుకున్నారన్న వార్త సహోద్యోగుల్ని కుదిపేసింది. మరో కొలీగ్ వెంకట్ ఆందోళన పడుతూ "సూయిసైడ్ నోట్ దొరికిందిట" అన్నాడు.

"డౌరీ హెరాస్‌మెంటా? " స్వప్నిక ప్రశ్నించింది.

"నోనో. లైఫ్ బోర్‌గా, నిస్సారంగా వుందిట. మొనాటనీ భరించలేకపోతున్నార్ట. బతుకంటే విసుగు, రోత కలిగాయట. ఇల్లు, ఆఫీసు, కంప్యూటర్లు, ప్రాజెక్టులు, డెడ్‌లైన్లు, పరుగులు, తినడం, పడుకోవడం, మళ్లీ పరుగుపెట్టడం- ఈ రొటీన్తో విసిగిపోయార్ట. సూయిసైడ్ చేసుకుంటే వాటినుంచి విముక్తి లభిస్తుందనీ.."

ఉలిక్కిపడ్డారంతా. మొఖమొఖాలు చూసుకున్నారు. గుండెల్లో సన్నని బాధ. మరేదో కలవరపాటు!

"సంతానముంటే ఇలాంటి సమస్య రాదు" గాయత్రి అంది జనాంతికంగా.

"ఉమ్మడి కుటుంబాలు చితికిపోవడం

**కొత్తగాలి...** 

**నిరవధిక సమ్మెలు**
**నిరాహార దీక్షలు**
**నిరసన వ్రతాలు**
**ప్రజలకు వెత..**
**పత్రికలకు మేత!**

– తాజీ ప్రసాద్, చెన్నై

వల్ల వచ్చిన అనర్థాలివి" అని ఒకరంటే, "హాబీలుంటే నిర్లిప్తత చోటు చేసుకోదు. లైఫ్ ఉత్సాహంగా వుంటుంది" అన్నారింకొకరు.

"అసలు వివాహ వ్యవస్థలోనే ఏదో లోపముందన్పిస్తోంది. ఇవాళ రేపు భార్యాభర్తల సంబంధం బానిస యజమాని రిలేషన్లా వుంటోంది" సాలోచనగా అన్న స్వప్ని వంక చిత్రంగా చూశారంతా.

"మరీ వక్రంగా ఆలోచించకు. ఒకటి రెండు చెదురుమదురు సంఘటనల్ని బట్టి మొత్తం మ్యారేజ్ సిస్టంనే తప్పు బట్టడం సరికాదు. లోపాలుండకపోవు. సమస్యలు రాకపోవు. సంయమనంతో చక్కదిద్దుకోవాలి"

గాయత్రి మాటలకి అసహనంగా చూసింది స్వప్ని.

స్వప్ని, గాయత్రి మరికొందరు కొలీగ్స్ వివిధ వాహనాల మీద నిజాంపేట్ రోడ్ లోని నీహారిక ఇంటికెళ్లారు.

అప్పటికే చాలామంది జనం పోగైవున్నారు. పోలీసువారూ ప్రెస్‌వారూ హడావిడి చేస్తున్నారు.

విగతజీవుల్ని చూశాక స్వప్ని మెదడులో సంఘర్షణ! వివాహ వ్యవస్థ మీద పెల్లుబికిన క్రోధం! ఇలాటి వాటికతీతంగా ఏదో చేసెయ్యాలన్న తపన!

కన్నీరు మున్నీరుగా విలపిస్తూ నీహారిక తల్లిదండ్రులొచ్చారు.

"నా బిడ్డ పిరికిది కాదు. దాని చావుకి అత్తమామలే కారణం. ఇంకా కట్నం తెమ్మని నా బిడ్డని వేధించారు. ఆ బాధ పడలేక, మాకు చెప్పలేక ఈ అఘాయిత్యానికి పాల్పడింది నా బిడ్డ" అని ఒకటే ఏడుస్తోంది తల్లి.

నీహారిక తల్లి మాటలకు ఉలిక్కిపడ్డారంతా. కొత్తకోణం కన్పించడంతో ఆమెనో పక్కకి తీసుకెళ్ళి ప్రశ్నించసాగారు పోలీసులు.

'నిస్సందేహంగా ఇది కట్నంకోసం చేసిన హత్యే' అనుకుంది స్వప్ని. మరింకక్కడ నిలబడలేకపోయింది.

"మూడ్ ఖరాబయ్యింది. హాస్టల్ కెళ్లిపోతాను. కంపెనీకి ఫోన్‌చేసి చెబుతాన్లే" గాయత్రికి చెప్పి బయటికి నడిచింది.




ఆటో ఎక్కబోతోంటే ఫోన్ మోగింది.

"స్వప్నికా ఎక్కడున్నావ్?"

బావ పరాంకుశం గొంతు విని తొట్రుపడింది. "ఇక్కడే.. నిజాంపేట రోడ్‌లో.."

"ఆఫీసెగ్గొట్టి ఎక్కడెక్కడో చక్కెర్లు కొడుతున్నావా? ఎవరూ దగ్గర్లేరు కదాని నీ ఇష్టం వచ్చినట్లు తిరుగుతున్నావన్నమాట. ఆడది తిరిగి చెడిందీ, మగాడు తిరక్క చెడ్డాడూ అని వూరికే అన్లేదు"

ఆమె మనస్సు చేదుగా అయ్యింది. ఆయనెప్పుడూ అంతే. చేస్తోంది బడిపంతులు ఉద్యోగమైనా సరే, అథార్టీ చేస్తూ మాట్లాడతారు. ఆడవాళ్ళనైతే మరీ తీసికట్టుగా చూస్తారు.

"ఎందుకు ఫోన్ చేశారు?"

"నేనేమీ పనిలేనివాడ్ని కాదులే. ఫెడరేషన్ పనిమీద హైదరాబాదొచ్చాను. నువ్వెలాగున్నావో చూసిరమ్మని మీ నాన్న గోల పెడితే చూట్టానికొస్తున్నాను"

మరో నాలుగు కాల్స్ ఖర్చయ్యాక బావ

గార్ని కలిసింది స్వప్నిక.

"అక్కా పిల్లలూ, బావున్నారా బావా? "

"బావుండకేంజేస్తారు? ! ఎప్పుడో పదేళ్ళ క్రితం కూకట్‌పల్లి వచ్చాను. అప్పుడు నిద్ర పోతున్న గ్రామంలా వుండేది. ఇప్పుడు హైటెక్కుల సోకుల్తో ఓ వెలుగు వెలుగు తోంది"

ఆమె వంక తేరిపార చూస్తూ "నువ్వు నునుపు దేరేవు గాని చిక్కేవు. జీతం నగ లకీ చీరలకీ తగలేస్తున్నావా.. ఏమైనా దాస్తున్నావా? మీ నాన్నేమీ పెద్ద కట్నాలి వ్వలేదు. నువ్వే కూడబెట్టుకోవాలి" అన్నాడు పరాంకుశం.

'కట్నం అడిగేవాడు నాకక్కర్లేదు' అన బోయి, ఆ మాటలు మింగేసి "హోటల్లో కూర్చుని మాట్లాడుకుందాం, రండి" అంది.

"మీకేం కావాలో ఆర్డరివ్వండి" మెనూ కార్డు అందిచ్చింది.

"ఇయన్నీ మనుషులు తిండానికేనా? అలా అన్పించట్లేదు. ఎందుకొచ్చిన తిప్పలు గాని భోజనం తెమ్మను"

"సౌత్ ఇండియనా.. నార్త్ ఇండి యనా? " ఉడికించాలని అడిగింది.

"నార్త్ తిండ్లు కూడా తింటున్నావన్న మాట. చేతిలో రూపాయలుంటే ఆడది ఎగిరెగిరి పడుద్ది. ఎక్కడెక్కడికో ఎగిరి పోద్ది. నేలని వదిలిన మొక్క బతకదు, ఏంటనుకున్నావో!"

ఆమెమొహం ఎర్రగా కందింది. ముక్కు పుటాలదుర్తోంటే కోపం కంట్రోలు చేసు కుంటూ అంది "మీ మాటలకు అర్థం పర్థం ఏమైనా వుందా? స్కూల్లోనూ ఇలాగే పాఠాలు చెబుతున్నారా? "

"ఎవరికెలా పాఠాలు చెప్పాలో నాకు తెలుసులే. నీ సంగతేంటి. పెళ్లి చేసుకో మంటే మంత్రాలు చదువుతున్నావంట? నువ్వేదో ఆకాశం నుంచి వూడిపడ్డానను కుంటున్నావా? నువ్వేం చదివినా.. ఎంత సంపాదిస్తున్నా మొదట ఆడదానివి. ఆ సంగతి గుర్తెట్టుకో. నీకోసం రాకుమారులు రెక్కల గుర్రాలెక్కిరారు. మేం చూసినోడి చేత మూడు ముళ్ళేయించుకో. నువ్వు సుఖపడ్తావు. ముసలాళ్ళు సంతోషిస్తారు"

ఒళ్ళంతా ఎర్ర చీమలు పాకుతున్నట్టుగా వుందామెకి.

అతడంటే వున్న అసహ్యం రెట్టింప య్యింది. పురుగులా చూసింది.

"నేన్చెప్పేది ఒళ్ళు దగ్గరెట్టుకుని విను. ఆడది పెళ్ళయ్యేదాకా తండ్రి చెప్పినట్టు వినాలి. పెళ్ళయ్యాక మొగుడు చెప్పినట్టు నడుచుకోవాలి. నడుం వంగేక పిల్లలు కోరినట్టు ఉండాలి. అప్పుడే ఆడబతుకు సుఖంగా తెల్లారుతుంది"

"స్త్రీకి నోరు, కళ్ళు, చెవులు, మెదడు ఏమీ వుండకూడదు. ఉన్నా ఉపయోగించ కూడదు. చదువుకున్నవాడివీ, టీచరు ఉద్యోగం చేస్తున్నవాడివీ నువ్వు చెప్పాల్సిన మాటలేనా ఇవి? " అంది స్వప్నిక.

నిటారుగా అయ్యి సూటిగా చూశాడు పరాంకుశం.

పొరపాటున ఏకవచనం ప్రయోగించిన సంగతి గుర్తొచ్చి పెదవి కొరుక్కుంది స్వప్ని.

"గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించడవంటే ఇదే. మనిషి చూపెప్పుడూ కిందికి వుండాలి. పైకి కాదు!"

ఆమె మాట్లాడలేదు. లోలోన ఉడికిపో తోంది. అతడి ధోరణి మాటలు ప్రవర్తన ఆమెకి అసహ్యం పుట్టిస్తున్నాయి. అతడి మీదపడి రక్కెయ్యాలన్పిస్తోంది.

వెళ్ళబోతూ సంచిలోంచి స్టీలు డబ్బా తీసిచ్చాడు. "సున్నుండలు. నీకిష్టమని మీ అక్క నిన్ననే వెన్నకాచి చేసిచ్చింది"

మౌనంగా అందుకుంది.

"శ్రావణంలోపు వీలైన సంబంధం చూస్తాం. తకరాలు చెయ్యకుండా తలొం

చుకుని తాళి కట్టించుకో. మా బాధ్యత తీరిపోద్ది. ఆనక నీ మొగుడ్తో కలిసి ఎన్ని వేషాలేస్తావో, ఎన్ని ఎగుర్లు ఎగుర్తావో నీ ఇష్టం. అందాకా ఒళ్ళు దగ్గరెట్టుకుని జాగ ర్తగా వుండు"

స్టీలుడబ్బాని అతడి మీదకి విసిరెయ్యా లన్నంత ఆవేశమొచ్చింది.

అక్క అమాయకపు ముఖం గుర్తురాగా నిగ్రహించుకుంది. 'ఈయన్తో ఎలా వేగు తున్నావే అక్కా! నేనైతే నిద్రపోతున్నప్పుడు మొండికత్తితో పొడిచి చంపేసేదాన్ని!' కసిగా అనుకుంది స్వప్నిక.

★ ★ ★

"వావ్!"

సంతోషం పట్టలేక అరిచింది స్వప్నిక.

నిద్రపోతోందల్లా చటుక్కున లేచి కూర్చుంది గాయత్రి.

"ఏవయ్యిందే? " గాభరాగా అడిగింది.

"సుప్రీంకోర్టు హిస్టారికల్ జడ్జ్‌మెంట్ ఇచ్చిందే. కమాన్.. గెటప్" దినపత్రిక చూపిస్తూ ఎగ్జయిటింగా చెప్పింది.

"దేని గురించే..? "

"లివ్ ఇన్ రిలేషన్‌షిప్ గురించి. అదేనే పెళ్లి చేసుకోకుండా సహజీవనం చేయడం గురించి. వివాహానికన్నా ముందే సెక్స్ అనుభవం కలిగి వుండటం గురించి"

"నాకేం అర్థం కావట్లేదు. అయినా అదేదో పెద్ద సంతోషకరమైన వార్త అయి నట్లు అంతలా అరవాలా? బంగారం లాంటి నిద్ర పాడుజేశావ్ కదే!" ఆవులిస్తూ అంది.

"నిద్రకి గోలీమారో. ఇంత గొప్ప తీర్పు వస్తే అలా నిమ్మకి నీరెత్తినట్టు వున్నా వేంటే? "

"ఏం చెయ్యను? నీలా అరుస్తూ డాన్సె య్యనా? "

"అంతపని చెయ్యనక్కర్లేదు. సినీనటి ఖుష్బూని అభినందిస్తూ మెయిల్ పంపించు చాలు" ల్యాప్‌టాప్‌లో దేనికో సమో సెర్చ్ చేస్తూ అంది స్వప్నిక.

"మధ్యలో ఈ ఖుష్బూ గొడవేంటే? "

"మైగాడ్! నీకా విషయాలేవీ తెలీదా? " ఆశ్చర్యబోతూ అడిగింది.

"ఉహూ.."

"అప్పుడెప్పుడో.. ఎప్పుడంటే.." న్యూస్ పేపర్లోకి తొంగి చూసి చెప్పింది

"2005లో నటి ఖుష్బూ ఒక చర్చలో పాల్గొని 'గర్భం రాకుండా, లైంగిక వ్యాధులు సోకకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటే వివాహానికి ముందు సెక్స్ తప్పేం కాదు' అని బాలికలకు సలహా ఇచ్చింది. తర్వాత ఓ పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ 'చదువుకున్న మొగాడెవరూ తన భార్య కన్యగానే తన జీవితంలోకి అడుగు పెడుతుందని ఆశించడు' అని ఓ బాంబు పేల్చింది. అంతేగాక వివాహ బంధం లేకుండా యువతీయువకులు కలిసి జీవిం చడాన్ని కూడా సమర్థించింది. ఆమె వ్యాఖ్యలకు తమిళనాడులోని సంప్రదాయ వాదులు భగ్గుమన్నారు. కొన్ని రాజకీయ పక్షాలు తోడయ్యాయి. ఖుష్బూమీద మొత్తం 22 కేసులు దాఖలయ్యాయి"

"బాగానే వుంది. సుప్రీం కోర్టు ఏమని తీర్పు ఇచ్చిందేవిటి? "

"ఆ కేసులన్నీ కొట్టేసింది. ఇద్దరు పెద్ద

**కొత్తగాలి...**

**మత్తుమందుల**
**స్వీకారం!**
**మతి భ్రమణకు**
**శ్రీకారం!!**

– జి.వి. రాఘవేంద్రరావు,
మచిలీపట్నం

వాళ్ళు కలిసి జీవించడం నేరం కాదంది. పురాణాల ప్రకారం రాధాకృష్ణులు కూడా అలా కలిసి వున్నారంది. స్త్రీ పురుషుల సహజీవనాన్నిగాని, వివాహేతర్పూర్వ సెక్స్‌ని గాని నిషేధిస్తోన్న చట్టమేదీ లేదని పేర్కొంది. సహజీవనం చేయడం జీవించే హక్కు తప్ప నేరం కానే కాదంది"

సంబరంగా చెబుతోన్న స్వప్నిక వంక చిత్రంగా చూసింది గాయత్రి.

"కేసు గెలిచినందుకు ఖుష్మా సంతోష పడితే అర్థముంది గాని నువ్వే గెలిచినట్టు పొంగి పోతున్నావేంటి? "

"యస్, దటీజ్ ద పాయింట్. నా అభి ప్రాయమూ అదేనే. సో.. నా భావాలకి విజయం లభించినట్టే కదా!"

పిచ్చిగా చూసింది గాయత్రి. "ఆర్యూ సీరియస్? "

"డ్యామ్ సీరియస్. పెళ్ళనే సంకెళ్ళు తగి లించుకోకుండా, పెళ్ళివల్ల సంక్రమించే ఝుంఝూటంలో పడకుండా ఒక ఆడ, ఒక మగ కలిసి వుండొచ్చు. సహజీవనం చేయొచ్చు. ఎవరి హక్కులూ స్వేచ్ఛలూ పోకుండా కలిసి బతకొచ్చు. సమాన భాగ స్థులుగా వుండొచ్చు. వివాహ వ్యవస్థ ఇవ్వ లేని సమానత్వాన్ని స్వేచ్ఛని లివ్ ఇన్ రిలేషన్‌షిప్ ఇస్తుంది. ఐ లైకిట్! ఐ లవ్విట్!!"

స్వప్నిక కళ్ళల్లో మెరుపుల్ని చూసి స్థాణువయ్యింది గాయత్రి. పిమ్మట భయ విహ్వలయై చూసింది.

"పిచ్చివాగుడు కట్టిపెట్టు. నువ్వు వేన వేల సంవత్సరాల వివాహ వ్యవస్థని తప్పు పట్టేంత గొప్పదానివి కాదు"

ఆమె అహం దెబ్బతిందా మాటలకి. నిరసనగా నవ్వింది.

"మన వివాహ వ్యవస్థ అవుట్‌డేట్ అయ్యింది. స్త్రీని మగాడికి బానిస చేస్తోన్న ఆ దుర్మార్గపు వ్యవస్థని ఎత్తి చూపడానికి కావాల్సింది వయస్సు కాదు, ఆలోచించగల మెదడు. ఎదిరించగల స్థైర్యం!"

"పుస్తకాల కబుర్లు కట్టిపెట్టు. ఏదో తప్పుచేసి 'అన్ డు' అని సరిదిద్దుకోడానికి ఇదేం కంప్యూటర్ కాదు, జీవితం. ఆచి తూచి అడుగెయ్యకపోతే అగాధంలో పడి పోయే ప్రమాదముంది"

"ఐడోంట్ కేర్. సినీ ఫీల్డులో ఎంతో మంది అలా కలిసి వుంటున్నారు తెలుసా? మొన్నటిదాకా బిపాసాబసు, జాన్ అబ్రహాం వగైరాలంతా పెళ్లి చేసుకో కుండా కలిసి జీవించారు. ఎక్కువ తక్కు వలు లేకుండా, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కోల్పోకుండా, ఆత్మాభిమానాన్ని తాకట్టు పెట్టాల్సిన పనిలేకుండా, భయం అసూయ లాంటివేం లేకుండా చాలామంది హ్యాపీగా వుంటున్నారు. ఒకర్నొకరు గౌరవించు కుంటూ చక్కని స్నేహితుల్లా మసల్తు న్నారు. నేనూ అలాంటి లోపరహిత సహ జీవనాన్ని కోరుకుంటున్నాను. పెళ్ళి అనే ఉచ్చులో ఇరుక్కోకూడదనుకుంటున్నాను. సంప్రదాయ పాత్రని తుడిచేసి స్త్రీకి కొత్త పాత్రనివ్వాలనుకుంటున్నాను. కొత్త నిర్వచ నమై నిలవాలనుకుంటున్నాను!"

ఆందోళనగా చూసింది గాయత్రి.

స్వప్నికలో కొత్త మనిషి కన్పిస్తోంది. ఆవేశపు జలపాతంలో పడి కొట్టుకుపోతోం దన్పించింది.

అడ్డు వెళ్తే మరింత రెచ్చిపోవచ్చను కుంది.

'ఊరుకోవడమంత ఉత్తమం లేదు. మెల్లగా తనే సర్దుకుంటుందిలే. ఆవేశం తగ్గేక సెకండ్ థాట్ వచ్చేక స్థిమితపడు తుందిలే' అనుకుంది గాయత్రి.

మారుమాట్లాడకుండా దుప్పటి కప్పుకుని పడుకుంది.

ఆమె మౌనాన్ని ఓటమిగా భావించింది స్వప్ని.

# పేరులో ఏముంది!

'పేరులో ఏముంది? విషయంగానీ, వస్తువు గానీ మంచిదయితే చాలు' అనేది పాతమాట. నేడు ఏ వ్యాపార సంస్థకైనా పేరు పెట్టడానికి యాజమాన్యాలు మల్లగుల్లాలు పడటం సహజం. అంతేకాదు, దీనికి సంబంధించి నిపుణుల సహాయం కూడా తీసుకుంటారు. మనం టైప్ చేసే పదానికి సరిపోయే వందలాది వెబ్‌సైట్లను క్షణాల్లో చూపించే గూగుల్ వెబ్‌సైట్‌కు 'గూగుల్' అనే పేరు పెట్టడానికి కారణం 'గూగోల్' అనే పదం. ఒకటి పక్కన వంద సున్నాలు పెడితే వచ్చే సంఖ్యను ఈ పదంతో సూచిస్తారు. అందుకే 'గూగుల్' పేరును ఆ సంస్థ వ్యవస్థాపకులు పెట్టారు. ఇప్పుడు ఆ పదం నిఘంటువులో ఒక క్రియాపదం అయింది.



ఇలాగే 'వికీపీడియా'కు ఆ పేరు పెట్టడానికి ఎన్‌సైక్లోపీడియా ఆధారం. అందులోని పీడియాని, వికీకి కలిపి, పేరును ఖాయం చేశారు. ఎన్‌సైక్లోపీడియాలో అన్ని విషయాలు ఎలా ఉంటాయో అలాగే వికీపీడియాలోనూ ఉంటాయనేది దీని అంతరార్థం.

సామాజిక వెబ్‌సైట్ 'ట్విట్టర్' ఉద్దేశం బంధుమిత్రులకు, తమను అనుసరించేవారికి తాజా సమాచారాన్ని అందిస్తూపోవడం. చిన్న పిట్టలు ఒకదానితో మరొకటి సంభాషించుకునే శబ్దాన్ని ట్విట్టరింగ్ అంటారు. దాంట్లోంచి ట్విట్టర్‌ను తీసుకున్నారు. ముందు ట్వీట్, జిట్లర్ అనే పేర్లను కూడా అనుకుని చివరికి ట్విట్టర్ అనే పేరునే పెట్టారు. కారణం అప్పటికే ఫొటో షేరింగ్ వెబ్‌సైట్ అయిన ఫ్లికర్ పాపులర్ అవడం.

ఇలాగే యూ ట్యూబుకు ఆ పేరు పెట్టడానికి కారణం యూ అంటే యువర్‌సెల్ఫ్, ట్యూబ్ అంటే బ్రాడ్‌కాస్ట్. ఈ రెండూ కలిపి తమ ప్రతిభకు వేదికగా ఉపయోగించే వెబ్‌సైట్‌కు ఈ పేరు పెట్టారు. ఇందులో పెద్దాచిన్న చలనచిత్రాలను ఎవరైనా పోస్ట్ చేయవచ్చు.

రెట్టించిన ఉత్సాహంతో రెండు పిడికిళ్ళూ బిగించి "ఐ గాట్ ది పాయింట్!" అంది బిగ్గరగా.

★ ★ ★

స్వప్నిక ఇ-మెయిల్ బాక్స్ చెక్ చేసుకొంటోంటే రియల్ ఎస్టేట్ వారి ప్రకటన కనిపించింది.

'ఫ్లాట్ ఎట్ ప్రగతినగర్. గోయింగ్ చీప్'

అనురాగ్ చెప్పిన మాటలు గుర్తొచ్చి వెంటనే బిల్డర్‌కి ఫోన్ చేసింది.

"అంభీర్ చెరువుని ఆనుకునే వున్నాయి ఎపార్ట్‌మెంట్స్. మొన్నటిదాకా చదరపు అడుగు రెండువేల రూపాయలకు అమ్మాం. చివరి ఫ్లాట్ గనక చదరపు అడుగుకు వంద తగ్గించి ఇస్తాను. లోన్ ఫెసిలిటీ వుంది. ఆల్రెడీ ఐసిఐసిఐ బ్యాంకు వాళ్ళు ప్రాజెక్టుని అప్రైజ్ చేశారు. మీ పేస్లిప్పు, బ్యాంక్ ఎకౌంట్ కాపీ, అపాయింట్‌మెంట్ ఆర్డర్ కాపీ తెచ్చిస్తే చాలు.. మూడ్రోజుల్లో లోన్ శాంక్షన్ చేసేస్తారు"

"ఇచ్చే రేటు చెప్పండి"

"మీరొచ్చి చూడండి మేడం. మీకు నచ్చితే మాట్లాడుకుందాం"

ఫ్లాట్ కొంటే మంచిదా కాదా? ఆలోచనలో పడిందామె.

తన ఫ్రెండ్స్, కొలీగ్స్ చాలామంది బ్యాంకులోన్లు తీసుకుని ఫ్లాట్లూ, సైట్లూ కొన్నారు. కొందరు ఇన్సూరెన్సు పాలసీలు తీసుకుంటే మరి కొందరు షేర్లమీద ఇన్వెస్ట్ చేశారు.

తనే ఏమీ కొనకుండా బ్యాంకులో

దాస్తోంది. పెళ్లికి ఉపయోగపడుతుందని దాచింది. కానిప్పుడు 'పెళ్లి'ని పక్కన పెట్టాలనుకొంటోంది గనుక ఫ్లాట్ కొనేస్తేనే మంచిదనిపించింది.

అదీగాక 'నా ఇల్లు' అనేది మనిషికెంతో ఊతమిస్తుంది, ఉత్సాహమిస్తుంది. సంతృప్తినిస్తుంది. భద్రతనిస్తుంది!

హ్యాపీ హోమ్! అవునదే 'తనింటి' పేరు!

పెదాలమీద చిరునగవు కదిలింది. అనురాగ్‌కి ఫోన్ చేసింది.

"మీ ప్రగతినగర్లో ఫ్లాట్ చదరపు అడుగు నైంటీన్ హండ్రడ్‌కి వస్తే మంచి డీలేనంటావా? "

**కొత్తగాలి...**

**తాను కరిగిపోతూ**
**వెలుగునిస్తుంది కొవ్వొత్తి**
**తాను 'చితి'కి పోతూ**
**బిడ్డల మేలు కోరుతుంది**
**మాతృమూర్తి**

– బిక్కనూరి రాజేశ్వర్, పొన్కల్

అతడు తన టీం మెంబర్. సబార్డినేట్. అంచేత కించిత్తు దర్పంగానే అడిగింది.

"ఇంకేం ఆలోచించక్కర్లేదు. కొనేసెయ్యండి స్వప్నికా"

"మీరిప్పుడు ఖాళీగానే వున్నారా? "

"వెల్కం టు ప్రగతినగర్. మీకోసం వెయిట్ చేస్తూంటాను.."

హాస్టల్లోంచి బయటపడి ఆటో ఎక్కింది. ప్రగతినగర్ చెరువు దగ్గర వెయిట్ చేస్తూ కన్పించాడు అనురాగ్.

టూ బెడ్ రూం పోర్షన్. రెండు వైపులా బాల్కనీ వుంది. ఫోన్లో చెప్పినట్టుగానే చెరువు ఫుల్ వ్యూ కన్పిస్తోంది.

ముచ్చటగా అన్పించింది.

"కార్ పార్కింగ్ ఉంది కదా? " అనురాగ్ ఆరా తీశాడు.

"ఉందిగాని దానికి యాభైవేలు అదనంగా అవుతుంది. ట్రాన్స్‌ఫార్మర్‌కీ, డ్రెయినేజ్‌కీ, డ్రింకింగ్ వాటర్‌కీ, జనరేటర్‌కీ లక్షా యాభైవేలివ్వాలి"

"టూ లాక్స్ ఎక్స్‌ట్రాగా ఇవ్వాలా? " ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఎక్కడైనా అంతే మేడం. వాటిని రేటులో కలపం"

"నేననుకున్న దానికన్నా ఎక్కువవుతుంది. రిజిస్ట్రేషన్ చార్జీలు కూడా బాగా పెరిగాయి..."

"ఆస్తి మీ స్వంతం కావాలంటే రిజిస్ట్రేషన్ తప్పనిసరి. ఆ ఖర్చు గురించి ఆలోచిస్తారేవిటి? ఫ్లాట్‌ని వాస్తు ప్రకారం కట్టాను. మీరిద్దరూ ఈ ఇంట్లో ఎంతో హ్యాపీగా వుంటారు. నాదీ గ్యారంటీ"

అతడి మాటలకు ఉలిక్కిపడ్డారు. మొఖమొఖాలు చూసుకున్నారు. ఎంబ్రాసింగ్‌గా ఫీలయ్యారు కొన్ని క్షణాలు.

"ఇంకేం అడగాల్సినవి లేవు కదా? " అనురాగ్‌ని అడిగింది.

తల అడ్డంగా వూపాడు.

"ఎయిటీన్ హండ్రెడ్ ప్లస్ టూ లాక్స్‌కి ఒప్పుకుంటే చెప్పండి ఇప్పుడే ఎడ్వాన్స్ ఇచ్చేస్తాను"

మొదట బెట్టు చేసినా తర్వాత అంగీకరించాడు.

వస్తూ వస్తూ బ్యాంకులోంచి డ్రా చేసి తెచ్చిన లక్ష రూపాయల్ని ఎడ్వాన్సుగా ఇచ్చి అగ్రిమెంటు రాయించుకుంది.

"థాంక్యూ అనురాగ్. అయామ్ గోయింగ్ టు బికమ్ ప్రౌడ్ ఓనరాఫ్ ఏ ఫ్లాట్. దీనికి ప్రేరణ మీరే"

"కంగ్రాట్స్. మనమిక్కడ్నుంచే క్యాబ్‌లో కలిసి వెళ్ళొచ్చు రావొచ్చు. ఆటోలు త్వరగా దొరకవు. నేను డ్రాప్ చేస్తాను,

రండి" చొరవగా బైక్ స్టార్ట్ చేశాడు.

"కాస్సేపు ఇక్కడ కూర్చుందాం. మా గోదావరి ఒడ్డున కూర్చున్న అనుభూతి కలుగుతుందేమో!" దారిలో అంది.

ఇద్దరూ చెరువు ఒడ్డున బండరాయి మీద కూర్చున్నారు.

"వెన్నెల్లో మీ ఫ్లాట్ బాల్కనీలో నిలబడి ఈ చెరువునీ గుట్టల్నీ ప్రకృతినీ చూస్తూ సర్వం మరచిపోవచ్చు"

"అబ్బో భావుకత్వం చిందులేస్తోందే. భావకవిత్వం రాస్తారా? "

"అప్పుడప్పుడూ.." సిగ్గుపడ్డాడు.

"ఒక కవిత విన్పించండి"

"ఇప్పుడు కాదు. ఇంకోసారెప్పుడైనా.."

"మీ గురించి చెప్పండి. సారీ.. మొదట నా గురించి చెప్పడం ధర్మం. మా డాడీ రిటైర్డ్ సీనియర్ క్లర్క్. పోస్టాఫీసులో చేసే వారు. మా చదువులకి ఇబ్బందవుతుందన్చెప్పి ప్రమోషన్లు వదులుకుని నర్సాపురం చుట్టుపక్కలకే పరిమితమైపోయారు. మమ్మీ హౌస్ వైఫ్. మేం ఇద్దరం. అక్క దీపిక. బావగారు మొగల్తూరులో టీచర్‌గా పనిచేస్తున్నారు. అక్కకీ నాకు పదేళ్ళు తేడా వుంది. డాడీ నన్ను అబ్బాయిలాగే పెంచారు. స్వర్ణాంధ్రలో బీఈ చేశాను. క్యాంపస్ సెలక్షన్. రెండేళ్ళ సర్వీసు.."

"బ్రదర్స్ లేరన్నమాట"

"ఊహూ. కజిన్స్ కూడా ఎవరూ లేరు. మీ గురించి చెప్పండి"

"మాది గుడివాడ. నాన్న బిజినెస్‌మేన్. రెడిమేడ్ గార్మెంట్స్ షాపు వుందక్కడ. మేం ముగ్గురం బ్రదర్స్, ఒక సిస్టర్. అన్నయ్య ఆంధ్రా బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. తమ్ముడు బీటెక్ ఫైనల్ ఇయర్. అమెరికా వెళ్ళి ఎమ్మెస్ చెయ్యాలని చూస్తున్నాడు. నాకూ తమ్ముడికీ మధ్యన చెల్లెలు. ఎమ్మెస్సీ చేసి అక్కడే కాలేజీలో పనిచేస్తోంది. ప్రస్తుతం తనకి సంబంధాలు చూస్తున్నాం"

"చెల్లి పెళ్ళైతే మీకు లైన్ క్లియరైపోతుందన్నమాట" నవ్వుతూ అంది, పిమ్మట నాలిక్కరచుకుంది.

జవాబుగా నవ్వేడతడు.

"మీ యాంబిషనేమిటి? "

"బాగా డబ్బు సంపాదించడం. బిజినెస్ మేన్ కొడుకుని కదా! మీ సంగతేంటి? "

"హ్యాపీగా బతకడం. సృష్టిలోని ఆనందాన్నంతా స్వంతం చేసుకోవడం. పక్షిలా స్వేచ్ఛగా ఎగుర్తూ వినూత్న తీరాలని చుట్టేసి రావడం. వెన్నెల్లో విహరిస్తూ నీటిలో ఈదుతూ గాలిలో తేలిపోతూ నాకునేనే సాటి కావడం. నన్ను చూసంతా ఈర్ష్యపడేలా వుండటం", బుగ్గలు సొట్ట పడేలా నవ్వి మళ్ళీ అడిగిందామె "నా స్వప్నం సత్యమవుతుందంటారా? "

"మనసుంటే మార్గమూ వుంటుంది కదా!"

"థాంక్యూ.. థాంక్యూ వెరీ మచ్" అప్రయత్నంగా అతడి చేతులు పట్టుకుని ఊపేసింది.

దిమ్మెరపోయాడు అనురాగ్.

★ ★ ★

ఖుష్బూ వ్యాఖ్యల్ని, సుప్రీంకోర్టు తీర్పునీ యథాతథంగా తన బ్లాగులో పెట్టింది స్వప్నిక.

తన వ్యాఖ్యానాన్నీ వివరణనీ అభిప్రాయాల్నీ కూడా నిస్సంకోచంగా జత చేసింది. ఆమె ఊహించిన దానికన్నా అధికంగా సంచలనం సృష్టించింది.

మిత్రులూ, మిత్రుల మిత్రులూ, క్లాస్‌మేట్లూ, వారి మిత్రులూ అంతా ఘాటుగా స్పందించారు.

అమ్మాయిలు- ఇంచుమించు అంతా ఆమె అభిప్రాయాలని ఏకిపారేశారు.

పెళ్ళికి ముందు శృంగారం అధర్మం, అనైతికం అన్నారు. పెళ్ళి చేసుకునే ప్రతీవారూ



ఒకర్నొకరికి పవిత్రంగా అర్పించుకోవాలన్నారు. నైతిక విలువలకు తిలోదకాలిచ్చిన జాతి మనలేదన్నారు. భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలకు ఇది వ్యతిరేకమన్నారు. చట్ట ప్రకారం శిక్షార్హం కానంత మాత్రాన నైతిక విలువల్ని మంటగలపడం సహించలేనిదన్నారు.

'పాశ్చాత్య విషసంస్కృతి ప్రభావం వల్ల చేసిన పిచ్చి ప్రేలాపన' అంటూ దుయ్యబట్టారు. ఆమెలాంటి కుక్కమూతి పిందెల్ని ఏరి పారెయ్యాలని అన్నవారూ వున్నారు.

భారతదేశంలోని అన్ని మతాలవారూ వివాహ వ్యవస్థని పవిత్రంగా భావించి గౌరవిస్తారని మరికొందరు పేర్కొన్నారు. అలాంటి సమాజ రక్షక వ్యవస్థమీద దాడి చేయబూనటం దుస్సాహసం, అవివేకం, హేయం అంటూ ఖండించారు.

విపరీతకామంతో శృంగారమే పరమావధిగా భావించే వారి రాతల్నీ చేతల్నీ పట్టించుకోనక్కర్లేదని, ఇలాటివాటికి 'చెదిరే' 'బెదిరే' 'అదిరే' స్థితిలో మన వివాహ వ్యవస్థ లేదన్నారు మరికొందరు. భారతీయ సాంప్రదాయం అత్యంత పవిత్రమైనది కనుకనే పాశ్చాత్య దేశాలు కూడా మన సాంప్రదాయాన్ని గౌరవిస్తూ పాటించేందుకు ప్రయత్నిస్తున్నాయని వివరించారు కొందరు.

అధికశాతం యువకులు స్వప్నిని ప్రశంసల్తో ముంచెత్తారు.

ఆమె 'బోల్డ్‌నెస్'ని అభినందించారు.



హిపోక్రసీతో కుళ్ళిపోయే వారికిది చెంప పెట్టు అన్నారు. ఆమె 'రేపటి మహిళ', 'డేరింగ్ లేడీ' అన్నారు.

ఆమె ఆశించినట్టు సమానత్వం పునాది మీద ఏర్పడే సహజీవన వ్యవస్థ కను చూపు మేరలో వుందన్నారు. ఆమెలాంటి వారు చొరవగా ధైర్యంగా ముందడుగు వేసి మహిళలకి ఆదర్శం కావాలని పేర్కొన్నారు.

"నీ బ్లాగుకొచ్చిన పోస్టు చూస్తున్నావా? " అంటూ వచ్చింది గాయత్రి.

తలాడిస్తూ అంది "ట్రెమెండస్ రెస్పాన్సెస్. నన్ను తిట్టిపోస్తారనుకున్నాను. ఫరవాలేదు. నా ధోరణిని అభినందించేవాళ్లు చాలామందే వున్నారు. పిల్లిమెడలో ఎవరు గంట కడతారా అని చూస్తున్నారు"

"వాళ్ళు రాసిందంతా నిజమనుకోకు. నోటితో అభినందించి, నొసటితో వెక్కిరించేవాళ్ళు చాలామంది వుంటారు"

"ఉంటే వుండనీ. అమ్మాయిలంతా సభ్యతా సంస్కృతీ సమాజం అంటూ కలవరపడ్డారు. అబ్బాయిలేమో 'కొత్తదారి',

'సరికొత్త ఆలోచన', 'పెళ్లికి ప్రత్యామ్నాయం' అంటూ అభినందించారు"

"వాళ్ళు అభినందించింది నిన్ను కాదు, ఫ్రీ సెక్స్‌ని!"

"గాయత్రీ!"

"మగాడికి మగువ ఓ బలహీనత. ఆమెనెలాగైనా లోబరచుకోవాలని, అనుభవించాలని ప్రయత్నిస్తుంటాడు. అలా సాధ్యం గాకపోతే ఎత్తుకుపోవడానికీ సిద్ధపడతాడు. రావణాసురుడు చేసిందదేగా. ఎత్తులు, పైఎత్తులు అవసరం లేకుండా ఆడది తనంతతానుగా వచ్చి ఒళ్ళోవాలతానంటే చొంగకారుస్తూ చంకలు గుద్దుకోరూ? విశ్వామిత్రుడంతటివాడే తపస్సుని గాలి కొదిలేశాడు!"

స్వప్ని మొహం ఎర్రబడింది. కోపంతో బుసలు కొట్టింది.

"నేన్నీకంటికెలా కన్పిస్తున్నాను? పది మందికీ పక్కపరిచే పడుపుకత్తెలా కన్పిస్తున్నానా? మైండ్ యువర్ లాంగ్వేజ్"

గాయత్రి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి!

మరి రెండ్రోజులదాకా ఇద్దరూ ముభావంగానే వున్నారు. పొడిపొడి మాటలు తప్ప ఇదివరకటి కబుర్లు లేవు. ఉత్సాహమూ లేదు. ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకోలేకుండా వున్నారు.

తను అతిగా రియాక్టయ్యానని అర్థం కాగా ఎంతో సిగ్గుపడింది స్వప్ని.

గాయత్రి తన స్నేహితురాలు. శ్రేయోభిలాషి. నలుగురూ లోపలనుకునేదాన్ని తను పైకి చెప్పింది. తను జాగ్రత్త పడుతుందని, అవసరమైతే సరిదిద్దుకుంటుందని హెచ్చరించింది.

దానికి తనంత తీవ్రంగా ప్రతిస్పందించాల్సిన అవసరంలేదు.

కాని తను రియాక్టయ్యింది. తన గురించి 'చీప్'గా అనుకుంటారేమోనన్న భావన లోలోపలెక్కడో వుండి వుంటుంది. అది చటుక్కున బయటపడిందంతే.

"సారీ గాయత్రీ! ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ. అవాళ నేనలా ప్రవర్తించాల్సింది కాదు. కళ్ళు మూసుకుని కస్సుమన్నాను"

"నేనర్థం చేసుకోగలను. నువ్వు కళ్ళు తెరవాలనే బాధించేట్లు మాట్లాడేను"

నుదురు ముడివేసి చూసింది మిత్రురాలి వంక.

"ఆవేశాన్ని కంట్రోలు చేసుకుని, ఆలోచనల్ని బాగా మధించు. సత్యమార్గం బోధపడ్తుంది. అవసరమైతే పురాణకథల్ని గుర్తుతెచ్చుకో. మనిషి సవ్యమార్గంలో నడవడానికి రచించబడినవే రామాయణ భారతాలు. అవెప్పటికీ మానవాళికి దిక్సూచీలే"

సాలోచనగా చూస్తుండిపోయింది స్వప్ని.

ఆఫీసుకెళ్లింది. మునుపటిలా ఉత్సాహంగా పనిలో నిమగ్నం కాలేకపోయింది.

అనురాగ్ తనని తప్పించుకుని తిరుగుతున్నట్టన్పించింది. పిలిచి, ప్రాజెక్టు వర్కు గురించి అడిగింది. తలొంచుకుని జవాబిచ్చాడు.

అతడికేమయ్యింది? ఇదివరకట్లా సరదాగా, ఫ్రీగా ఎందుకుండలేకపోతున్నాడు?

బ్లాగులోని తన రాతల్ని అపార్థం చేసుకున్నాడా? కొంపదీసి తనని స్వైరిణిగా భావించట్లేదు కదా?

ఏసీ పనిచేస్తోన్నా ముచ్చెమటలు పోశాయి. కలవరపడింది. అటూ ఇటూ తిరిగింది.

అంతా తనవంక 'అదోలా' చూస్తున్నట్టు అన్పించింది. వారి చూపుల్లో మాటల్లో నవ్వుల్లో 'ఇంకో అర్థం' కన్పించసాగింది. అభిప్రాయాలు స్వేచ్ఛగా వెల్లడించి తప్పు చేశానా? అంతా నా మాటల్ని అపార్థం చేసుకున్నారా? మరోరకంగా రిసీవ్ చేసుకున్నారా?

తల పగిలిపోతోంటే హెల్త్ బాగోలేదని చెప్పి కంపెనీలోంచి బయటపడింది.

తండ్రి ఫోన్ చేశారు "పెళ్ళిళ్ళ పేరయ్య రెండు సంబంధాలు తీసుకొచ్చాడమ్మా. అబ్బాయిల ఫోటోలూ, బయోడేటా నీకు మెయిల్ చేశాం. చూసి.. నీ అభిప్రాయం చెప్పు"

"నాకిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు డాడీ"

"అదేంమాట. ఇప్పటికే ఆలస్యం చేశానంటున్నాడు పరాంకుశం"

"కంపెనీవాళ్ళు అమెరికా పంపిస్తామంటున్నారు. ఎసైన్‌మెంట్ రెండేళ్ళదాకా వుండొచ్చు" అబద్ధమాడేసింది.

"అమెరికా పంపిస్తారా? చాలా సంతోషం. మన వంశంలో అమెరికా వెళ్తోన్న మొట్టమొదటిదానివి నువ్వే. నాకు చాలాచాలా ఆనందంగా వుంది. మా అమ్మాయి అమెరికాలో వుంది, మేమూ అమెరికా వెళ్తాం- అని గర్వంగా చెప్పుకునే రోజొస్తుందన్నమాట!

"డాడీ!"

"చెప్పు బేబీ. సంకోచమెందుకూ, నువ్వు అదృష్టజాతకురాలివి. నువ్వు పుట్టినప్పుడు నీ జాతకచక్రం వేసిన శాస్త్రిగారేమన్నారో తెలుసా? పదిమందికి ఆదర్శం అవుతావన్నారు. నీ జాతకంలో నిచ్చెన్లేగాని పాములు లేవన్నారు"

"రియల్ ఎస్టేట్ మళ్ళీ ఊపందుకొంది. ఇప్పుడే ఓ ఫ్లాట్ కొంటే మంచిదంటున్నారు ఫ్రెండ్స్"

"నీ ఇష్టం. నువ్వేం చేసినా కరెక్టుగా చేస్తావని నాకు తెలుసు. అలాగే కొనేసెయ్. వాస్తుపండితుడికి చూపించేకే కొనుగోలు చెయ్యి సుమా? "

గుండెల మీంచి పెద్ద బరువేదో దిగిపోయినట్టు ఫీలయ్యింది.

"థాంక్యూ డాడ్. మా ఫ్రెండ్స్ ప్రగతినగర్లో ఫ్లాట్స్ కొన్నారు. అందులోనే ఇంకోటి వుందిట. చూసి నచ్చితే, వాస్తు బాగుంటే కొంటాను. బై డాడ్. మమ్మీకి సాయంత్రం ఫోన్ చేస్తానని చెప్పండి"

హాస్టల్ కెళ్ళి ల్యాప్‌టాప్ ఆన్ చేసింది.

తన బ్లాగులోని విషయాలని మళ్ళీ చదివింది. జాగ్రత్తగా చదివింది. రీడర్స్ రెస్పాన్సెస్ చదువుతూ అనురాగ్ పేరు చూసి ఉలిక్కిపడింది. కళ్ళు పెద్దవి చేసి చదివింది.

"మీ భావజాలాన్ని దోసిళ్ళకొద్దీ తాగి దప్పిక తీర్చుకోవాలని వుంది. మీ భావజాలంలో చిక్కుకుని ఊయలలూగాలని వుంది. మీ భావ తరంగిణిలో తరంగమై పడిలేవాలని వుంది. మీ భావగానంలో నవరాగమై విచ్చి మ్రోయాలని వుంది. మీ భావనా జగత్తులో మీతో కలిసి విహరించాలని వుంది"

మళ్ళీ మళ్ళీ మళ్ళీ చదివింది. అతడి భావం లీలగా అర్థమైంది.

అనురాగ్ తనతో సహజీవనం చెయ్యాలనుకుంటున్నాడు.

పెనుకెరటం మొహాన్ని తాకినట్టు తుళ్ళిపడింది. నిశ్చేష్ట అయింది. అయోమయంగా చూసింది.

మెదడు బ్లాంక్ అయ్యింది. తేరుకుని

## కొత్తగాలి...

**లోగడ**
**మారాజుల ఏలుబడి**
**ఇపుడు**
**సారాజుల సాగుబడి**

– చక్కా చెన్నకేశవరావు,
కావలి

ఆలోచనల్ని ప్రోది చేసి పేర్చింది.

అతడి అభిప్రాయం అదే అయితే తన సమాధానం ఏమిటి?

తల్లిదండ్రులు, అక్కాబావలు, బంధువులు, మిత్రులంతా కళ్ళముందు తిరిగారు.

ఏం చెయ్యాలి?

మస్తిష్కాన్ని తొలిచేస్తోందా ప్రశ్న. అనేక ముక్కలవుతూ, ప్రతిముక్కా మరో ప్రశ్నగా రూపుదిద్దుకుంటూ! ల్యాప్‌టాప్‌ని 'షట్ డౌన్' చేసింది. కానామె మనస్సులో సుళ్ళు తిరుగుతున్న ప్రశ్న మాత్రం మూత పడలేదు!

★ ★ ★

## కొత్తగాలి...



**అవినీతి ఆకాశానికి**
**రూపాయి పాతాళానికి**
**పాలకులు శూన్యంలో**
**ప్రజలు త్రిశంకు స్వర్గంలో!**

– బి.వి. నరసింహారావు
చీరాల, ప్రకాశం జిల్లా

"నా మ్యారేజ్ ఫిక్సయ్యింది"

చాటంత మొహం చేసుకుని చెప్పిన గాయత్రి వంక గుడ్లప్పగించి చూసింది స్వప్నిక. శుభాకాంక్షలు చెప్పడం మరచి అపనమ్మకంగా చూస్తుండిపోయింది.

"ఏదో కొత్తదాన్ని అయినట్టు చూస్తున్నావేంటి స్వప్నీ"

"కొత్తగా వున్నావు. రెండేళ్ళ నుంచి నా రూమ్మేట్‌గా వున్న గాయత్రే ఈ గాయత్రి అంటే నమ్మశక్యం గావట్లేదు. ఆ మహత్యం పెళ్లిలోనే వుందేమో!" మల్లెలు విచ్చినట్లు నవ్వింది.

"వాడ్డూ యూ మీన్? "

"నాన్నా, అన్నయ్యా ఏడాది నుంచీ పెళ్లి సంబంధాలు చూస్తున్నారు. రెండుసార్లు పెళ్లి చూపులూ అయ్యాయి. అప్పుడెప్పుడూ కలగని ఫీలింగ్స్ ఇప్పుడు- ఫిక్సయ్యేసరికి కలిగి, ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి!"

"నీ మొహంలో కళ వచ్చింది. కళ్ళల్లో సంబరం తొణికిసలాడుతోంది. ఒంట్లో ఆనందం ప్రవహిస్తున్నట్టుంది. కేవలం పెళ్లి కుదిరినందుకే ఇంత మార్పా? "

"పెళ్లికళ అంటే ఇదేనేమో. జీవితాంతం కలసి నడిచే తోడు లభించాడు. అండగా, అర్ధభాగంగా నిలిచే మనిషి లభించాడు. నీకు నేనున్నానంటూ భరోసా ఇస్తూ భద్రత కల్పించే ఆదరువు దొరికాడు. నన్ను నన్నుగా ప్రేమించేవాడు, తనదానిని చేసుకుని చేయూతనిచ్చి నడిపించేవాడు లభించాడు. కష్టంలో, సుఖంలో తోడునీడగా వుండే ఆజన్మమిత్రుడు లభించాడు. ఈ భావాలన్నీ కలసి నాలో వింత అనుభూతుల్ని రగిలిస్తూ పెన్నిధి లభించిన ఆనందానుభూతి కలిగిస్తున్నాయేమో!"

మరింతగా విస్తుబోయింది.

ఎన్ని కబుర్లు చెబుతోందీ! హఠాత్తుగా ఇంత మార్పు పెళ్లి నిశ్చయమవడం వల్లే వచ్చిందా? పెళ్లిలో నిజంగా అంత మహత్తు వుందా? నమ్మలేకుండా వుంది స్వప్నికి!

"పెళ్లయితేనే జీవితంలో స్థిరపడ్డట్టు అంటారు. పెళ్లయితే బాధ్యతలు తెలిసొస్తాయంటారు. ఆలోచిస్తోంటే అదెంత నిజమో అన్పిస్తోంది!"

"పెళ్లంటే మూడు ముళ్లూ, వేల లాంఛనాలు, లక్షల కట్నమూ కదా? ఎంత కట్నం పోసి కొనుక్కుంటున్నావేంటి? "

"కట్నం వద్దన్నారు. పెళ్లి బాగా చేస్తే చాలన్నారు"

"నువ్వు లక్కీ. పాపం నీహారిక సంగతి చూశావుగా, కట్నదాహానికి బలయ్యింది"

"అలా అని ఆమె తల్లి ఆరోపించింది. కూతురు పోయిన దుఃఖంలో న్యాయాన్యా

య విచక్షణ కోల్పోయి ఆమె అలా బ్లేమ్ చేసివుండవచ్చు. నిజానిజాలు ఆ దేవుడికే తెలియాలి. కాని ఒక్కటి మాత్రం నిజం.." ఆగింది గాయత్రి, ఊపిరి పీల్చుకోడానిక న్నట్టు.

ఆసక్తిగా చూసింది స్వప్ని.

"సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు, చిన్న వయస్సులో పెద్దజీతాలు ఇవ్వడమే కాదు, లేత వయస్సులో పెద్ద బరువులు తలకెత్తుతున్నాయి. ఒత్తిడి.. మరే ఉద్యోగాల్లోనూ లేనంత అధికంగా వుంటోంది. యోగా, ఆర్ట్ ఆఫ్ లివింగ్ వగైరాలవైపు వెళ్తేగాని తట్టుకోలేనంత మానసిక ఒత్తిడితో సతమతమవుతున్నాం. సుఖజీవనానికి ఇంత ఒత్తిడి భరించడం అవసరమా, చెప్పు? "

ఏం చెప్పాలో తోచలేదు. పొడిగా నవ్వింది. అనురాగ్ మాటలు గుర్తురాగా అంది "డబ్బు.. డబ్బులో సుఖం వుంది. డబ్బు కోసం ఈ పాట్లు తప్పవు.."

"డబ్బు సౌకర్యాలు కల్పించగలదు గాని సుఖాన్నిస్తుందన్న భరోసా లేదు. డబ్బు కొంతమేర ఆనందాన్ని, భద్రతని ఇవ్వొచ్చు గాని ఒక గీత దాటేక దానివల్ల అదనంగా లభించే సుఖమేమీ వుండదు. ఈ సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల వల్ల బీపీలూ హార్ట్‌ఎటాక్‌లూ నిద్రలేని రాత్రులూ టాక్స్ గొడవలూ మాత్రమే దక్కుతాయి!"

"నువ్వెక్కడో శాడిస్టువి! చోడో యార్. నీ వుడ్‌బీ గురించి చెప్పు. అతడేం చేస్తాడు? ఎక్కడుంటున్నాడు? ఇండియాలోనా.. యు.ఎస్.లోనా? "

"ఇక్కడే.. బిర్లా సాఫ్ట్‌లో చేస్తున్నారు"

"వావ్! ఫెంటాస్టిక్. కంగ్రాచ్యులేషన్స్. ఇద్దరూ హైటెక్ సిటీ చుట్టూ జంటగా చక్కర్లు కొడతారన్నమాట"

"నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెప్పనా? "

చెప్పమన్నట్టు చూసింది స్వప్ని.

"మనిషి జీవితానికి తోడూనీడ, స్ఫూర్తి, లక్ష్యం, సుఖదుఃఖాలు, సంతోషం, విచారం- ఇచ్చేదే పెళ్లి. పెళ్ళివల్లే మనిషికి సంపూర్ణత్వం లభిస్తుంది. పిచ్చి పిచ్చి ఆలోచనలకి స్వస్తిచెప్పి పెళ్లి చేసుకోవే. నీ జీవితానికి అర్థం పరమార్థం కల్పించుకోవే"




**గా**యత్రి మాటలకి బాగా డిస్టర్బ్ అయ్యింది స్వప్నిక.

ఆమె ఎదుట, ఆమెతోబాటు- వీకెండ్ గడపలేక ఫ్రెండ్ శృతి రూంకి ఒక రకంగా పారిపోయింది. శృతి బీఈలో సీనియర్, కెపిహెచ్‌బిలోనే సింగిల్ బెడ్‌రూం పోర్షన్ అద్దెకు తీసుకుని వుంటోంది.

"రెండ్రోజులు నీ గెస్ట్‌గా వుందామనొచ్చాను"

"ఉండుగాని అతిథి మర్యాదలాశించకు. నాకు ఒళ్ళంతా బద్ధకమే. నా ఇల్లు దెయ్యాల కొంపలా వుంటుంది"

"మరీ దారుణంగా లేదులే" అడ్డదిడ్డంగా పడివున్న దుస్తుల్ని, సామాన్లని పరిశీలిస్తూ అంది స్వప్ని.

"నా పేరు శృతిగాని, నేను శృతి పెట్టని వీణని అంటూ వుంటాడు జగ్గి"

"జగ్గి? "

"జగన్‌లే. .నా బాయ్‌ఫ్రెండ్. నువ్వలా వున్నావేంటి? "

"బాగానే వున్నానే"

"ఊహు. పీక్కుపోయిన మొహం, కాంతి లేని కళ్లతో నీరసంగా ఉన్నావు. ప్రోబ్లం అయితే చెప్పు, నాకు తెలిసిన డాక్టర్ వున్నారు.. తీసుకెళ్తాను"

"డాక్టరెందుకు? "

"ఎందుకేవిటే నీ మొహం. నాటువాళ్ళని నమ్మి నరకయాతన పడేకన్నా డాక్టరే మేలు. సునాయాసంగా అబార్షన్ చేసేస్తారు. తర్వాత ప్రోబ్లమ్స్ ఏమీ వుండవు"

స్వప్ని మొఖంలోని రక్తమంతా ఒక్కసారిగా ఇంకిపోయింది. ఆమె మాటలు జుగుప్స కలిగిస్తోంటే మౌనంగా వుండిపోయింది.

ఆమెని పట్టించుకోకుండా డ్రెస్సప్ అవుతూ చెప్పుకుపోయింది శృతి. "మన వాళ్ళకి చదువుల జ్ఞానం వుంటుంది గాని లోకజ్ఞానం వుండదు. ముందు జాగ్రత్తగా కాంట్రాసెప్టివ్స్ వాడరు. పోనీ తర్వాతైనా ప్రెగ్నెన్సీ రాకుండా పిల్స్ వాడతారా అంటే అదీ లేదు. థర్డ్‌మంత్ వచ్చేక లబోదిబోమంటారు..."

"నాకు బాయ్‌ఫ్రెండ్స్ లేరు"

వినకూడనిదేదో విన్నట్టు చూసింది. పిమ్మట అదోలా నవ్వింది శృతి.

"ఇవాళ రేపు ఇంటర్మీడియట్ పిల్లల క్కూడా బాయ్‌ఫ్రెండ్స్ వుంటున్నారు. రెండేళ్ళ నుంచి జాబ్ చేస్తున్నావు. సిటీలో వుంటున్నావు. అయినా బాయ్‌ఫ్రెండ్స్ లేరంటే.. ప్చ్.. ఐ పిటీ యూ!"

ఓ క్షణమాగి తిరిగి తనే అంది "కంపెనీలో నైటవుట్లు చేస్తుంటావుగా. అయినా ఎవరూ లేరంటే నీలోనే ఏదో లోపముందన్న మాట!"

"శృతీ!"

"ఉన్నమాటన్నాను ఊరికే ఉలిక్కిపడకు. బాయ్‌ఫ్రెండ్స్ లేకపోవడమంటే మనలో ఎట్రాక్షన్ లేదనే అర్థం. సినిమా పరిభాషలో చెప్పాలంటే గ్లామర్ లేదన్నమాట. నీ భాషలో చెప్పాలంటే ఆడతనం లేదన్న మాట. తేనెటీగల్ని ఆకర్షించేవాటినే ఫ్లవర్స్ అంటారు" అంటూ పడీ పడీ నవ్వింది శృతి.

ముడుచుకుపోయింది స్వప్ని.

"జగ్గీ వెయిట్ చేస్తున్నాడు. నేవెళ్ళాలి. ఏదో ప్రోగ్రాం వేశాళ్ళే. ఇవాళ రేపు హాలిడేస్ కదా! ఇంట్లో బ్రెడ్డూ, జామూ, ఎగ్సూ రెడీ టు ఈట్ కర్రీస్ గట్రా వున్నాయి. వాటితో ఎడ్జస్ట్ అయినా సరే, బయట తినొచ్చినా సరే. నేనొచ్చేసరికి లేటవ్వొచ్చు. బయటికెళ్ళేట్టయితే లాక్ చేసి వెళ్ళు. నాకు ఫోన్‌చేసి చెప్పడం మర్చిపోకేం? "

"నేనెక్కడికీ వెళ్ళను"

"ఓకే బందీగా వుండైతే.. బై..."

హడావిడిగా వెళ్ళిపోయింది శృతి. ఆమె వెనకె వచ్చి వరండాలో నిలబడి బయటికి చూసింది.

జగ్గీ బైక్ ఎక్కి వెళ్ళిపోయింది శృతి.

'వ్యవహారం చాలా దూరం వెళ్ళినట్టుంది' అనుకొని నిట్టూర్చి లోపలికొచ్చింది.

మెయిల్ చెక్ చేసుకుందామని కంప్యూటర్ ఆన్ చేసింది. జీమెయిల్లోకెళ్ళబోయి ఆగింది. శృతి విజిట్ చేసిన సైట్లేవిటో చూడాలన్పించి క్లిక్ చేసింది.

స్క్రీన్ మీద ప్రత్యక్షమైన పేర్లు చూసి అదిరిపడింది.

అన్నీ పోర్న్ సైట్లు!

నోటి తడి ఆరిపోయింది. తలుపులు గడియపెట్టిందో లేదో చూసొచ్చి కూర్చుంది.

క్షణకాలం తటపటాయించింది. కొన్ని సైట్లలోకెళ్ళింది.

స్త్రీ పురుషుల నగ్న చిత్రాలు!

ఏవిటోగా అన్పించి క్లోజ్ చేసేసింది.

నోరు పిడచకట్టుకుపోయింది. ఫ్రిజ్

లోంచి చల్లని వాటర్ బాటిల్ తీసుకుని తాగింది. అయినా ఒంట్లోంచి వస్తోన్న ఆవిర్లు చల్లారలేదు.

తను శృంగారమంటే తెలీని అమాయకు రాలు కాదు. కాని మరీ అంత పచ్చిగా..!

ఒళ్ళు గగుర్పొడిచింది.

ఆమె గొడవలు తనకనవసరం. ఎవరి గొడవ వారిదే. ఎవరికి వారే యమునా తీరే!

పడుకుంది. నిద్రరాలేదు. కింకర్తవ్యం?

ఆమె మనస్సులో త్రాసు పైకి కిందికీ ఊగుతోంది.

ఒక పక్కన గాయత్రి, రెండో పక్కన శృతి.

తల అడ్డంగా విదిలించింది. రెండూ లాభం లేదు.

తనది మూడోదారి. అదే కరెక్టు!

అనురాగ్ గుర్తొచ్చాడు.

తన స్నేహితుల్నీ పరిచయస్థుల్నీ గుర్తు చేసుకుంది. అందరికన్నా అనురాగ్ 'ది బెస్ట్' అనుకుంది.

సరదాగా వుంటాడు. సబ్మిసివ్‌గా వుంటాడు. హాస్యంగా మాట్లాడతాడు. కవిత్వం అల్లుతాడు. చూపులకి బావుం టాడు. ప్రాక్టికల్ నాలెడ్జీ ఎక్కువ. పైపెచ్చు తనంటే అభిమానం, కొంత ఆరా ధన వుంది. తన భావాల్ని నూటికి నూరు పాళ్ళూ ఆమోదిస్తున్నాడు. సపోర్టు చేస్తు న్నాడు.

అతడికంటే బెటర్ ఛాయిస్ వుండదు.

సో.. అతడితో స్నేహం కొనసాగిస్తే?

'స్నేహం' సరియైన పదం కాదు. 'డేటింగ్' కరెక్ట్ వర్డ్.

అమెరికాలోని యువతీ యువకులు పెళ్లికి ముందు డేటింగ్ చేస్తారు. ఒకర్నొ కరు అర్థం చేసుకుంటారు. ఒకరికొకరు అన్నిరకాలుగా సరిపోతారనుకుంటే పెళ్లి చేసుకుంటారు. లేకుంటే మరొక పార్ట్‌నర్ని వెదుక్కుంటారు.

అయినా చిత్రం! అక్కడ విడాకులెక్కువే. లోపం ఎక్కడుందో మరి!

కాని తనందుకాస్కారం ఇవ్వదు. తమ మధ్య 'పెళ్లి' అనే బంధమే వుండదు. ఒకరు పనిచేయడం, మరొకరు విశ్రాంతి తీసుకోవటం అనేది లేదు. ఇద్దరూ సంపా దిస్తారు. ఇంటిపని ఇద్దరూ కలిసి చేసు కుంటారు.

అన్నిటా, అంతటా సమానత్వం!

ఆ ఊహకెంతో ఎగ్జయిటింగా ఫీల యింది స్వప్నిక. సంతోషం ఉప్పెనలా పొంగివచ్చింది.

నూతన జీవన విధానానికి నాంది పల కబోతోంది!

**కొత్తగాలి...**

**ఎంత సంపదయినా**
**యవ్వనం ముందు**
**దిగదుడుపే!**

– భానుమూర్తి,
హైదరాబాద్

కథానాయిక అవబోతోంది! నిజంగానే చరిత్ర సృష్టించబోతోంది!

పరమానందం పట్టలేక లేచింది. హైపి చ్‌లో మ్యూజిక్ పెట్టుకుని పిచ్చిగా నర్తిం చింది. అలసిపోయేవరకు అరుస్తూ చిందు లేస్తూనే వుంది!

★ ★ ★

"రాత్రి నీకు లేట్ అయినట్టుంది" అడి గింది స్వప్నిక.

అల్లరిగా నవ్వింది శృతి. "జగ్గీ తన రూ మ్‌కి లాక్కుపోయాడు" అంది.

సంశయిస్తూనే అడిగింది "అతడు నిన్ను

పెళ్లి చేసుకుంటాడా? "

పడీ పడీ నవ్వింది. "గుడ్ క్వశ్చనే గాని నేనసలతడ్ని మ్యారేజ్ చేసుకుంటానా లేదా అన్నది బెస్ట్ క్వశ్చన్"

"నీకభ్యంతరాలు ఉన్నాయా? "

"ఇప్పుడే ఎలా చెప్పగల్ను? ఆ టైమొచ్చే సరికి రావొచ్చు కదా! అప్పటి డెసిషన్ అప్పటి పరిస్థితుల మీద ఆధారపడి వుంటుంది"

"మరి తిరుగుళ్లు!"

శృతి గంభీరంగా మారింది. "చూడు బేబీ! లైఫ్ ఈజ్ ఫర్ ఎంజాయ్‌మెంట్. ఎలా.. ఎందుకూ.. అన్న క్వశ్చన్స్ వద్దు. నీకెలా బావుంటే అలా ఎంజాయ్ చెయ్. దటీజ్ లైఫ్. వారానికి అయిదు రోజులు గొడ్డులా పనిచేస్తాను. రెండ్రోజులు హ్యాపీగా, జాలీగా గడుపుతాను. తింటాను, తాగుతాను, సిగరెట్లు ఊదుతాను, బాయ్ ఫ్రెండ్‌తో పొర్లుతాను.. ఎందులో ఎంజాయ్‌మెంట్ వుంటే అవన్నీ చేస్తాను. నా కోసం.. సిర్ఫ్ నా ఆనందం కోసమే నేను బతుకుతాను"

"కానీ.. నీకు కాబోయే భర్త నువ్వు పవిత్రంగా వుండాలని ఆశిస్తాడు కదా? "

"ట్రాష్! కండరాల మధ్య కండరాల రాపిడికి అంత ఇంపార్టెన్స్ ఎందుకిస్తారో అర్థం కాదు. శీలంగీలం, పవిత్రత గివిత్రత ఇవన్నీ వట్టి ట్రాష్. రెండు కాళ్ళ మధ్యే శీలం వుంటుందనుకోవటం మూర్ఖత్వం. ఆత్మవంచన. ఐ హేట్ హిపోక్రసీ. ఎలా బతకాలనుకుంటే అలా.. ఎలాంటి ఇన్హిబిషన్లూ లేకుండా బతికెయ్. ఎందెందులో సుఖముంటే అదల్లా జుర్రేసుకో. అంతే గాని, అడుగడుగునా గిరిగీసుకుని అందరికీ భయపడ్తూ చావొద్దు. దటీస్ మై ఫిలాసఫీ!"

ఆలోచనల్లో పడింది స్వప్ని!

★ ★ ★

హౌసింగ్ లోన్ శాంక్షనవడం, రిజిస్ట్రేషన్ పూర్తవడం చకచకా జరిగిపోయాయి.

"కంగ్రాచ్యులేషన్స్! గృహప్రవేశం ఎప్పుడు? నన్ను పిలుస్తారా? "

కించిత్తు సంశయిస్తూ అంది "నీతో కొంచెం పర్సనల్‌గా మాట్లాడాలి అనురాగ్"

ప్రప్రథమంగా ఏకవచనం ప్రయోగించానన్న స్పృహ లేదామెకి. అతడు తనకెంతో దగ్గరన్నట్టుగా ఉంది.

"నేనూ మాట్లాడాలనుకుంటున్నాను. శిల్పారామంలో హాండీక్రాఫ్ట్స్ ఎగ్జిబిషన్ జరుగుతోంది. కంపెనీ నుంచి నేరుగా అటు వెళ్దాం"

ఫోన్ ఆఫ్ చేసిందో లేదో మళ్ళీ మోగింది.

బావ పరాంకుశం!

"ఏంటి అమెరికా వెళ్తున్నావంట. రెండేళ్ళదాకా రావంట"

"నేను వెళ్ళటం లేదు. కంపెనీ వాళ్ళు పంపిస్తున్నారు"

"ఏ రాయి అయితేనేం పళ్ళూడగొట్టుకోడానికి. ఇక్కడుంటేనే కాపలా కాయలేక చస్తున్నాం.. ఇంక అమెరికా వెళ్తే నల్లోళ్ళతో తిరుగుతున్నావో, తెల్లోళ్ళతో తిరుగుతున్నావో కూడా తెలీదు. తెలిస్తే మీ అమ్మానాన్నా ప్రాణాలు తీసుకుంటారు. వాళ్ళకి ప్రాణంకన్నా పరువెక్కువ.. తెల్సిందా? "

"అసహ్యంగా మాట్లాడకండి"

"నావి నిక్కచ్చి మాటలు. మేకతోలు కప్పుకోని మాటలు. నీకలాగే అన్పిస్తాయి. రేపు తెల్లోడ్ని వెంటేసుకునో, కడుపు తెచ్చుకునో తిరిగొస్తే అప్పుడు తెలుస్తుంది ఎవరి రంగు ఎలాటిదో!"

"నన్ను అమెరికా వెళ్ళొద్దంటారు. అంతే కదా? "

"అంతేమరి. మరి నువ్వు నీ బాసుకాళ్ళే పట్టుకుంటావో, గెడ్డమే పట్టుకుంటావో

నాకు తెల్దు. నీ అమెరికా ప్రయాణం కాన్సి లవ్వాలి. వింటున్నావా? నేను మీ నాన్నలా మెత్తగా మాటాడ్ను. ఆయనలా 'ఆహా.. నా కూతురు' అంటూ నెత్తికెక్కిం చుకోను. ఆడది కాలికింది చెప్పులా వుండాలి గాని నెత్తిమీది కిరీటంలా వుండ కూడదు. వెధవ్వేషాలెయ్యకుండా బుద్ధిగా వుండు"

"..........."

"ఒళ్ళు దగ్గరెట్టుకుని విను. వచ్చే నెలలో మంచి ముహూర్తాలున్నాయి. ఈలోగా సంబంధం ఖాయం చేసేసి నీ నెత్తిన ఇన్ని అక్షింతలేసేస్తాం. అది లేదు, ఇది బాగో లేదు అంటూ సాగదీస్తూ నంగనాచి కబుర్లు చెప్పేవంటే వూరుకోను. ముందే చెప్పేను. నేను మీ నాన్నని కాదు, బావని. అంకుశంలాంటి పరాంకుశాన్ని!"

లైన్ కట్ చేశాడతడు. కసిగా పెదవి కొరుక్కుంది. శరీరమూ మనస్సూ కుత కుత ఉడికిపోతున్నాయి.

'మధ్యన నీ పెత్తనం ఏంట్రా బోడి! ఇంకా నెలరోజులు టైముంది కదా.. అది చాలు. నేనెలాంటి ఝలక్ ఇస్తానో నువ్వే చూద్దువు గాని! అప్పుడు నీ తలకాయ ఎక్కడ దాచుకుంటావో నేను చూస్తానురా!' అనుకుంది స్వప్నిక.

★ ★ ★

"స్వప్నికా! యు డిడ్ ఎ మార్వలెస్ జాబ్. మీ ప్రాజెక్టుని క్లయింట్ యాజిటీజ్ యాక్సెప్ట్ చేశారు"

టెక్నికల్ డైరెక్టర్ అభినందనలకి పొంగిపోయింది. తనమీద తన శక్తిమీద తన ప్రతిభ మీద తనకు గల నమ్మకం రెట్టింపయ్యింది. ఆత్మవిశ్వాసం మూడింతలయ్యింది.

"కంగ్రాట్స్ టు యూ అండ్ యువర్ టీం మెంబర్స్. రేపట్నుంచి నీకింకో ప్రాజెక్టు అప్పగిస్తున్నాం. ఇది ప్రెస్టేజియస్ ఒన్. క్లయింట్ కార్పొరేట్ జెయింట్.

## 'చతుర'లో డజను పూర్తి!



### సింహప్రసాద్

నా పూర్తిపేరు చెలంకూరి వరహా నరసింహప్రసాద్. కలంపేరు సింహప్రసాద్. పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురం మండలం లోని మల్లవరం మా స్వగ్రామం. నా తొలి కథ 'కథగా ముగియని కథ' ఏప్రిల్ 1973లో ప్రచురితమైంది. ఇంతవరకూ 249 కథలు, 50 నవలలు, కొన్ని కవితలు, నాటికలు అచ్చయ్యాయి. చాలా కథలు కన్నడ, తమిళ భాషల్లోకి అనువాదమయ్యాయి. 37 కథలకు, 11 నవలలకు, కొన్ని కవితలకు, నాటికలకు వివిధ పోటీలలో బహుమతులు అందుకున్నాను. 'వేళ్ళు', 'బోన్సాయ్ మనుషులు', 'విశ్వమానవుడు', 'బ్రహ్మానందల హరి' పేర్లతో కథా సంపుటాలు వెలువడ్డాయి. తి.తి.దే. ఆర్థిక సాయంతో ప్రచురించిన హిందూ వివాహ విజ్ఞాన సర్వస్వం 'వివాహ వేదం' గ్రంథానికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం లభించింది. నా నవలల మీద శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఓ విద్యార్థి పీహెచ్‌డీ నిమిత్తం పరిశోధన చేస్తున్నారు. 'ఒక ఆడ + ఒక మగ' నా 51వ నవల, 'చతుర'లో పన్నెండో నవల.

చిరునామా:
సింహప్రసాద్,
401, మయూరి ఎస్టేట్స్,
M.I.G- 2-650,
కె.పి.హెచ్.బి. కాలనీ,
హైదరాబాద్-500072

డెడ్‌లైన్‌లోపు డెలివరీ ఇవ్వకపోతే చాలా పెద్ద మొత్తంలో పెనాల్టీ చెల్లించాల్సుం టుంది. మైండిట్"

"అలాంటి పరిస్థితి రానివ్వను. దీన్నో ఛాలెంజ్‌గా భావించి పూర్తి చేస్తాను"

"ఐనో యువర్ కెపాసిటి అండ్ కేపబి లిటీ. కేరీ ఆన్.. విష్యూ ఆల్ ద బెస్ట్"

ఆమె తన కేబిన్‌కి తిరిగొచ్చేసరికే వార్త అందరికీ తెలిసిపోయింది. టీం సభ్యులంతా జూబిలెంట్ మూడ్‌లో వున్నారు. మిగతావారిలా అనురాగ్ ఆమెకి షేక్‌హేండ్ ఇచ్చి వూరుకోలేదు. పూలబొకే ఇచ్చి అభినందించాడు.

"లెటజ్ సెలబ్రేట్ ది అకేషన్.. కమాన్" అని చెప్పి అందర్నీ సంబ్రమప ర్చాడు అనురాగ్.

★ ★ ★

శిల్పారామంలో ఎదురెదురుగానే కూర్చు న్నారు స్వప్నిక, అనురాగ్. అయినా వారి మధ్య మౌనానిదే రాజ్యమయింది.

"మనం ఒకర్నొకరం చూసుకోడానికొ చ్చామా?" నిశ్శబ్దాన్ని బద్దలు గొడుతూ నవ్వింది.

"మిగతాప్పుడు బోల్డు బోల్డు మాట్లాడే స్తాను. ఇప్పుడేవిటో మాటలు కరువ య్యాయి"

"కమ్ టు ది పాయింట్. మనం టీనేజ్ వాళ్ళం కాదు. వి ఆర్ గ్రోన్ అప్ అండ్ మెచ్యూర్డ్ పీపుల్. వాస్తవాలను ఓపెన్‌గా మాట్లాడుకుందాం"

"సరే, అయితే నా గురించి మీకంతా తెలుసు. సుమారు ఒన్ అండ్ హాఫ్ ఇయర్స్ నుంచి ఒకరికొకరం తెలుసు. కలిసి క్యాబ్‌లో ప్రయాణించాం. కంపె నీలో కలిసి పనిచేశాం. డాన్సు కూడా చేశాం. పర్సనల్ వివరాలూ తెలుసు. తెలి యాల్సినవి ఇంకేమీ వున్నాయనుకోను"

"నా సమాధానమూ డిటోయే. మనకి మన సంగతులు కావాలి గాని బ్యాక్ గ్రౌండ్ అనవసరం. భవిష్యత్తు కావాలి గాని భూతం అక్కర్లేదు.." నవ్వింది.

"సో.. ఒకర్నొకరం బాగానే అర్థం చేసు కున్నాం. వాట్ నెక్ట్స్?"

"పెళ్ళిమీద నాకు నమ్మకం లేదు. అదొక బందీఖానా. అందులో నాకు ఊపిరాడదు. ప్రతిదానికీ సర్దుకుపోవడం, మరొకరి అభీ ష్టానుసారం నడవడం, తలవంచడం నాకు అసహ్యం. నేను నేనుగా, స్వేచ్ఛగా, నా ఇష్టానుసారం తలెత్తుకుని జీవించాలన్నది నా కోరిక"

"నా అభిప్రాయమూ అదే. సంప్రదాయ వివాహం ఈ కాలానికి సరిపడదు. భరిం చేవాడు భర్త, భరించబడేది భార్య అనేవి కాలం చెల్లిన పదాలు. ఒక ఆడ ఒక మగ కలిసి సమాన ప్రాధాన్యతతో సమాను లుగా సహజీవనం చెయ్యాలి. ఎవరి స్వేచ్ఛకీ ఇష్టాలకీ భంగం కలక్కూడదు. ఒకరికొకరు అడ్డు తగలకూడదు. ఒకరి మీదొకరు పెత్తనం చెయ్యకూడదు. ఒకే ఇంట్లో వున్నా ఎవరి పరిధిలో వారు, ఎవరి స్పేస్‌లో వారు వుండాలి. ఒకరి కొకరు సహకరించుకుంటూ ప్రయాణిం చాలి"

"ఎగ్జాక్ట్లీ. లివ్ ఇన్ రిలేషన్‌షిప్. కలిసి జీవించే బాంధవ్యం సహజీవనం. అదే పెళ్ళిలోని లోపాలకి, బలహీనతలకి విరు గుడు. పెళ్ళి ఇవ్వలేని స్వేచ్ఛనీ, స్వాంతగొం తుకనీ, స్వీయ ఆనందాన్నీ అది ఇస్తుంది. ఇది సరికొత్త జీవన విధానం. ఉపన్యాసా లివ్వడం గాక ఆచరణలో చూపాలన్నది నా ఆకాంక్ష"

"అంటే ఎలాంటి ఒత్తిళ్ళూ లేకుండా కలి సివుంటాం. ఇంటి పనుల్నీ సమంగా పంచుకుంటాం. ఖర్చునీ షేర్ చేసు కుంటాం. ఒకరికొకరం తోడుగా వుంటాం. కోపాలు, పెత్తనాలు, బలవంతాలు ఏమీ

వుండవు. ఎవరి స్వేచ్ఛకీ, ఇష్టానికీ భంగం కలక్కుండా ప్రవర్తిస్తాం. ఎంతకాలం కలిసుండాలనుకుంటే అంతకాలం కలిసుంటాం. ఇష్టం లేకపోతే స్నేహితుల్లా విడిపోతాం. ఆస్తుల గోల, బాధ్యతల గొడవా వుండదు. ఎవరి సంపాదన వారిదే. ఎవరి జీవితం వారిదే"

"ఇష్టమున్నంతకాలం ఇష్టంగా కలిసుండటం, కష్టం కలిగితే ఇష్టంగా విడిపోవడం. నో కమిట్‌మెంట్స్ టు ఈచ్ అదర్. వీటన్నిట్నీ కాగితం మీద రాసుకుంటే మంచిదేమో? "

"అప్పుడది అగ్రిమెంట్ పెళ్లో, కాంట్రాక్టు పెళ్లో అవుతుంది" నవ్వేడతడు.

మొట్టికాయ వేసుకుని నవ్విందామె.

"బంధనాల్లేని బంధం ఏర్పరచుకోడానికి నేను రెడీ. మీ సంగతేవిటి? మీ తల్లిదండ్రులు, బంధువులు ఒత్తిడి చేస్తారు. సమాజం విమర్శిస్తుంది. వాటన్నిట్నీ తట్టుకుని శిలలా దృఢంగా నిలబడగల ధైర్యస్థైర్యాలు మీకున్నాయా? " అన్నాడు.

"నాకున్న అస్త్రాలే అవి. పిడికిలి బిగించానంటే ముంజేతిని ఖండించినా వదల్ను"

"నేనూ అంతే. మిన్ను విరిగి మీద పడ్డా వెన్ను చూపను. నమ్మిన ఆశయం నుండి అరంగుళం కూడా పక్కకి తొలగను"

"నాకు చాలా చాలా సంతోషంగా వుంది అనురాగ్. ఆకాశం అందినట్టు వుందంటే నమ్ము. నా ఆశయం ఇంత ఈజీగా నెరవేర్తుందని కలలో కూడా అనుకోలేదు" అతడి చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కింది.

"నా పరిస్థితీ అలాగే వుంది. ఇది కలో నిజమో తెలీడం లేదు. ఆకాశం నుంచి నా కోసం ప్రత్యేకంగా దిగివచ్చిన దేవకన్యలా కన్పిస్తున్నావు"

ఆమె అతడి మీదకు ఒరిగింది. అతడామెను పొదివి పట్టుకున్నాడు.

"రాధాకృష్ణుళ్ళలా నటించాం. అలాగే జీవిస్తాం అనుకోలేదు"

"అనుకోనిది జరగటమే జీవితమట"

"అన్నట్టు అనురాగ్! మరి.. పిల్లలు పుడితేనో? " కలవరపడ్తూ ప్రశ్నించింది.

"ఇప్పుడప్పుడే పిల్లలకోసం ప్లాన్ చెయ్యొద్దు. కొంతకాలమయ్యాక ఆ సంగతి ఆలోచిద్దాం. ఏం చెయ్యటం, ఎలా చెయ్యటం అన్నది అప్పుడాలోచించుకోవచ్చు"

"అదే బెటర్. నా ఫ్లాట్ ఇంకో ఇరవై రోజుల్లో హేండోవర్ చేస్తాడు. మనిద్దరం కలిసి గృహప్రవేశం చేద్దాం"

"అది మామూలు గృహం కాదు, హ్యాపీ హోమ్!"

"నా మనస్సులోని మాటని భలేగా తెలుసుకున్నావ్" చటుక్కున వంగి అతడ్ని ముద్దు పెట్టుకుంది స్వప్నిక.

★ ★ ★

స్వప్నిక కొత్త ఇంట్లోకి కావాల్సిన సామాన్ల లిస్టు రాస్తోంటే తండ్రి ఫోన్ చేశారు.

"ఊర్నించి పొద్దున వచ్చేం నేనూ మీ అమ్మా. పిన్నీ వాళ్ళింట్లో దిగాం. రెండు మంచి చీరలు తీసుకుని ఇక్కడికి రామ్మా"

"దేని గురించి డాడీ? " గుండెలు గుభిల్లుమంటోంటే అడిగింది.

## కొత్తగాలి...

**బాధల కొలిమి**
**ఆరిపోవాలా?**
**నవ్వుల వర్షం**
**కురిపించు**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు

"వచ్చేక నీకే తెలుస్తుందిలే. త్వరగా బయల్దేరి రా"

తన తలమీదికేదో ముసలం వచ్చి పడిం దని అర్థమయ్యింది. ఎలా తప్పించుకోవా లా అని పరిపరివిధాల ఆలోచిస్తూ వెళ్ళింది.

"ఇంతలా చిక్కిపోయావేమిటే? " అంది తల్లి దగ్గరకి తీసుకుంటూ.

"పెళ్లి గురించి బెంగ పెట్టుకుందేమో!" పిన్ని వరసయ్యే శాంతమ్మ అంది.

"మా స్వప్నికకి సుమారు పాతిక సంబంధాలొచ్చాయి. అమ్మాయి ఒప్పుకోక గాని లేకపోతే ఎప్పుడో పెళ్లైపోయేది" అన్నాడు స్వప్న తండ్రి సుబ్బారావు.

"మా అమ్మాయిదంతా మేనమామ పోలిక. ఏదో సాధించాలి, ఎన్నో ఎత్తులకి ఎదగాలి అని ఆరాట పడుతుంటుంది"

తల్లి ఇంకా ఏం చెబుతుందోనని భయ పడి అంది "ఇంత హఠాత్తుగా వచ్చారేంటి డాడీ? "

"ఫస్ట్‌క్లాస్ సంబంధం వచ్చిందమ్మా. పెద్దవాళ్ళతో అన్ని మాటలూ మాట్లా డేశాం. నువ్వూ అబ్బాయీ ఒకర్నొకరు చూసుకుని ఓకే చెబితే ముహూర్తం పెట్టించేస్తాం"

"అమెరికా వెళ్ళొచ్చేదాకా పెళ్ళిని వాయిదా వేద్దామనుకున్నాం కదా డాడీ"

"అలా అనుకున్నమాట నిజమేగాని మీ బావ వినటం లేదు. పట్నంగాలి అలా తగిల్తేచాలు, అమ్మాయిలు ఇలా మారిపో తారంటూ ఒకటే రాద్ధాంతం చేస్తున్నాడు. మధ్యతరగతి వాళ్ళం, మనకి పరువూ మర్యాదా ముఖ్యం. మన ఆస్తులు అవే కదా!"

మొఖం గంటు పెట్టుకుంది. 'బావ మూర్ఖుడు. టీచరు ఉద్యోగం ఎవరిచ్చారో గాని వాళ్ళని తిట్టాలి' అనుకుంది.

"మాట పెళుసుగాని మనిషి మంచోడే నమ్మా. మొఖాన కొట్టినట్టు మాట్లాడతాడు గాని ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేస్తాడు పరాంకుశం"

పెళ్లివారు వచ్చారు. అబ్బాయి, అతడి మిత్రుడూ- ఇద్దరే వచ్చారు. ఫుల్‌సూట్లో వున్నాడు అబ్బాయి.

ఆడవాళ్ళు లోపలికెళ్ళిపోయారు. టీ ఫలహారాలయ్యాక స్వప్నికని అలంకరించి తీసుకొచ్చి కూర్చోబెట్టారు.

ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది. పిన్ని చెప్పగా తలెత్తి చూసింది. అతడ్నె క్కడో చూసినట్టన్పించింది. ఎక్కడ చూసిందో గుర్తు రాలేదు. ఈ సంబంధం తప్పించుకోవడం ఎలాగా అని ఆలోచి స్తోంటే ఆమెతో పర్సనల్‌గా మాట్లాడాల న్నాడు అబ్బాయి.

వేరేగదిలో సమావేశం ఏర్పాటు చేశారు.

"పెళ్ళయ్యాక జాబ్ చేస్తారా, చెయ్యరా? "

"చేస్తాను" అందామె.

"నాకిష్టం లేకపోతే? " అన్నాడు.

తుళ్ళిపడింది.

"మిమ్మల్నెక్కడో చూసినట్టుంది" అంది స్వప్నిక.

"సోషల్ బర్డ్‌ని. ఏ సోషల్ ఈవెంట్లోనో చూసుంటారు. నాపేరు జగన్.. యూనో? "

ఆమె బుర్రలో ఫ్లాష్ వెలిగింది. "జగన్.. జగ్గీ..? !"

"నా ఫ్రెండ్స్ అలాగే పిలుస్తారు. నీకెలా తెలుసు? "

"శృతి నా ఫ్రెండ్"

"గుడ్. నా గురించి అన్ని విషయాలూ తెలిసే వుంటాయి గనుక నేను మళ్ళీ ఏక రువు పెట్టక్కర్లేదు"

"సారీ. మీరు నాకు నచ్చలేదు"

"జోకా? నేనంటే అమ్మాయిలు పడి చస్తారు.. తెల్సా? "

"నేను వాళ్ళలా చావను. నాక్కావా ల్సింది క్యారెక్టర్. అది మీకు లేదు"

"క్యారక్టరనేది ఛేంజ్‌కాని పదార్థం కాదు. టైమ్‌ని బట్టి, సిచ్యుయేషన్ని బట్టి, కెటలి స్టుల ప్రభావాన్ని బట్టి మారిపోతూం టుంది"

"బట్ ఐ హేటిట్. ఐ హేట్యూ టూ!"

ఆమె లేచేసరికి విసురుగా లేచి విసవిసా వెళ్ళిపోయాడు.

"నా ఫ్రెండ్ శృతితో తిరిగిన రోగ్ ఇతడే డాడీ"

"అలాగా! ఎర్రగా, బుర్రగా వుంటే మంచివాడనుకున్నాం. చెట్టు మంచిదైతే చాలదు, కాయ కూడా మంచిదవ్వాలంటా రిందుకే. పోనీలే. వెధవ సంబంధం తప్పి పోతే పోనియ్. దీని బాబులాంటి సంబంధం చూస్తాను. మనిషికి డబ్బు కన్నా ఆస్తి ఐశ్వర్యాలకన్నా నీతి వర్తనం ముఖ్యం. నైతిక విలువలు ముఖ్యం. అవి లేనివాళ్ళు పశువుల్తో సమానం!"

చెళ్ళున కొరడాతో కొట్టినట్టు అదిరి పడింది స్వప్నిక తండ్రి మాటలకి.

"ఆ మధ్యన ఇల్లు కొంటానన్నావు.. కొన్నావా స్వప్నీ?" తల్లి రేవతి అడిగింది.

"కొన్నాను.. అహ కొంటాను.. కొనే స్తాను"

ఆమె తొట్రుపాటు చూసి ఆశ్చర్యపో యారు సుబ్బారావు.

"ప్రతీదీ ధీమాగా చెబుతావు. ఇవాళేమి టిలా కంగారు పడుతున్నావు?"

"సంబంధం చెడిపోయిందని అప్సెట్ అయినట్టుంది బిడ్డ" తల్లి ఆదుకోగా తలా డించింది స్వప్ని.

"మా అమ్మాయి అని చెప్పడం కాదు గానీ స్వప్ని చాలా తెలివైంది. టెన్త్‌లో ఇప్పటికీ స్కూలు రికార్డు దీనిదే. ఎవరూ దాటించలేకపోయారు. క్యాంపస్ సెలక్షన్‌కి ఇరవైమంది హాజరైతే మా స్వప్ని ఒక్కతే సెలక్టయింది. చదువులోనేమిటి వ్యవహా రంలోనేమిటి ప్రతీదాన్లోనూ మా స్వప్నిదే పైచెయ్యి. ప్రతీదీ ఆచితూచి నిర్ణయం తీసుకుంటుంది. ఒకసారి తీసుకుందంటే మరి దానికి తిరుగుండదు. లక్ష్యం ఛేదించి తీర్తుంది" కూతురి వంక అభినందన పూర్వకంగా చూస్తూ పిసరంత గర్వంగానే చెప్పారాయన.

గతుక్కుమంది స్వప్ని.

వారి నమ్మకాలను వమ్ము చేస్తోందా? నిజాలు దాచి మోసగిస్తోందా?




కొత్త ఫ్లాట్ గుమ్మం దగ్గర కొబ్బరి కాయ కొట్టి జంటగా లోపల అడుగుపె ట్టారు స్వప్నిక, అనురాగ్.

వినాయకుడి ఫొటోని ఈశాన్యం మూలలో తగిలించి దణ్ణం పెట్టుకుంది స్వప్ని.

చేయీ చేయీ పెనవేసి ఇల్లంతా కలియ తిరిగారు. డాన్స్ చేశారు. రెక్కలు మొలిచి నట్టుగా వుంది ఇద్దరికీ.

"ఇవాళ్టికి హోటల్లో తినేద్దాం. ఆ తర్వాత బజారుమీద పడదాం" హేండ్‌బ్యా గ్‌లోని క్రెడిట్ కార్డునీ డెబిట్ కార్డునీ సరి చూసుకుంటూ అంది.

"ఫస్ట్ చేయాల్సిన పని అదే. ఛలో ఛలో"

బెడ్, మ్యాట్రెస్, సోఫా, డైనింగ్ టేబుల్, చెయిర్స్, బీరువా, టీవీ, ఫ్రిజ్

కొన్నారు. వంటింట్లోకి కావాల్సిన వస్తువులు మిక్సీ, స్టౌ, వాటర్‌ఫిల్టర్ వగైరా ఖరీదు చేశారు. కప్పులూ గ్లాసుల్తో బాటు పప్పులూ ఉప్పులూ బియ్యం వగైరాలన్నీ చకచకా కొనేశారు.

మొత్తం బిల్లుని చెరిసగం చొప్పున చెల్లించారు. సామాన్లని చక్కగా సర్దుకునేసరికి బాగా అలసిపోయారిద్దరూ.

"ఇప్పుడు నిండుగా హోమ్‌లా వుంది.."

"మన ఇల్లా మజాకా!" అన్నాడతడు.

"నాకెంత సంతోషంగా వుందో మాటల్లో చెప్పలేను. గ్రాఫిక్ వర్క్‌లా ఉందంతా. ఒక్కరోజులో ఎంత మార్పు!"

"మన జీవితాలని మలుపు తిప్పిన రోజిది. సెలబ్రేట్ చేసుకోవద్దూ?"

"ఏం చేద్దాం?"

"ఆలోచించు" కొంటెగా నవ్వుతూ కన్ను గీటాడు.

సిగ్గుగా నవ్వి అతడి బుగ్గ పొడిచి టవల్ తీసుకుని బాత్‌రూం కెళ్ళిపోయింది స్వప్ని.

'హుర్రే' అని చిన్నగా అరిచాడు అనురాగ్.

నైటీ ధరించి టవల్తో తల తుడుచుకుంటూ వచ్చింది.

రెప్ప వేయడం మరచి ఆమెనే చూడసాగాడు.

"చూపుల్ని సెన్సార్ చెయ్యి" నవ్వుతూ అంది.

"నిన్నలేని అందమేదో నిదుర లేచెనెందుకో..." చిన్నగా పాడుకుంటూ బాత్‌రూంలో కెళ్లాడు.

ఈలవేస్తూ వంటింట్లోకొచ్చాడు. పరమాన్నం వండుతోంది స్వప్ని.

ఆమె వెనుక రాసుకుంటూ నిలబడ్డాడు.

ఇద్దరి నరాల్లోనూ కదలిక- కాదు సంచలనం!

మెల్లగా ఆమె నడుం చుట్టూ చేతులేశాడు.

"నన్ను పని చేసుకోనివ్వవా?" అతడి చేష్టల్ని వారించకుండా అంది.

అవి ఆమెకీ ఇష్టంగానే వున్నాయి. మత్తుగా వున్నాయి. మైమరపిస్తున్నాయి.

"నీ పని నువ్వు చేసుకో, నా పని నేను చేసుకుంటా" అంటూ ఆమె మెడమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె శరీరం ఝల్లుమంది. చిన్నగా కంపించింది. అతడామె శరీరాన్ని తమకంతో తడిమెయ్యసాగాడు.

నిలువరించలేని అశక్తురాలయ్యింది. తిన్నగా వుండలేని బలహీనురాలయ్యింది.

పాలు పొంగాయి. స్టౌ కట్టేసి అతడివైపు తిరిగింది.

గట్టిగా కౌగిట్లో బిగించేశాడు. అల్లుకుపోయిందామె. చెలరేగి పోయారిద్దరూ.

ఒకరి దుస్తులు ఒకరు ఒలిచేస్తూ బెడ్ మీది కెళ్ళిపడ్డారు. ద్వంద్వ యుద్ధం మొదలైంది.

హోరాహోరీ పోరాడారు. కడకి ఇద్దరూ గెలిచారు.

అలసి సొలసి ఒగురుస్తూ విడివడ్డారు. ఎంత బావుందీ అనుభవం!

మర్నాడు ఉదయమే అతడెళ్ళి న్యూస్‌పేపర్, పాల ప్యాకెట్లూ తెచ్చాడు.

ఆమె ఇల్లు చిమ్మింది.

అతడు అంట్లు తోమాడు. ఆమె కాఫీ చేసింది.

ఇద్దరూ టీవీ వార్తల్నీ, న్యూస్‌పేపర్ కబుర్లనీ నంజుకుంటూ కాఫీ తాగారు.

అతడు ఉప్మా చేశాడు. ఆమె టీ కలిపింది. ఫ్రెషప్ అయి ఉత్సాహంగా బయల్దేరారు.

కంపెనీకెళ్ళి ఎవరి పనుల్లో వారు పడ్డారు. లంచ్‌టైంలో కలిసి క్యాంటీన్‌కెళ్ళి భోంచేశారు. ఎవరి బిల్లు వారే పేచేసుకున్నారు. సాయంత్రం త్వరగా పని తెము

ల్చుకుని బయటపడ్డారు.

దారిలో కాయగూరలూ, పండ్లూ, మల్లె పూలూ కొన్నారు. చెట్టాపట్టాలేసుకుని ఇల్లు చేరారు.

ఆమె స్నానం చేసొచ్చేసరికి బియ్యం కడిగి కుక్కర్లో పెట్టి కాయగూరలు కోశాడు. ఆమె కూర వండుతోంటే అతడు స్నానానికెళ్ళాడు. స్వీట్ నథింగ్స్ చెప్పు కుంటూ భోంచేశారు.

సోఫాలో రాసుకుంటూ కూర్చుని 'ఢీ' డాన్సులు చూస్తూ చూస్తూ చేతులకు పని చెప్పారు. మరి కూర్చోలేని స్థితికి చేరుకు న్నాక టీవీ పీకనొక్కి గదిలోకెళ్ళి లైటు ప్రాణం తీసేశారు!

★ ★ ★

స్వప్నిక అక్షరాలా ఆనందపు తేరుమీద ఊరేగుతోంది.

ఇన్ని ఆనందాలు, ఇన్ని అనుభూతులు ఇన్ని మధురిమలు- ఎన్నడూ చవిచూడ లేదు.

తనెలాంటి జీవనం కోరుకుందో అచ్చం అదే లభించింది.

కోపాలు లేవు. విసుక్కోవడాలూ లేవు. సణుగుళ్ళు లేవు. ఆధిక్యతలు లేవు. ఆధిప త్యాలు లేవు. దెప్పుళ్ళు లేవు. హెచ్చుత గ్గులు లేవు.

ఉన్నదల్లా సద్భావన. సహకారం. సర సాలు. సమభావం. సమధర్మం.

ఎలాంటి భేదాభిప్రాయాలూ లేకుండా కలిసి వుంటున్నారు. కలిసి చేసుకుంటు న్నారు. కలిసి తింటున్నారు. కలిసి అను భవిస్తున్నారు.

ఎప్పటికీ ఇలాగే వుంటుంది, ఇలాగిలాగే సాగుతుందన్న భావన ఆమెని నిలవనీ యటం లేదు. నేలమీద కాళ్ళని ఆననివ్వ టంలేదు.

జోరుగా హుషారుగా సాగిపోతోంది కాలం!

★ ★ ★

బిగ్ బజార్లో షాపింగ్ చేస్తున్నారు స్వప్నిక, అనురాగ్.

స్వప్నిని చూసి పరుగున వచ్చింది గాయత్రి. చేతులు పట్టుకుని కుదిపేసింది.

"నా మ్యారేజ్ కి రానేలేదు" నిష్టూరంగా అంది గాయత్రి.

"ప్రాజెక్ట్ డెడ్‌లైన్ దగ్గర పడటంతో రాలేకపోయాను. సారీ యార్"

ఇదివరకన్నా నిండుగా, నిబ్బరంగా, తృప్తిగా ఉన్న గాయత్రి వంక ఆశ్చర్యంగా చూసింది స్వప్ని.

మునుపటికన్నా చలాకీగా, ఉత్సాహంగా, చొరవగా వున్న స్వప్ని వంక అపనమ్మ కంగా చూసింది గాయత్రి.

అనురాగ్ గాయత్రి ఒకర్నొకరు విష్ చేసుకున్నారు.

"అయితే మీరిద్దరూ.." ఆపైన మింగే సింది గాయత్రి.

అవునన్నట్టు తలాడిస్తూ చిన్నగా నవ్వింది స్వప్ని.

"నా బెస్ట్ ఫ్రెండ్ స్వప్ని. కొలీగ్, రూమ్మేట్, ఎవ్రి థింగ్. బట్ మన మ్యారే జ్ కి డుమ్మా కొట్టింది" హబ్బీతో అంది.

"ఆఫీస్ కంపల్షన్సేమో" అన్నాడు సతీష్.

"కరెక్ట్‌గా గెస్ చేశారు. గ్లాడ్ టు మీట్యూ. అనురాగ్ మై కంపానియన్"

## కొత్తగాలి...

**కంప్యూటర్ యుగం**
**కరస్పర్శల్లేవ్.. కరెన్సీ స్పర్శలే**
**ఆత్మీయతను**
**అంతర్జాలం మింగేసింది**

*– ధరణికోట శివరాంప్రసాద్,*
*హైదరాబాద్*

అంటూ పరిచయం చేసింది స్వప్న.

సతీష్ నుదురు ముడివడింది. చురుక్కు మనేలా చూసి ఏదో అనబోతోంటే చిన్నగా గిచ్చి నవ్వింది గాయత్రి.

సంజ్ఞ అర్థం కాగా మాటమార్చి అనురాగ్‌తో కబుర్లలో పడ్డాడతడు. స్వప్నని పక్కకు తీసుకెళ్ళింది.

"మొత్తానికి పంతం నెగ్గించుకున్నావు. ఎలాంటి ఇబ్బందులూ లేకుండా చక్కగా గడిచిపోతోంది కదా? "

"నో వర్రీస్.. ఓన్లీ హ్యాపీస్"

"హమ్మయ్య! గుండెలమీంచి పెద్ద బరువు దిగిపోయిందనుకో. నువ్వేమవు తావో అని ఒకటే బెంగగా వుందనుకో"

"భలేదానివే. నేను తప్పటడుగు వెయ్యను. నలుగురికీ స్ఫూర్తినవుతాను తప్ప నవ్వుల పాలవ్వను"

"నీ ధీమా చూస్తోంటే ముచ్చటేస్తోంది. నువ్వెప్పటికీ ఇలాగే వుండాలి"

"ఆ విషయంలో నీకెలాంటి సందేహమూ అక్కర్లేదు. నీ హబ్బీ ఎలా వుంటున్నారు? "

"నైస్ పర్సన్"

"ఇన్-లాస్? "

"వాళ్ళూ ఆదరంగా చూస్తున్నారు. దేనికీ లోటులేదు"

"మరి జాబ్ మానేశావేం? శ్రీవారి కిష్టం లేదా? " జగన్ మాటలు గుర్తు తెచ్చుకుంటూ అడిగింది.

"అదేంకాదు గాని ఇద్దరివీ ఆడ్ అవర్స్ డ్యూటీలైతే ఇంట్లో ఇబ్బందిగా వుంటోంది. కలిసివుండే సమయం తగ్గిపోతోంది. పైగా ఆఫీసులోని ఒత్తిళ్ళు భరిస్తూ ఇంట్లో పని చేసుకోవడం కష్టంగా వుంది. అంచేత టెన్ టు ఫైవ్ జాబ్ అయితే అందరికీ అన్ని పనులకీ అనుకూలంగా వుంటుందని కంపెనీలో మానేసి కాలేజీలో చేరాను"

"జీతం తక్కువేమో? "

"తక్కువేగాని కన్వీనియంట్ టైమింగ్స్. నో ప్రెజర్స్. నో స్ట్రెస్. ఫుల్ శాటిస్‌ఫాక్షన్. నీ సంగతి మీ ఇంట్లో తెలుసా? "

"తెలీదు. అతడింట్లో వారికీ తెలీదు"

"రేపు తెలిస్తే? "

"తుపానొస్తుంది"

"స్వప్నా!"

"భయపడకు. తుపాన్నే కాదు సునామీని సైతం తట్టుకుని స్థిరంగా నిలబడగలం"

"ఆ ధైర్యం వుంటే ఫర్లేదు. పోనీ రిజిస్టర్డ్ మ్యారేజ్ చేసుకోకపోయారా, ప్రొటెక్షన్ వుండేది"

"ఎవరికి ప్రొటెక్షన్.. ఎవర్నుంచి ప్రొటెక్షన్? నాకెవరి రక్షణా అక్కర్లేదు. నన్ను నేను రక్షించుకోగలను. నన్ను నేను పోషించుకోగలను"

"నీకు తోచదు. ఇంకొకరు చెబితే వినవు. కనీసం నీ జాగ్రత్తలోనైనా నువ్వుండు"

"పెళ్లి చేసుకున్న వారందరికీ ఈ జాగ్రత్తలు చెబుతావా? వూహూ. నాకు మాత్రమే చెబుతున్నావు. మీరంతా ఆమోదించని కొత్తదారి తొక్కాననే కదా? "

"పెళ్లికి సమాజపు రక్షణ వుంది. చట్టపు సపోర్టు వుంది. భద్రత వుంది. బంధుమిత్రుల సహకారం వుంది. కాని నీకవేమీ లేవు. ఒంటరి ప్రయాణం చేస్తున్నావు. ఒడిదుడుకులు రాకుండా జాగ్రత్తపడు"

సాలోచనగా చూస్తుండిపోయింది స్వప్న.

ఆమె వద్ద సెలవు తీసుకుని భర్తతో కలిసి హుందాగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయింది గాయత్రి.

"గాయత్రి నీకేదో బ్రెయిన్ వాష్ చేసినట్టుంది" సమీపిస్తూ అన్నాడు అనురాగ్.

"ప్రతివాళ్ళూ సలహాలిచ్చేవారే. జాగ్రత్తలు చెప్పేవారే. ఎవరి బాగు వారికి తెలీ

దనుకుంటారో ఏమో!"

"అలాటివారి మాటలు ఈ చెవితో విని ఆ చెవితో వదిలెయ్యాలి"

"నేనేదో కష్టాలపాలైతే చూడాలనుకుంటున్నారు తప్ప సుఖంగా వుండాలని కోరుకోవట్లేదు"

"వాళ్ళేమైనా కోరుకోనీ, ఏమైనా అనుకోనీ ఉయార్ ఒన్. మనం ఒక్కటి. మనది సహజీవనం కాదు, అన్యోన్య జీవనం" అన్నాడు.

అభినందిస్తూ చూసి, స్నిగ్ధంగా నవ్వింది స్వప్నిక.

★ ★ ★

స్వప్నిక మెయిల్ చెక్ చేసుకొంటోంటే పక్కనే కూర్చుని చూస్తున్నాడు అనురాగ్.

ఓ మాట్రిమోనియల్ నుంచి వచ్చిన మెయిల్ చూసి "ఇంకా వస్తున్నాయా? " అన్నాడు ఆశ్చర్యంగా.

ఆమె ఎంబ్రాస్సింగా ఫీలవుతూ "నా ప్రొఫైల్ తీసెయ్యమని ఇన్ఫార్మ్ చెయ్యలేదు. అందుకని పంపిస్తున్నారు. ఇప్పుడే అందరికీ ఇన్ఫార్మ్ చేసేస్తాను" అంది.

వెంటనే తన ప్రొఫైల్ రిజిస్టర్ చేసిన అన్ని మ్యారేజ్ బ్యూరోలకీ మెస్సేజ్ పంపించింది. తనకి మ్యారేజ్ అయ్యిందనీ అంచేత తన ప్రొఫైల్ తీసెయ్యమని కోరింది.

అదెలాంటి పరిణామాలకు దారి తీస్తుందోనన్న ఊహ ఆమెకి కలగనేలేదు!

"రేపు చూసుకోవచ్చు గాని ఇంక నెట్ కట్టెయ్. ఇవాళ రాధాకృష్ణుల డాన్స్ చేద్దామా? ఒంటిమీద దుస్తుల్లేకుండా..."

"నిన్నూ..." కొట్టడానికి మీదికెళ్ళింది. అతడు గదిలోకి పారిపోయాడు. ఆమె వెంబడించింది. అమాంతం ఆమెని ఎత్తేసి గిరగిరా తిప్పేశాడు.

మర్నాడు కాఫీ తాగుతోంటే నెట్‌లో చూచిన అడల్ట్ జోక్ చెప్పేడు అనురాగ్.

నవ్వకూడదనుకుంటూనే పెద్దగా నవ్వేసింది.

"నీకు సెన్సాఫ్ హ్యూమర్ ఎక్కువే. సరదాగా మాట్లాడి ఎలాంటి వాతావరణాన్నైనా తేలిక చేస్తావు" అందామె.

"నవ్వు ఆరోగ్యానికీ ఆనందానికీ చిహ్నం. నవ్వటం ఓ భోగం అన్నాడు జంధ్యాల. జంతువులెలాగూ నవ్వలేవు. వాటి బదులు కూడా మనమే నవ్వేద్దాం. ఖుషీ ఖుషీగా నవ్వుతూ చలాకి మాటలు రువ్వుతూ..." పాటందుకున్నాడు.

"బాగానే పాడుతున్నావు. నీకిది అదనపు ఎస్సెట్"

"నేను బాత్‌రూం సింగర్నే"

"ఇది డ్రాయింగ్ రూం మహాశయా!" నవ్వుతూ అంది.

"అవునూ కదూ.. నువ్వెదురుగా వుంటే నేనింకేదో ధ్యాసలోకెళ్ళిపోతూంటాను"

"మరీ అంత యావ పనికిరాదు. అతి అనర్థదాయకం"

"సృష్టిలో కిక్కిచ్చేవి, ఆహ్లాదపరిచేవి, ఆనందపులోతులు చూపేవీ రెండే రెండు. ఒకటి హాస్యం రెండు శృంగారం"

"స్టాప్ స్టాప్.."

"శృంగారం బహిరంగంగా చేయకూడదు గాని శృంగార విషయాలు బహిరంగంగానే చర్చించాలిట. ఇది ఎక్కడో చదివింది తప్ప నా స్వకపోల కల్పితం కాదు. ప్రామిస్!"

"మంచి విషయాలే చదువుతున్నావ్.." అని ఇంకేదో చెప్పబోతోంటే కాలింగ్‌బెల్ మోగింది.

పక్కింటావిడ "తోడు పెట్టడానికి మజ్జిగ లేదు, చెంచాడు మజ్జిగ గాని, పెరుగు గాని ఇస్తారా? " అంది.

పెరుగుతో తిరిగొచ్చేసరికి ఇల్లంతా పరిశీలిస్తోందావిడ. "మీఇల్లు ఎంతో పొందిగ్గా వుంది. మీరిద్దరూ చిలకాగోరింకల్లా

వుంటున్నారు. లవ్ మ్యారేజా? "

"అలాంటిదే.."

"అప్పుడే అనుకున్నాను. లేకపోతే ఇంత అన్యోన్యంగా వుండరు"

మందహాసం చేసింది.

"ఏ ఇంట్లో చూసినా రుసరుసలూ, ముక్కుచీదుళ్ళే కదా! ఏ మాటకామాటే చెప్పుకోవాలి. చదువుకున్నవాళ్ళ జ్ఞానం, సంస్కారం.. చదువూసంధ్యా లేనిదాన్ని నాకెలా వస్తాయి, చెప్పు. అదేంటమ్మాయ్ నీ మెడ బోసిగా వుందీ? "

"చెయిన్ ఎక్కడో పెట్టాను.."

"ఛ్ఛొఛ్ఛొ! మంగళసూత్రాన్ని ఎక్కడబడితే అక్కడ పెట్టకూడదు. అసలు మెడలోంచి తీయనేకూడదు. పదికాలాలపాటు నీ పసుపు కుంకాలు చల్లగా వుండాలని రోజూ నిద్ర లేవగానే సూత్రాలని కళ్ళకద్దుకుని కోరుకో. దేవుడు చల్లగా చూస్తాడు. మొగుడికి సింహాసనం దక్కితే అందులో సగం పెళ్లానిదే కదా. వస్తానమ్మా. పప్పూ ఉప్పూ ఏం అవసరమైనా మొహమాటపడకుండా నన్నడుగు. నీ అక్కలాంటిదాన్నీ" అంది రమణి.

"రమణి.. కాదు జిడ్డు.." ఆవిడెళ్ళేక అంది స్వప్నిక.

"నీకేదో సర్టిఫికెట్ ఇచ్చినట్టుంది.."

"నాకు కాదు మనకి. మనమెంతో అన్యోన్యంగా వుంటున్నామంది. ఒక్కరితో కాదు, వందమంది చేత అలా పొగడ్తలు అందుకోవాలి"

"నో డౌట్ ఎబౌటిట్. ఈవెనింగ్ బయటికెళ్తాను. డిన్నర్‌కి రాను"

"ఎక్కడికి కెళ్తున్నావ్? " అడక్కూడదనుకుంటూనే అడిగేసింది.

"రాంపండు అని నా హైస్కూల్ క్లాస్‌మేట్. వాడి పెళ్లి మలక్‌పేటలో. కంపెనీ నుంచి తిన్నగా అటెళ్ళి వస్తాను"

"నేనూ రానా? "

"నువ్వా? !" అర్థోక్తితో చూశాడు.

నాలిక్కరుచుకుంది.

ఏ మొఖం పెట్టుకెళ్తుంది? పెళ్లి చేసుకునుంటే భార్య హోదాలో వెళ్లేది. వారూ ఆప్యాయంగా ఆహ్వానించేవారు. కానిప్పుడో గాళ్ ఫ్రెండ్‌గా, కంపానియన్‌గా!

"వద్దులే. ఫ్రెండ్ పెళ్లికి ఇంకో ఫ్రెండ్‌ని వెంటేసుకెళ్లడం బావోదు" చిన్నబోయిన మొఖంతో అంది.

"నలుగురి దృష్టిలో పడటం.. నలుగురూ నాలుగు రకాలుగా అనుకోవడానికాస్కారం ఇవ్వడం అనవసరం కదా!"

"పాయింటే. అసలే ఆడవాళ్ల దృష్టి మెడ మీదా కడుపుమీదా వుంటుంది. ఇందాక

**కొత్తగాలి...**

**మాట మంచులా ఉండాలి**
**మనసు మల్లెలా విరబూయాలి**
**సమాజమంతా**
**చక్కని పరిమళమే!**

*– లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

ఆవిడ చూశావుగా మంగళసూత్రం తీసేశావేంటంటూ క్లాసు పీకింది"

"ఆ సెంటిమెంటు అలాంటిది. వరలక్ష్మీవ్రతం చేసేదీ భర్త సుఖసౌఖ్యాల కోసమే కదా? భర్తక్షేమంలో తమ క్షేమం చూసుకుంటారు"

అతడి మాటల వెనుక అసంతృప్తి తాలూకు నీడ వుందేమోనని తరచి చూసింది. యధాలాపంగా అని వుంటాడని సరిపెట్టుకుంది.

"మనం ఆలోచించలేదు గానీ, అనురాగ్.. నీ ఫ్రెండ్స్ నా ఫ్రెండ్స్ కావచ్చు నా ఫ్రెండ్స్ నీ ఫ్రెండ్స్ కావచ్చు కాని నీ

బంధువులు నా బంధువులు కారు. నా బంధువులు నీ బంధువులు కారు. చిత్రమైన పరిస్థితి కదూ? "

"అంతా మనవాళ్ళే అనుకుంటే ఏ బాధా వుండదు. వచ్చే నెలలో మా అన్నయ్యా, వదినా వస్తున్నారు. నువ్వు ఆదరించవా చెప్పు? "

"గెస్ట్సులా చూస్తాను"

"అది చాలు. అదనపు ఖర్చు లెక్కగట్టి నేనిచ్చేస్తాను"

"అలాటివాటికి లెక్కలెందుకులే? " నొచ్చుకుంది.

"ఇదిగో ఈ పేపర్లో ఓ కొటేషనుంది చూడు. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అన్నాట్ట మార్క్సు మహాశయుడు"

తుళ్ళిపడి చూసింది స్వప్ని.

అంతేనా? అంతకు మించి మరేమీ లేదా? వుండదా? ఉంటే అదేమిటి?

★ ★ ★

ప్రాజెక్టు ప్రోగ్రెస్‌ని సమీక్షిస్తూ, తమ అసంతృప్తిని వెలిగక్కారు టెక్నికల్ డైరెక్టరూ తదితరులూ.

"సీ.. స్వప్నికా.. ముందే వార్న్ చేశాం. ఇది పెనాల్టీ క్లాజులున్న ప్రిస్టేజియస్ ప్రాజెక్ట్. డెడ్‌లైన్‌కి ముందే ఫినిష్ చెయ్యాలి. లేటయితే వుయ్ హావ్ టు లూజ్ హ్యూజ్ మనీ. దట్ మే క్రియేట్ హారిబుల్ సిచ్యుయేషన్ ఫర్ ది కంపెనీ" అన్నారు బాసులు.

స్వప్నికకి కన్నీళ్లు ఉబికి రాబోయాయి. అతికష్టం మీద నిగ్రహించుకుంది.

"అటువంటి సిచ్యుయేషన్ రానివ్వను. మెంబర్స్‌ని పరిగెత్తిస్తాను. సాటర్‌డే, సండే కూడా వస్తాం. టైమ్‌కి డెలివరీ ఇస్తాం. ప్లీజ్ బిలీవ్ మీ"

'ఓ ఛాన్సు ఇచ్చి చూద్దాం' అనుకున్నారు. అదే మాట ఆమెకి చెప్పారు.

"బీ సిన్సియర్ అండ్ సీరియస్. ప్రాజెక్టు తప్ప ఇంకదేన్నీ నీ మైండ్‌లో ఎంటర్ కానివ్వొద్దు. నీ ఎనర్జీనంతా ప్రాజెక్టు మీదే కేంద్రీకరించు. పదిరోజులు పోయాక మళ్ళీ రివ్యూ చేస్తాం. అప్పటికి గుడ్ ప్రోగ్రెస్ చూపించాలి"

కాన్ఫరెన్స్ హాల్లో ఒంటరిగా మిగిలిపోయింది.

కళ్ళ నుండి ఇంతదాకా అదుముకున్న కన్నీరు కట్టలు తెంచుకుని ప్రవహించసాగింది.

మొదట్లో త్వరగా ఇంటికెళ్ళిపోయింది. అనురాగ్‌తోబాటే తనూ షట్‌డౌన్ చేసేసింది. క్లయింట్‌తో పెద్దగా ఇంటరాక్ట్ అవ్వలేదు. అమెరికన్ టైమింగ్స్ పట్టించుకోనేలేదు!

తను త్వరగా వెళ్ళిపోతూండటం వల్ల కాబోలు టీం మెంబర్సూ సీరియస్‌గా పని చెయ్యలేదు. ప్రాజెక్టు స్లో అవడం గ్రహించి కంగారుపడింది. స్పీడు పెంచాలని చూసింది. కాని మనస్సుని డిస్టర్బ్ చేసే చిన్న చిన్న విషయాలు వరుసగా జరిగేసరికి కాన్సెంట్రేషన్ దెబ్బతింది.

దానికి మూలం అనురాగ్ ప్రవర్తన!

ఒక్కోసారి తాగి వస్తున్నాడు. 'మనకెందుకులే? ' అనుకుంది మొదట. కానది తరచూ రిపీటవుతోంటే భరించలేకపోతోంది. ఆ దరిద్రపు వాసనంటే తనకి అసహ్యం!

ఆ వాసనకి కడుపులో తిప్పుతోందని చెప్పింది. దూరంగా జరిగి పడుకున్నాడు.

"ఇంకెప్పుడూ తాగకు" అంది తీక్షణంగా చూస్తూ.

కరకుగా చూశాడు. "గీత దాటొద్దు. ఎవరిష్టం వాళ్ళది. నో జోక్యం. నో హెచ్చరికలు!"

"అందుకు చెప్పటం లేదు. నీ ఆరోగ్యం పాడవుతుందనీ..."

"పాడయ్యేది నా ఆరోగ్యమే కదా.. నీకేం నష్టం? లీవ్ మీ ఎలోన్"

మరి మాట్లాడలేక ఏదో తెలీని ఉక్రోషంతో ఊగిపోయింది. ఏదేదో అనేసెయ్యాలన్పించింది. తమాయించుకుంది. ఈ మధ్య చెప్పాపెట్టకుండా ఎక్కడెక్కడికో వెళ్తున్నాడు. అడగకూడదని వూరుకుంది.

కాని ఫోన్‌వస్తే చాలు టెర్రేస్ మీదకెళ్ళి మాట్లాడి వస్తున్నాడు. గంటలు గంటలు మాట్లాడుతున్నాడు. తిరిగొచ్చేసరికి మొహం అప్రసన్నంగా వుంటోంది. దేని గురించో తీవ్రంగా తనలో తను ఘర్షణ పడుతున్నట్టుగా వుంటున్నాడు.

తన వెనుక ఏం జరుగుతోందో తెలీదు!

వాళ్ళ వాళ్ళనుంచి తాము చూసిన అమ్మాయిని పెళ్లి చేసుకోమని ఒత్తిడి వస్తోందేమోనని అనుమానం.

నోరు తెరచి అడగలేకుండా వుంది. ఇదీ సంగతి అని అతడూ చెప్పట్లేదు.

ఏవేవో వూహించుకుంటూ భయపడ్తోంది. ఆ భయాలు భూతాలై జుట్టు విరబోసుకుని కలల్లో నర్తిస్తూ భయపెడుతున్నాయి. నిద్రని, ప్రశాంతతని, నమ్మకాన్ని ఏకాగ్రతని- తరిమేస్తున్నాయి!

ఒకవేళ అనురాగ్- వెళ్ళడులే గాని- కర్మకాలి వెళ్ళిపోతే?

తన పరిస్థితేమిటి?

ఆదరించేవారు, అక్కున చేర్చుకునేవారు, ఓదార్చేవారు, భరోసా ఇచ్చేవారు ఒక్కరూ లేరు.

తను ఒంటరి. ఒంటి స్తంభం మేడలో వుంది.

అందర్నీ దూరం చేసుకుని, అందరికీ దూరమై, ఎవర్తో ఏ అవసరం లేదు.. రాదు.. అనుకుని తన జీవనమే, తన జీవితమే తనకి ప్రధానం అనుకుని..

అగాధంలోకి జారిపోతున్న భావన కలిగింది. చేయి అందించేవారు లేని అసహాయురాలినన్న ఫీలింగ్ భయపెట్టింది.

బావురుమంది. ఎవరో వస్తున్నట్టు అడుగుల చప్పుడు విన్పించి కళ్ళు తుడుచుకుంది.

"మణిరత్నం రావణ్ పార్ట్ టూలో వేషం ఇస్తానన్నాడా.. రిహార్సల్స్ చేస్తున్నారూ!"

ఎదురుగా రుషి. ఈ మధ్యే మరో కంపెనీ నుంచొచ్చి 'టెక్ పీపుల్'లో చేరాడు. సరదా మనిషి.

బలవంతాన నవ్విందతడి మాటలకి.

"అబ్బే. కాగితపువ్వుల నవ్వు వద్దు. అప్పుడే విచ్చిన గులాబీలా నవ్వండి"

"నా సిచ్యుయేషన్ మీకు తెలీదు"

"బాస్‌లు తలంటేశారని తెలుస్తూనే వుంది. ఇక్కడ ఒత్తిడి. ఇంట్లో ఒత్తిడి.

> **కొత్తగాలి...**
>
> **కుంభవృష్టి**
> **పైవోడి..**
> **సృష్టి!**
>
> – యు. చిట్టీబాబు,
> కొత్తపాల్వంచ

మద్దెల దరువైపోయింది మీ పని. కేంటీన్ కెళ్ళి లెమన్ టీ తాగుదాం, రండి. లెమన్ టీ నరాలమీద బాగా పని చేస్తుంది. స్ట్రెస్ తగ్గిస్తుంది. కమాన్ రండి"

కేంటీన్ కెళ్ళారు. రెండు కప్పులు తెచ్చి ఒకటి అందిచ్చాడు.

"నా పేరు రుషి, కాని రుషీశ్వరుడ్ని కాదు. జస్ట్ ఆమ్ ఆద్మీని. ఆర్కే లక్ష్మణ్ సామాన్యుడ్ని"

"బాగా మాట్లాడతారు" రిలీఫ్‌గా నవ్వుతూ అంది.

"మాటల్ని కొనాల్సిన రోజులింకా రాలేదు కదా.. అంతదాకా ఇష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టేద్దాం"

హాయిగా నవ్వింది.

"ఇప్పుడు మీ ముఖం గులాబీలా వికసించింది. మాటే మంత్రమయ్యింది, చూశారా. మాటలుంటే చాలు.. గొడవలు, అపార్థాలు, అనుమానాలు, యుద్ధాలు ఏమీ వుండవు"

"పాయింటే..."

"మీ ఇంట్లో మాటల్లేనితనం, అరమరికలు, అడ్డుగోడలు ఎట్సెట్రా ఎట్సెట్రాలాంటి వున్నాయా? చొరవ తీసుకున్నానని అపార్థం చేసుకున్నా ఫర్లేదు"

"అదేం కాదుగాని అలాటిదే.. ఏవో భేదాభిప్రాయాలు, అంతఃసంఘర్షణ, అర్థం లేని భయాలు. ఫలితంగా డ్యూటీమీద దృష్టి కేంద్రీకరించలేకపోవడం"

"దీనికి పరిష్కారం వెరీ సింపుల్. ఆఫీసు గుమ్మమెక్కగానే ఇల్లూ మొగుడూ పిల్లలూ పనులూ సమస్తం మీ బుర్ర లోంచి తుడిచెయ్యండి. పనే ముఖ్యం, పనే దైవం అనుకోండి. ఆఫీసు గడప దాటగానే ఇంటి గురించీ ఇంట్లోవారి గురించీ మాత్రమే ఆలోచించండి. దాని ప్రభావం దీనిమీద పడదు. దీని ఎఫెక్ట్ దానిమీద పడదు. అప్పుడు రెండు చోట్లా హ్యాపీయే"

"అది మీరు చెప్పినంత సులభం కాదు"

"సాధనమున పనులు సమకూరుధర లోన- అని చిన్నప్పుడు నేను చదివిన పద్యం మీకేమైనా ఉపయోగపడుతుందేమో ఆలోచించండి"

"ఎడారిలో పన్నీటి జల్లుల్లా వున్నాయి మీ మాటలు. థాంక్యూ వెరీమచ్" లేస్తూ అంది.

"మీ పేరు...?"

"స్వప్నిక"

"స్వప్నికగారూ! స్వప్నం అబద్ధం జీవితం సత్యం!"




**త**న టీంమెంబర్లతో సమావేశమయ్యింది స్వప్ని.

మరింత శ్రద్ధగా పట్టుదలతో చెయ్యాలంది. శని, ఆదివారాల్లో సైతం పని చెయ్యాల్సిందేనంది. టైమ్‌కి డెలివరీ ఇవ్వకపోతే పింక్ స్లిప్స్‌కి సిద్ధపడాల్సొస్తుందని హెచ్చరించింది.

ఆకలి వెయ్యలేదు. లంచ్ స్కిప్ అయ్యింది. రాత్రి తొమ్మిదింటిదాకా ప్రాజెక్టు వర్కు తప్ప మరేదీ మెదడులోకి ప్రవేశించనివ్వలేదు.

అమెరికాలోని క్లయింట్‌తో మాట్లాడింది. వారి అభిప్రాయాలూ సూచనలూ స్వీకరించింది. కొన్నిటికి వివరణ ఇచ్చింది. ఇకపై స్పీడప్ అవుతుందని చెప్పేసరికి వారెంతో సంతోషించారు.

తృప్తిగా ఫీలవుతూ కంపెనీలోంచి బయటపడుతూ వాచీ వంక చూసింది. పదిన్నర. పేగులు ఆవురావురుమంటున్నాయి. 'ఏమైనా తిందామా?' అని తటపటాయించి, అనురాగ్ వెయిట్ చేస్తూంటాడన్పించి ఆ ప్రయత్నం విరమించింది.

రెండుసార్లు బెల్ మోగిస్తేగాని తలుపు తీయలేదు. "అప్పుడే నిద్రపోయావా?"

జవాబివ్వకుండా వెళ్ళిపడుకున్నాడు.

స్నానం చేసి వచ్చింది. చప్పుడు చేయ

కుండా డైనింగ్ టేబుల్ మీది ప్లేటూ గ్లాసూ తీసుకుంది. డిషెస్ ఏమీ కన్పించ లేదు. కిచెన్లో వుంచేశాడేమోననుకుని వెళ్ళి చూసింది.

అన్నీ ఖాళీ. వండిన దాఖలాలే లేవు. సర్రున కోపం, ఉక్రోషం దూసుకొచ్చాయి.

విసవిసా గదిలోకెళ్ళి అనురాగ్ కప్పు కున్న దుప్పటి లాగేసింది.

"ఏయ్.. ఏంటిది? "

"వంట చెయ్యకుండా దున్నపోతులా నిద్రపోతున్నావా? "

"ఇవాళ వంట డ్యూటీ నీది కదా? నువ్వే చేసుకో"

"నేను చేసిపెడితే నువ్వు తేరగా మెక్కు తావుగాని నా కోసం నువ్వు ఎక్స్ట్రాగా ఒక్కరోజు చెయ్యలేవా? "

"నేను బయట తిన్నాను. లేటయ్యింది కదా కేంటీన్లో తినుంటావనుకున్నాను"

"నాకో ఫోన్ కొట్టొచ్చుగా. నేను తిన్నానో లేదో, చచ్చానో బతికానో నీకనవ సరమన్న మాట. నువ్వింత స్వార్థపరుడివ నుకోలేదు" ఏడ్చేసింది.

"అర్ధరాత్రి అంకాలమ్మ శివాలేం టి? నువ్వు తినకుండా వస్తావని కలగ న్నానా? వండాల్సిన నీ డ్యూటీని నువ్వు చెయ్యకుండా ఎదురు నన్నంటావేమిటి? "

"వెధవ డ్యూటీలు.. డ్యూటీ తప్ప ఇంకేం లేదా? "

"ఇంకేముంది మన మధ్య? "

అగ్నికెరటం మొఖాన తాకినట్టు అదిరి పడింది. నిశ్చేష్టురాలయింది. పిచ్చిగా చూసింది.

తలగడ్లో మొఖం దాచుకుని భోరున విలపించింది. సానుభూతిగా చూస్తుండి పోయాడు.

రోజులానే ఉదయం ఆలస్యంగా లేచారు. గుడ్మాణింగ్లు చెప్పుకోలేదు. యాంత్రికంగా పనులు చేసుకోసాగారు.

రుషి మాటలు గుర్తొచ్చాయి స్వప్నికి. "మనం స్థిమితంగా కూర్చుని మాట్లాడు కుంటే బావుంటుంది అనురాగ్"

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. టీవీ పెట్టలేదు. పేపర్ మడత విప్పలేదు.

కాఫీ తాగుతూ అపరాధ భావనతో నలి గిపోతూ మెల్లగా అంది "రాత్రి నేనలా బరస్ట్ అయి వుండాల్సింది కాదు. ఫూలి ష్గా సీన్ క్రియేట్ చేశాను. తప్పంతా నాదే. అయాం వెరీ సారీ అనురాగ్"

"నా తప్పూ వుందిలే. నీ గురించి ఎంక్వైర్ చేసుండాల్సింది. లేటవుతుందంటే బయట్నుంచి ఫుడ్ పాకెట్ తేవాల్సింది. ఎంత ఆకలి మీదున్నావో పాపం. మినిమం కన్సర్న్ చూపించలేకపోయాను. అయామ్ సారీ"

"లంచ్ చెయ్యలేదు. ఆకలి మీదున్నా నేమో వెర్రికోపం వచ్చేసింది. కళ్ళు మూసు కుని నీ మీద పడ్డాను.. సారీ"

"అయాం రియల్లీ సారీ. లంచ్ ఎందుకు స్కిప్ అయ్యావు? "

"ప్రాజెక్టు వర్కు స్లో అయ్యిందని తిట్టి పోశారు" బుంగమూతి పెట్టుకుని చెప్పింది.

"మన డైరెక్టర్లు మరీ దారుణంలే. తక్కువ మందితో ఎక్కువ పని చేయించా లని చూస్తారు. ఈ మధ్య ఆర్డర్స్ లేవని చెప్పి ఇరవైమందిని తీసేశారు. ఆర్డర్లు రాక కాదు, ఆ లోడ్ అంతా మిగతా వాళ్ల నెత్తికెత్తుదామని!"

"ఏ మేనేజ్మెంటు అయినా అంతేలే"

"మిగతా కంపెనీల్లో ఇంత వర్కులోడ్ లేదు. మా ఫ్రెండ్సు కొందరికి అయిదారు గంటల పని కూడా వుండట్లేదుట. మంచి ప్యాకేజ్ ఆఫర్ వస్తే జంప్ చేయడం బెటర్. వీళ్ళేమో డాలర్లు మూటగట్టు కుంటూ మనకి రూపాయలు కాదు, పైసలు బిచ్చమేస్తున్నారు!"

"కంపెనీ సంగతి పక్కన బెట్టు. రాత్రి జరిగిన ఘటనలాంటివి రిపీట్ కాకుండా జాగ్రత్త పడదాం. ఇంకెప్పుడూ అలా బిహేవ్ చెయ్యనని ప్రామిస్ చేస్తున్నాను"

"ఏ టూ. ఇదంతా కమ్యూనికేషన్ గ్యాప్‌వల్ల వచ్చింది తప్ప మరేం కాదు"

"అయితే అదంతా మరచిపోయినట్టే కదా? "

"రాత్రే మరచిపోయాను. చిన్నచిన్న తప్పులూ లోపాలూ వుంటే సర్దుకుపోదాం. చిన్న విషయాన్ని పెద్ద ఇష్యూ చేసి రాద్ధాంతం చేసుకోవద్దు"

ఉలిక్కిపడిందామె. ఎడ్జస్ట్‌మెంట్? సర్దుకుపోవడం?

ఇక్కడా తనకి తప్పదా?

"ఏంటలా అయిపోయావు? నేనేమైనా తప్పుగా మాట్లాడానా? "

"అహఁ. ఈ సర్దుబాట్లూ సరిపెట్టుకోడాలూ పెళ్లిలోనే వుంటాయనుకొన్నాను"

"ఇద్దరు కలిసి వుంటున్నప్పుడు అభిప్రాయాల్లో అలవాట్లలో అభిరుచుల్లో తేడాలు సహజం. సర్దుకుపోక తప్పదు. అవే పట్టుకువేళ్లాడితే బీటలు ఏర్పడతాయి తప్ప పాలు నీళ్ళలా కలిసిపోలేరు!"

కొత్త సంగతులు అర్థమవుతోంటే జీర్ణించుకోడానికి ప్రయత్నిస్తూండి పోయింది.

"ఇంకా అలా మూడీగా వున్నావేంటి వాన వెలిసిందిగా!"

"వానెప్పుడు కురిసింది? " తలతిప్పి బయటికి చూస్తూ అడిగింది.

"ఇంకా కురవలేదు. ఇప్పుడు కురుస్తుంది ముద్దుల వాన!"

ఆమెని సమీపించి ఆమె మోముని చేతుల్లోకి తీసుకొని ముద్దుల్తో ముంచెత్తాడు.

★ ★ ★

ఆదివారం.

స్వప్నిక, అనురాగ్ చెరో ల్యాప్‌టాప్ ఒళ్లో పెట్టుకొని దానిలో లీనమైపోయారు.

వారి మధ్యదూరం మూడడుగులే. కాని విభిన్న లోకాల్లో వున్నారు.

అనురాగ్ ఆర్కుట్, ఫేస్‌బుక్‌లలో విహరిస్తున్నాడు. దేశవిదేశాల్లో వున్న మిత్రుల్తో 'చాట్' చేస్తున్నాడు.

స్వప్నిక కొన్నాళ్ళ గ్యాప్ తర్వాత తన బ్లాగులో వివాహం కన్నా సహజీవనం ఎన్ని విధాల మేలైనదో ఏకరువుపెడుతోంది. స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ, ప్రత్యేక అస్తిత్వం సహజీవనం వల్లే లభిస్తాయని ఢంకా బజాయించి చెబుతోంది. స్త్రీ పురుష సమానత్వానికి, స్నేహ పూర్వక సంబంధానికి సహజీవనం ఒక్కటే మార్గమని నొక్కి వక్కాణిస్తోంది.

పక్కింటావిడ ఉల్లిపాయలకోసం వచ్చి తీసుకుని వెళ్తూ ఆగి "కూర ఘుమ ఘుమలేమీ లేవేంటి" అంది ముక్కు ఎగరేస్తూ.

"బిర్యానీ ఆర్డరిచ్చాం. వచ్చేస్తూంటుంది"

ఆవిడెళ్లేక "ఆడవాళ్ళని గూఢచార్లుగా నియమిస్తే ఎక్కడెక్కడున్న టెర్రరిస్టుల్నీ పట్టేద్దురు" అన్నాడు.

"వారిదృష్టి పక్కింటి వాళ్ళమీంచి తమ స్థితిగతుల మీదకి మళ్ళిస్తే స్త్రీ స్థానం గొప్పగా మారిపోయేది!"

"అప్పుడు 'లేచింది మహిళాలోకం' అని గాక 'పరుగెత్తింది మహిళా లోకం' అని పాడతాను"

"చూస్తూ వుండు.. ప్రమీలారాజ్యం వచ్చినా వస్తుంది"

"రానియ్యి. అన్నట్టు రేపు మా అన్నయ్యా వదినా వస్తున్నారు స్వప్నీ!"

చటుక్కున లేచి కూర్చుందామె. "రేపేనా? "

"వూఁ. చాలా జాగ్రత్తగా హేండిల్ చెయ్యాలి. మా వదిన దేవాంతకురాలు"

"మన రిలేషన్ గురించి తెలుసా? "

"లవ్ మ్యారేజ్ చేసుకున్నానని

చెప్పేను..." కించిత్తు గిల్టీగా ఫీలవుతూ అన్నాడు.

స్థాణువయ్యింది. ఇంతింత కళ్ళతో చూసింది.

"అపార్థం చేసుకోవడం నాకిష్టం లేదు"

"నీ పద్ధతి నాకు నచ్చలేదు"

"నీకు నచ్చాల్సిన పనేముంది? " ఎదురు దాడికి దిగాడు.

అయోమయంగా చూసింది స్వప్న.

"ఇది నా ప్రోబ్లం. మా వాళ్ళకి నేనేం చెప్పుకుంటానో, ఎలా కన్విన్స్ చేసుకుంటానో నీకనవసరం. వాళ్ళనుంచి మనకెలాంటి సమస్యా రాకుండా చూసుకోవటమే నాకు ముఖ్యం"

ఆమె మొఖం తిప్పేసుకుంది "అటువంటప్పుడు నాకు చెప్పడం ఎందుకో"

"నీ కోఆపరేషన్ కోసం. మా అన్నయ్య వదినెల ముందు మనమెంతో హ్యాపీగా వున్నట్లు ప్రవర్తించాలి"

"హ్యాపీగానే వున్నాం కదా!"

"అఫ్‌కోర్స్. వాళ్ళున్న రెండ్రోజులూ రోల్డ్‌గోల్డ్ మంగళ సూత్రాలు మెడలో వేసుకుంటే బావుంటుంది. నీ స్థానం గురించే.. నీ విలువ పెరగాలనే!"

ఆమె మోము జేవురించింది. భారంగా నిట్టూరుస్తూ చూసింది.

"సారీ.. తాళిని ఎగతాళి చేసే నేను- నా అంతట నేను- నా మెడకి తగిలించుకోలేను"

"పోనీ నేను వేస్తాను"

"సారీ. నీకు నమ్మకం సడలుతూండవచ్చు. కానీ సహజీవనం మీద నా విశ్వాసం రోజురోజుకీ పెరుగుతోంది. ఇదే సరియైన విధానమంటూ నా బ్లాగులో కూడా రాశాను..."

"ఎన్నైనా రాసుకో. కానీ ఈ రెండ్రోజులూ..."

"ఇంకేమైనా అడుగు అది తప్ప"

"సరే.. ఏం జేస్తాం. కులాంతర వివాహమని ఎలాగూ చెప్పేను గనుక మీ కులంలో తాళి ఆచారం లేదని ఇంకో అబద్ధం ఆడేస్తాను"

"నీ ప్రోబ్లం.. నీ ఇష్టం"

"ఈ రెండ్రోజులూ నేను ఇంటి పని చెయ్యను. వాళ్ళేదో అనుకుంటారు.

## గాంధీజీ చతురోక్తులు



గాంధీజీ సంభాషణా చాతుర్యం, హాస్య ప్రియత్వం జగత్ప్రసిద్ధం. అక్టోబరు 2న గాంధీ జయంతి సందర్భంగా వివిధ సందర్భాలలో ఆయన నుడివిన చతురోక్తులు కొన్ని...

### జైలులోనే మరో జైలు

గాంధీజీ సత్యపూజారి. ఆయన ఆడిన మాటను తప్పేవారు కాదు. ఒకసారి ఎరవాడ జైలులో ఉన్నప్పుడు బయటి విషయాలు గాంధీజీకి తెలియకూడదని ఆయనకు వార్తాపత్రికలను బంద్ చేశారు. అంతేకాదు, వాటిని తను చదవనని జైలు అధికారులకు గాంధీజీ మాట కూడా ఇచ్చారు.

గాంధీజీకి ఆరోగ్య పరీక్షలు చేసేందుకు వచ్చే వైద్యుడు మాత్రం ఎలాగైనా బయటి విషయాలు ఆయనకు తెలిసేలా చేయాలని వార్తాపత్రికలను తెచ్చి, ఆ సెల్ లోనే వదిలేసి వెళ్లిపోయాడు.

మరుసటిరోజు ఆ వైద్యుడు వచ్చినప్పుడు గాంధీజీ 'మీరు ఎంత పని చేశారండీ! నిన్నటి దినపత్రికల్ని జైలులోనే వదిలేసి వెళ్లిపోయారు. వాటివంక చూస్తే నాకెక్కడ చదవాలని బుద్ధి పుడుతుందేమోనని నేను ఈ మూలనే కదలకుండా మెదలకుండా కూర్చుని, మనస్సును నిగ్రహించుకున్నాను. ఆ విధంగా మీరు నాకోసం ఈ జైలులోనే మరో చిన్నజైలును సృష్టించి వెళ్లిపోయారు' అన్నారు నవ్వుతూనే.

తర్వాత నాలుగురోజులు అన్నీ పనులూ నేనే చేస్తాను"

"డిగ్నిటీ ఆఫ్ లేబర్. మనపని మనం చేసుకోవడంలో తప్పేముంది? న్యూనతేముంది? ఇది ఆడపని, అది మగపని అని విభజించడం అనాగరికం. అమెరికాలో వుంటోన్న ఇండియన్ కపుల్స్ కూడా ఇంటిపని పంచుకుంటున్నారు తెలుసా? అదే నువ్వూ చేస్తున్నావు. ఇందులో ఎవరైనా ఏమైనా అనుకోడానికి, చిన్నచూపు చూడ్డానికీ ఆస్కారమేముంది? "

"అక్కడి కల్చర్ అది. అక్కడలా చెయ్యకపోతేనే తప్పు. అదింకా మనకి వంటబట్టలేదు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నా వంటింటి బాధ్యతంతా స్త్రీదే!"

"అలాంటిది వుండకూడదనేగా మనం కొత్త బాట తొక్కిందీ, కొత్త జీవన విధానం అవలంబించిందీనూ!"

"నిజమే. కాని వాళ్ళున్నప్పుడు సంప్రదాయబద్ధంగానే వుందాం. వాళ్ళెళ్ళిపోయాక మనిష్టం...."

"ఆ నటనెందుకంటాను? ఆడామగా సమానమా, కాదా? " సూటిగా ప్రశ్నించింది.

"సమానమే. కాదంటే మగాడు కాస్తెక్కువ సమానం!"

"ఆ తిరకాసేవిటి? !"

గబుక్కునామె గెడ్డం పట్టేసుకున్నాడు అనురాగ్.

"ప్లీజ్ స్వప్నీ. నువ్వు చాలా మంచిదానివి. గొప్పదానివి. సమర్థురాలివి. సవ్యసాచివి. కొత్త జీవన విధాన సృష్టికర్తవి. ఇంకా చాలా చాలావి. ఈ ఒక్కసారికీ నా మాట మన్నించు. నా పరువు దక్కించు"

ఆమె బింకం సడలింది. "ఒకసారి తలొంచితే మళ్ళీ మళ్ళీ అడుగుతారు"

"అడగను. ప్రామిస్. మీ వాళ్ళెవరొచ్చినా వంట పనంతా నేనే చేసి వడ్డిస్తాను. సరేనా? "

పూర్తిగా కరిగిపోయింది.

★ ★ ★

సికింద్రాబాద్ స్టేషన్కెళ్ళి అన్నా వదినెల్ని రిసీవ్ చేసుకుని తీసుకొచ్చాడు అనురాగ్.

సాదరంగా ఆహ్వానించింది స్వప్నిక.

ఆమెను నఖశిఖపర్యంతం పరీక్షగా చూశారు.

'హోమ్లీ'గా వుంది అని తృప్తిపడ్డాడు రవిశంకర్.

'లవ్ మ్యారేజ్ అంటే జగదేకసుందరి కాబోలనుకున్నాను. నాలాగే వుంది' అనుకుని తృప్తిపడింది అనసూయ.

"మీది నర్సాపురమా? నాన్నగారేం చేస్తారు? " వివరాలు కూపీ లాగబోతోంటే అడ్డుపడ్డాడు అనురాగ్.

"అవన్నీ తాపీగా మాట్లాడుకోవచ్చు. నువ్వు ముందు ఫ్రెషప్ అవ్వు అన్నయ్యా. పదింటికల్లా మీ బ్యాంక్ హెడ్డాఫీసు కెళ్ళాలన్నావుగా.. "

అతికష్టం మీద అవాళొక్కరోజుకీ సెలవు పెట్టింది స్వప్ని. ఆ మర్నాడు అనురాగ్ పెడతానన్నాడు.

టిఫిన్ చేసి రవిశంకర్, అనురాగ్ వెళ్ళిపోయారు. వంట పూర్తవుతోంటే కిచెన్లోకి వచ్చింది అనసూయ.

"కాసిని కాఫీ నీళ్ళియ్యి. ఆరగా ఆరగా తాగకపోతే నాకు నీరసం వచ్చేస్తుంది"

కాఫీ కలుపుతూ, "ఏమైనా తేడాయేమో డాక్టర్కి చూపించుకోలేకపోయారా? " అంది.

"ఆ సంబడమూ అయ్యింది. టెస్టులంటూ పదివేలు గుంజి కడకే రోగమూ లేదన్నారు"

ఫర్నీచరంతా పట్టిపట్టి చూసింది. "అంతా కొత్తదే. మీ వాళ్ళు పెట్టేరా.. మీరు కొనుక్కున్నారా? "

"మేమే కొనుక్కున్నాం"

"మీ మంచం బొత్తిగా సాదా సీదాగా వుంది. మా మంచం ఎంత బావుంటుందో చెప్పలేను. మా నాన్న స్వయంగా రాజమండ్రి వెళ్ళి ఒరిజినల్ రోజ్‌వుడ్ కొనుక్కొచ్చి దగ్గరుండి తయారుచేయించారు"

విసుగు దాచుకుంటూ వింటోంది స్వప్ని.

"కట్నం ఏ మాత్రం ఇచ్చారేవిటి? "

"జీరో"

అవాక్కై చూసింది. "ఒక్క రూపాయీ ఇవ్వలేదా? ! ఎంత ప్రేమ పెళ్లైతే మాత్రం కట్నం ఇవ్వొద్దూ! ఆస్తిపాస్తులేమైనా ఇచ్చారా.. అదీ సున్నాయేనా? "

"సున్నాయే"

"ఎంత చిత్రం! గొప్పలకి పోయే మావగారి రెండో కోడలు చెల్లని కానీని కూడా కట్నంగా తీసుకురాలేదు! అనురాగ్ చెప్పేడో లేదో మా నాన్న అయిదెకరాల పొలమూ నాలుగొందల గజాల స్థలమూ అరకేజీ బంగారమూ పెట్టేరు.." ఆగి, స్వప్నిక మెడవంకా చేతులవంకా చూసింది.

"మెడలో బొత్తిగా సన్నని గొలుసు వేసుకున్నావు.. నీకేమాత్రం బంగారం వుందీ? "

"ఈ చెయినూ.. ఈ గాజులూ.. అంతే"

బుగ్గలు నొక్కుకుంది అనసూయ.

"నీ చోద్యం సంతకెల్ల! మీ నాన్న పెట్టకపోతే మానె, నువ్వు కొనుక్కోవద్దూ! మీరిద్దరూ కలిసి నెలకి లక్షరూపాయలు సంపాదిస్తున్నారుగా? ఇదే నేనైతే నెలకి రెండు తులాల బంగారమూ ఓ పట్టుచీర చొప్పున కొనేసేదాన్ని. ఇప్పుడైనా మించిపోయింది లేదులే. జ్యూయలరీ షాపుకెళ్ళి ఒక నక్లెస్, ఒక కాసులపేరు, లావుపాటి బొందూ, రాళ్ళ గాజులూ కొనుక్కొద్దాం.. పద"

"బంగారంమీద నాకంత ఇంట్రెస్ట్ లేదు. వేరే వాటిమీద ఇన్వెస్ట్ చేశాను"

ఎనిమిదో వింతని చూసినట్లు చూసింది అనసూయ.

"బంగారమన్నా చీరలన్నా ఇష్టం లేనిదానివి ఈ భూప్రపంచం మొత్తం మీద నువ్వొక్కదానివే అయ్యుంటావ్"

స్వప్ని బదులివ్వలేదు.

"నువ్వెక్కడో పిచ్చిదాన్లా వున్నావు. ఆడవాళ్ళని లక్ష్మీదేవి అని ఎప్పుడంటారో తెలుసా? ఒళ్ళంతా బంగారం వుంటేనే. వయస్సు మిసమిసలు తగ్గినా నగల ధగధగలు నిన్ను మెరిపిస్తాయి. అప్పుడే మగాడు మన గుప్పిట్లో వుంటాడు. లేకపోతే పక్కచూపులు చూస్తాడు"

> **కొత్తగాలి...**
>
> **ఏరాయయితేనేం..**
> **పళ్లూడగొట్టుకోడానికి?**
> **ఏ పార్టీ అయితేనేం..**
> **మనల్ని దోచుకోడానికి?**
>
> **– ఆర్.ఎస్. హైమవతి,**
> చెన్నై

"అనురాగ్ అలాటివాడు కాదు. అతడి సంగతి నాకు బాగా తెలుసు"

"నువ్వు పిచ్చిదానిలా వున్నావు. కుక్క తోక వంకరైనా పోద్దేమోగాని మగాడి బుద్ధి వంకర ఎప్పటికీ పోదు. సృష్టి మొదలైనప్పట్నుంచీ ఇదే కథ. ఎర్రగా బుర్రగా కన్పిస్తే చాలు ఎగేసుకుపోతారు. తాళి కట్టిన పెళ్లాం గనక ఇంట్లోనే అఘోరిస్తుందని వారి ధీమా. మగాడ్ని నమ్మకూడదు. వాళ్ళకన్నా ఊసరవెల్లి నయమనుకో. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు!" అనసూయ వాక్ప్రవాహం అడ్డూ అదుపూ లేకుండా సాగిపోతోంది.




విభ్రమంగా వినసాగింది స్వప్ని. వింటోన్నకొద్దీ ఏవో తెలీని భయాలు గుండెల్లో ఊపిరి పోసుకోసాగాయి!

"కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందిగానీ మీ బావగారికీ రెండో సెటప్పు వుంది. పైకి ఎంత పెద్ద మనిషిలా వున్నారో చూశావుగా. చేసేదీ అల్లా టప్పా ఉద్యోగం కాదు.. బ్యాంకు మేనేజరు!"

షాక్ తిన్నదా మాటలకి. ఆవిడ మాటల వెనుక దాగివున్న బాధ అర్థమైంది. సానుభూతిగా చూసింది.

పక్కింటి రమణి "చుట్టాలొచ్చారా? " అంటూ వచ్చింది.

పరిచయాలయ్యాక "వీళ్ళది ముచ్చటైన జంట. ఎంత కలివిడిగా వుంటారో చెప్పలేను. ఏం కావాల్సొచ్చినా అక్కయ్యా అంటూ వస్తుందీ అమ్మాయి. అబ్బాయీ అంతే. మా వారినెన్నో సలహాలడుగుతూంటాడు. ఇద్దరికిద్దరే. ఉద్యోగాలు చేస్తున్నా పిసరంత గర్వం లేదు" అంటూ సొరకాయలు పరపరా కోసేసింది.

"మీరెన్నైనా చెప్పండి. మా మరిదికి ఈ అమ్మాయి మీద ప్రేమ లేదు" అంటూ బాంబు పేల్చింది అనసూయ.

అదిరిపడ్డారు స్వప్నీ, రమణీ.

ఆందోళనగా చూస్తోన్న స్వప్నిని చూపిస్తూ, "మీరే చూడండి. సన్నని దారపోగులాంటి చెయిన్ వేసుకుంది. ప్రేమ వున్న ఏ మగాడైనా ఇలా వుండనిస్తాడా చెప్పండి" అంది.

సంగతి అర్థమవడంతో హాయిగా నిట్టూర్చింది స్వప్నిక.



"బాగా చెప్పేరు. మీ మరిదికో మాట చెప్పి బొందూ, నల్లపూసల గొలుసు కొని పించి వెళ్ళండి" రమణి అంది.

"రేపు ఆ పనే పెట్టుకున్నాను"

రమణి వెళ్లేక మళ్లీ ఇల్లంతా కలయజూ సింది. "మంచం ఒకటేగాని గదిలోనూ బాత్‌రూంలోనూ అన్నీ రెండేసీ సెట్లు ఉ న్నాయేంటీ? "

గతుక్కుమంది స్వప్ని. "అదా.. అదీ.. టేస్టులు వేరువేరు కదా.. అందుకన్నమాట"

"ఇంకా ఇద్దరూ పూర్తిగా కలిసిపోలేదన్న మాట"

ఆ రాత్రి భోజనాలయ్యాక ఇద్దర్నీ కూర్చో బెట్టి హితబోధ చేశాడు రవిశంకర్. ఎన్నో జాగ్రత్తలు చెప్పాడు. మధ్య మధ్య అన సూయ కూడా కల్పించుకుని సుద్దులు చెప్పింది. ఎదురుప్రశ్న వెయ్యకుండా బుద్ధి మంతుల్లా విన్నారు.

వాళ్లకి తమగది ఇచ్చి రెండో గదిలో చాప వేసుకున్నారు స్వప్నీ అనురాగ్.

"హమ్మయ్య. ఒకరోజు గడిచింది. రేపు కూడా ఇలా గడిచిపోతే ఒడ్డున పడి పోతాం" అన్నాడు అనురాగ్.

"రేపు ఇంట్లో వుండేది నువ్వేకదా.. బాగానే మేనేజ్ చేస్తావులే"

మర్నాడు వంటచేసి ఆఫీసుకెళ్లి పోయింది స్వప్నిక.

"నేనేదో భయపడ్డాను గాని నీ భార్య కుదురైందే. ఉద్యోగం చేస్తున్నానన్న పొగరు, గర్వం, లెక్కలేనితత్వం ఏమీ లేవు. అనుకూలవతే" అన్నాడు రవిశం కర్.

"పేదింటి పిల్ల అన్నమాటే గాని మిగతా పద్ధతులన్నీ పద్ధతిగానే వున్నాయి" అంది అనసూయ.

"పేదవాళ్లమని చెప్పిందా?"

భర్త ప్రశ్నకి "నోరు తెరచి ప్రత్యేకంగా చెప్పాలేంటి? పైసా కట్నం ఇవ్వలేదు. అర్థణా సామాను పెట్టలేదు" అందామె.

"ఈ ఫ్లాట్‌కి అద్దె ఎంత?"

"అ.. అయిదు వేలు" తడబడ్డాడు అనురాగ్.

"మీ మావగారికి బాగా ఆస్తి వుంటే ఇలాటి ఫ్లాట్ ఒకటి కొనిపెట్టమనరా. ఈ వేడిలోనే రాబట్టాలి. తర్వాత్తర్వాత బూడిద కూడా విదల్చరు. చుట్టూ ఎన్ని ఎపార్ట్‌మెంట్లో. ఆలస్యం చెయ్యకుండా నువ్వైనా ఒకటి కొనెయ్. మా బ్యాంక్ బ్రాంచి ఇక్కడా వుంది. వాళ్లకి చెబుతాను. లోన్ త్వరగా శాంక్షన్ చేస్తారు" బాల్కనీలోకెళ్లి చూస్తూ అన్నాడు రవిశంకర్.

"వందలు కాదు, వేల ఎపార్ట్‌మెంట్లున్నాయి. అయినా అద్దె అయిదు వేలిస్తున్నావంటే ఎక్కువే మరి" మళ్ళీ తనే అన్నాడు.

ఆ మాటలు రమణి చెవిలో పడ్డాయి. గబుక్కున ముందుకొచ్చింది.

"మావాడు అయిదేవేలు ఇస్తున్నాట్ట"

"వాళ్ళు అద్దె ఇవ్వడమేమిటీ! ఈ ఫ్లాట్ వాళ్లదేకదా? ఫ్లాట్ ఓనర్ స్వప్నిక అంటూ పెద్ద పెద్ద అక్షరాల్లో కింద గోడ మీద రాశారు. మీరు చూళ్లేదా?"

తమ్ముడి వంక చూశాడు రవిశంకర్. తల దించుకున్నాడతడు.

లోపలి కొచ్చేక అన్నాడు "మరీ ఇంత చాటేమిట్రా. నువ్వు ఫ్లాట్ కొన్నానంటే సంతోషపడేది మేమే కదా? నీ పెళ్లాం పేరున పెడతామంటే వద్దంటామా చెప్పు!"

"మావగారు కట్టుబట్టల్తో కూతుర్ని పంపేసినా పెళ్లానికి ఈ ఫ్లాట్ గిఫ్టుగా ఇచ్చాడు. మీ కన్నా మీ తమ్ముడే నయం!"

భార్య మాటలకి చురుగ్గా చూశాడు. గమ్మునుండి పోయిందామె.

"నీ గురించి వర్రీ అవ్వక్కర్లేదని నాన్నకి చెబుతాన్లే. యాభై లక్షలిస్తాం, కోటి రూపాయలిస్తాం అంటూ సంబంధాలొచ్చాయి గనుక నాన్నావాళ్లకి బాధగా వుండటం సహజం. వాళ్లు కోరేదీ, ఆశించేదీ నీ సుఖమే. చెప్పకుండా పెళ్లి చేసుకున్నావని కోపం వుందనుకో. మేం సర్ది చెబుతాంలే. మంచిరోజు చూసుకుని నీ పెళ్లాన్ని తీసుకుని గుడివాడ వెళ్లు. అమ్మానాన్నల ఆశీర్వాదం తీసుకో. అన్ని బంధాలకన్నా రక్త సంబంధం చిక్కన. అది గుర్తుంచుకో"

బుద్ధిగా తలూపాడు అనురాగ్.

వాళ్లు వెళ్లడానికి సిద్ధమవుతోంటే వచ్చింది స్వప్నిక.

వస్తూ కొత్త బట్టలు కొనుక్కొచ్చింది. అవి వాళ్ళకి పెట్టి కాళ్ళకి దణ్ణం పెట్టుకుంది.

పరమానంద పడిపోయారు.

"సంప్రదాయం తెలిసిన పిల్ల" అంది అనసూయ.

"అనుకూలవతి లభించింది. అదృష్టవంతుడివిరా" అన్నాడు అన్న తమ్ముడితో.

వాళ్లని రైలెక్కించి వచ్చేక అన్నాడు అనురాగ్ "అన్నావదినల్ని బాగానే బుట్టలో వేసుకున్నావు. అసల్నీకా ఐడియా ఎలా వచ్చింది?"

"గాయత్రి ఫోన్ చేస్తే చెప్పేను. బట్టలు కొనిమ్మంది. సద్భావన పెంచుకోవాలని సలహా ఇచ్చింది. మనింటికి తొలిసారిగా వచ్చిన అతిథులు కదాని కొన్నాను. బాగా క్లిక్ అయ్యింది" విజయహాసం కదలిందామె పెదాలమీద.

"మొత్తానికి లాస్ట్‌మినిట్ టచస్‌తో నాకన్నా ఎక్కువ మార్కులు కొట్టేశావు. నాకు చాలా సంతోషంగా వుంది స్వప్నీ.

అయామ్ ప్రౌడాఫ్‌యూ..."

అతడి మొఖంలో చిందులేస్తోన్న ఆనందం చూసి మురిసిపోయింది.

వాళ్ళ ఆనందక్షణాల్ని ఛిన్నాభిన్నం చేస్తూ ఫోన్ మోగింది.

సెల్ స్క్రీన్‌మీద తండ్రి ఫొటో చూసి బెదిరింది. కంపిత స్వరంతో "హలోడాడీ" అంది స్వప్ని.

"చాలా ఘోరం! చాపకింద నీరులా దారుణం జరిగిపోయింది బేబీ. ఎవరో మనమీద కక్షకట్టి కావాలని చేస్తున్నారు"

"అసలేం జరిగింది డాడీ"

"నాలుగైదు మ్యారేజ్ బ్యూరోలకి డబ్బు కట్టి నీ బయోడేటా ఇచ్చాం కదా.. వాళ్లంతా మూకుమ్మడిగా నీ వివరాలు తీసేశారు!"

తేలిగ్గా నిట్టూర్చింది. అయినా బయట పడ దల్చుకోలేదు.

"ఎందుకు తీసేశారట? "

"నీకు పెళ్లైపోయిందని ఎవరో మెయిల్ ఇచ్చార్ట. పరాంకుశం వెళ్లి గొడవ చేశాడు. నీ మెయిల్ ఐడీ నుంచే వచ్చిందని వాళ్లు చెప్పారు. నీ చుట్టూ వున్నవాళ్లే ఎవరో నీకు తెలీకుండా నీ మెయిల్నుంచి పంపించి వుంటారు. నీకు పెళ్లి కాకుండా చేసి ఏదో లబ్ధి పొందాలని ఎత్తు వేసుంటారు. వాళ్లని వదిలేస్తే మరీ రెచ్చిపోతారంటున్నాడు పరాంకుశం. హైదరాబాద్ వచ్చి పోలీసుకేసు పెడతానంటున్నాడు.."

"వద్దొద్దు డాడీ. బావని పంపొద్దు. ఆయనకి సుతీ మతీ తెలీదు. ఏదో అనుకుని ఇంకేదో చేస్తారు" కలవరపడుతూ చెప్పింది. తన గొంతు తనకే వికృతంగా అన్పించింది.

"అలాటి బద్మాషుల్ని వదలకూడదు. పెళ్లిళ్ళు చెడగొట్టేవాళ్లు రాక్షసులకన్నా క్రూరులు. ఆ సంగతి విన్నప్పట్నుంచీ మీ మమ్మీ ఏడుస్తూ కూర్చుంది. నాకేమో కాళ్లూ చేతులూ ఆడటం లేదు. బావేమో రంకెలేస్తున్నాడు. నీకే ఎందుకిలా జరుగుతోందో అర్థం కావట్లేదు"

గుండె చిక్కబట్టుకుంటూ అంది, "ఎక్కడో ఏదో పొరబాటు జరిగి వుంటుంది. అంతా నేను చూసి చక్కదిద్దుతాన్లే డాడీ. మీరనవసరంగా హైరాన పడకండి. అంతా మన మంచికే అనుకోండి"

"అదేంమాట. చెడు ఎదురొస్తోంటే మన మంచికే అని ఎలా సరిపెట్టుకోగలం? సంగతి విని నువ్వు అప్‌సెట్టవుతావని మేం ఇదవుతూంటే నువ్వు నిమ్మకి నీరెత్తినట్టు మాట్లాడుతున్నావేంటి స్వప్నీ? "

"ఇటువంటి విషయాల్లో ఆచితూచి

## నెత్తిమీద ఏదో కదలిక!

'ఆహారపుటలవాట్లు వ్యక్తుల శీలాన్ని, నడవడికను తప్పకుండా ప్రభావితం చేస్తాయి కదా? ' అనే విషయంపై ఓ జర్నలిస్టు గాంధీజీని గుచ్చిగుచ్చి అనేక ప్రశ్నలు అడుగుతున్నాడు.



దానికి గాంధీజీ విసుగెత్తిపోయి 'ఔను, చాలా ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు నేనిప్పుడే ఓ గ్లాసెడు మేకపాలు తాగాను. దాంతో అప్పుడే నా తలపై చెరోవైపు ఒకలాంటి దురద, లోపల ఏదో కదలిక ప్రారంభమైంది. బహుశా మేకకు మాదిరిగా నాక్కూడా రెండు కొమ్ములు మొలుస్తున్నాయేమో? అందువల్ల వెంటనే ఇక్కడి నుంచి పారిపోయి నిన్ను నువ్వు కాపాడుకో!' అని అన్నారాయన తన సహజ హాస్య ధోరణిలో.

వ్యవహరించాలి. తొందరపాటు నిర్ణయాలు మంచివి కాదు..."

"ఏంచేస్తే బావుంటుందో బావతో మాట్లాడు. రేపు సికింద్రాబాద్ ఎక్స్‌ప్రెస్‌కి బయల్దేరి వస్తున్నాడు"

"బావ వస్తున్నారా? !" పై ప్రాణాలు పైకెగిరిపోతోంటే కీచుగా అరిచింది.

"రిజర్వేషన్ చేయించేశాడు. నువ్వు ఫ్రెండ్‌రూంలో వుంటున్నానన్నావుగా.. ఆ ఎడ్రస్సు చెప్పు. బాబాయిని తీసుకుని నీ దగ్గరికొస్తాడు. మీ ముగ్గురూ ఆలోచించి ఎలా బావుంటుందంటే అలా చేద్దురు"

పరిస్థితి చేయి దాటిపోయిందని అర్థమైపోయింది స్వప్నికి.

ఫేస్ చెయ్యక తప్పదు. ముఖాముఖీ తలపడక తప్పదు!

ఒక నిశ్చయానికొచ్చింది. గుండెల్నిండా ఊపిరి పీల్చుకుని వదిలింది.

"ఎవరూ రావద్దు. ఎల్లుండి నేనే అక్కడికొస్తున్నాను. అంతా చెబుతాను. అన్ని డౌట్లూ క్లియర్ చేస్తాను"

ఎలాంటి తొట్రుపాటు, ఉద్వేగం లేకుండా స్పష్టంగా, నింపాదిగా, స్థిర స్వరంతో చెప్పింది స్వప్నిక.




స్వప్ని కళ్లు మానిటర్‌లోకి చూస్తున్నాయి గాని ఏం చూస్తోందో ఆమెకే తెలీదు.

మర్నాడు ఎదుర్కోబోయే సంఘర్షణ రకరకాల రూపాలు పోసుకుని మెదడులో గజిబిజి విన్యాసాలు చేస్తోంది.

నిప్పుల కొలిమిలోకి, కత్తుల బోనులోకి, పులిగుహలోకి ప్రవేశించబోతున్నట్టుగా వుంది. ముందుకేసిన అడుగు వెనక్కి తీసుకోవడానికి లేదు. తీసుకోవాలనే ఉద్దేశమూ లేదు. ముందుకే మున్ముందుకే నడవాలి. కాని ఎవర్నీ నొప్పించకూడదు. కన్నవాళ్లు కన్నీరు పెట్టుకోకూడదు. అయినవాళ్లు అసహ్యించుకోకూడదు.

అలాగని ఇంట్లోవారు తనని సమర్థించరు. తన వాదన వినరు. విన్నా అంగీకరించరు.

అయినా నెగ్గుకురావాలి. విజేతయై నిలవాలి. అదెలా సాధ్యం? ఎలా?

మెదడు కుతకుత ఉడికిపోతోంది. గుండెలవిసిపోతున్నాయ్. పరిష్కారం మాత్రం కనుచూపు మేరలో కన్పించడం లేదు.

"అడవిలో తపస్సు చెయ్యాలి గాని ఆఫీసులో చేస్తే ఎలాగా!"

తుళ్లిపడి ఆలోచనా సమాధిలోంచి బయటపడింది స్వప్ని. ఎదురుగా మందహాసం చేస్తూ రుషి!

"సారీ సర్.. ఇప్పుడే.."

"అరగంట నుంచి మీ పక్కకుర్చీలో కూర్చుని నిరీక్షిస్తున్నాను. మీ దృష్టి నా మీద పడలేదు"

"సారీ.. వెరీ సారీ. చెప్పండి సార్"

"నిర్విఘ్నంగా మీ ప్రాజెక్టు పూర్తవడానికి నన్ను ఎసిస్ట్ చెయ్యమన్నారు"

"సీనియర్ అయిన మీరు నాకు ఎసిస్ట్ చెయ్యడం... జోక్ చేస్తున్నారా!"

"పోనీ సూపర్వైజర్‌ననుకో.. ఇంకోటనుకో. మొత్తానికి టైమ్ ఫ్రేమ్‌లో ప్రాజెక్టు డెలివరీ ఇవ్వాలి. ఇచ్చేట్లు నేను చూడాలి"

స్వప్ని కళ్లల్లో కన్నీటిపొర కదిలింది.

కంపెనీ టాప్‌బాస్‌కి తన శక్తి సామర్థ్యాల మీద నమ్మకం సడలిందన్నమాట!

"అతిగా ఆలోచించడం, ఏదేదో జరిగిపోయినట్లు ఊహించుకోవడం అనవసరం. వాస్తవాన్ని యథాతథంగా స్వీకరించడానికి గట్స్ కావాలి. అలాంటివారే సవ్యంగా విశ్లేషించుకోగలరు. గమ్యం చేరుకోగలరు"

"నాకేం అర్థం కావట్లేదు. మీరు ఆఫీసు వ్యవహారం గురించి మాట్లాడుతున్నారా లేక నా స్వంత వ్యవహారం గురించా? "

"దేనికైనా అదే వర్తిస్తుంది. సరే నేనూ మీ రూట్లో కొచ్చేస్తాను. మీ ప్రోబ్లం ఏమిటి? "

తటపటాయించింది స్వప్ని.

"కొన్నిసార్లు బయటికి చెప్పుకోవడం వల్ల అవి ఇంకా బాగా అర్థమవుతాయి. అవతలివారి సహకారం పరిష్కార సాధనకి ఉపయోగపడనూవచ్చు"

"నాది ప్రత్యేకమైన సమస్య..."

చిన్నగా నవ్వేడు. చిన్నపిల్లని చూసినట్టు చూశాడు.

"చాలామంది ఇలాగే ఆలోచిస్తారు. తాము వేరు తమ పరిస్థితులు సమస్యలు వేరువేరు అనుకుంటారు. ప్రపంచంలో తొలిసారిగా తమకే అది ఎదురైనట్టుగా భావిస్తారు"

"కాని నాది నిజంగానే విభిన్నమైంది. నలుగురు నడిచే తోవలో గాక కొత్తదారి తొక్కాను"

"అప్పుడు సహజంగానే ముళ్ళు గుచ్చుకుంటాయి. రాళ్ళు గీరుకుంటాయి... ఆదుకునే వాళ్ళుండకపోవచ్చు. ఒంటరిగా సాగాల్సి రావచ్చు. భయాలు చుట్టుముట్టొచ్చు. దిక్కుతోచకుండా వుండొచ్చు..."

"ఎగ్జాక్ట్‌లీ! అలాగే వుంది.."

"మీరు మీ లక్ష్యంవైపే నడుస్తున్నారని భావిస్తున్నారా? లక్ష్యానికి చేరుకోగలరన్న నమ్మకం వుందా? "

"కొండంత వుంది"

"మరెందుకీ బేలతనం? సమస్య ఎలా, ఎందుకొచ్చింది, ఎవరి వల్ల వచ్చిందీ తెలుసుకుంటే మంచు విడిపోతుందిగా? సత్యం సాక్షాత్కారమవుతుందిగా? "

ఎంతో తేలికగా చెప్పేసిన అతడి వంక ప్రశంసాపూర్వకంగా చూసింది.

"సమస్య నా వల్లే వచ్చింది. నిజానికి నాకే సమస్యా లేదు. ఇతరులకి మాత్రం సమస్యగా వుంది. వాళ్ళ నెదుర్కోవడమెలా అన్నదే సమస్య. ఎలా రిసీవ్ చేసుకుంటారోనని ఆందోళన. పరువూమర్యాదా అంటూ ఏడుస్తూ కూర్చుంటారేమోనని బాధ"

నవ్వేడు రుషి. "గుడిగుడి గుంజంలోలా మీరక్కడక్కడే తిరుగుతున్నారు. బయటికి రండి. రంగుల్లో గాక బ్లాక్ అండ్ వైట్‌లో చూడండి. ఒంటరిని, అసహాయురాల్నని పిస్తే ఇంకొకరి సాయమో సహకారమో తీసుకోండి, కంపెనీ నన్ను మీ అసిస్టెన్స్‌కి పంపినట్టు. ఏం చేసినా టార్గెట్ ఛేదించడం ముఖ్యం. ఇంకా కంపెనీ టైం వేస్ట్ చెయ్యలేను. బై"

"థాంక్యూ.. నా ఆలోచనల్ని ఒక గాడిలో పెట్టారు"

"మనం నిదానంగా నడుస్తున్నప్పుడు మన నీడ వంకరగా వుంటే, వుందంటే మనం కేర్ చెయ్యక్కర్లేదు. కాని ఒక్కసారి ఆగి మనం ఎలా నడుస్తున్నామో పునఃపరిశీలించుకోవాలి. అవసరమైతే దిద్దుకోడానికి వెనుకాడకూడదు!"

★ ★ ★

"నా తల్లి వచ్చేసింది"

మొహం చింకి చేటంత చేసుకుని ఎదురెళ్ళింది స్వప్ని తల్లి రేవతి.

స్వప్నిక వెంట దిగిన యువకుడ్ని చూసి ఆగిపోయింది. మొఖం తెల్లగా పాలిపోగా బెరుగ్గా చూస్తూ భర్తతో అంది "ఎవర్నో

వెంటేసుకొచ్చింది..."

సుబ్బారావు గుమ్మంలోకొచ్చి నమ్మలేనట్లు చూశారు. పరాంకుశం అనుమానించినంతా అయ్యిందన్నమాట! గుండెల్లో సన్నని నొప్పి మొదలైంది. ఒళ్ళంతా ముచ్చెమటలు పోయసాగాయి. నిస్త్రాణగా కూర్చుండిపోయారు.

"రండి.. మా మమ్మీ.. డాడీ"

వినయంగా నమస్కరించాడు అనురాగ్.

బొమ్మల్లా తలలూగించారు.

తన రూంలోకి తీసుకెళ్ళి దింపి వచ్చింది స్వప్ని.

**కొత్తగాలి...**

**గొంగళి పురుగును చూసి**
**ఈసడించుకోకు**
**అది సీతాకోకచిలుకలా**
**మారుతుందని తెలుసుకో!**

– భానుమూర్తి,
హైదరాబాద్

"అలా వున్నారేం డాడీ? "

"జీవచ్ఛవాలు ఇలాగే వుంటాయి!"

తొలిసారిగా తండ్రి నోట పరుషంగా వచ్చాయి మాటలు. గుండెల్లో గునపం గుచ్చుకున్నట్లు విలవిల్లాడింది.

"స్థిమితంగా ఆలోచించండి డాడీ. మీరు కోరుకుంటున్నది నా క్షేమ సౌఖ్యాలే కదా! అవి నాకు పుష్కలంగా లభించాయి" నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది.

"అన్నిసార్లు ఫోన్లు చేశాం. పెళ్లి చేయాలని ఎంతో తాపత్రయ పడుతున్నాం. పని గట్టుకుని హైద్రాబాద్ కూడా వచ్చాం. అయినా పిసరంత మాట మాకు చెప్పాలనిపించలేదా స్వప్ని? అవున్లే. నువ్విప్పుడు ఈ గుండెలమీద ఆడుకుంటున్న పిల్లవి కాదు. గుండెల్ని తన్నేసేంత పెద్దదానివి. సరే. మేం ఏమైతే నీకేం? మా పరువు ఏ గంగలో కలిస్తే నీకేం? " బాధతో అన్నారు.

"ఇదెప్పుడో కొంప ముంచుతుందండీ అని నెత్తీ నోరూ కొట్టుకున్నాను. విన్పించుకున్నారా? చూడండి.. ఇప్పుడేమైందో! కాళ్ళు కడిగి కన్యాదానం చేయాల్సిన పనిలేకుండా ఏకంగా మొగుడ్ని వెంటబెట్టుకొచ్చేసింది. మనం తొందరపడకపోయివుంటే ఏకంగా మనవడ్నో మనవరాల్నో ఎత్తుకునొచ్చేది!" పమిటతో కళ్ళొత్తుకుంటూనే ఏడవసాగింది రేవతి.

తలవంచుకుని శిలలా కూర్చుండిపోయింది స్వప్ని.

"చదువుల సరస్వతి, అందాల లక్ష్మి, సామర్థ్యాల పార్వతి అని మురిసిపోయాను. కడకి శత్రువు కూడా చెయ్యని పనిచేసింది. మనల్ని జీవితాంతం కుళ్ళి కుళ్ళి చావమని, అవమానభారంతో మగ్గిపొమ్మని శపించింది" జీరగా అన్నారు సుబ్బారావు.

"పుట్టగానే హరీమనివున్నా ఒక ఏడ్పు ఏడ్చి వూరుకునేదాన్ని. పెరిగి పెద్దదై ఉద్ధరిస్తుందనుకుంటే కడుపులో ఆరని చిచ్చు రగిలించింది. మీరు చెప్పిన బుద్ధులూ అది చదువుకున్న చదువులూ ఏ ఏట్లో కలిశాయో!" వెక్కిళ్ళు పడింది తల్లి.

"ఆడపిల్లని అదుపాజ్ఞల్లో ఉంచకపోతే విలయతాండవం చేస్తుందనే వాడు పరాంకుశం. అది అక్షరాలా నిజమని రుజువు చేసింది. నా కూతురు ఎంతో గొప్పది అవుతుందనుకున్నాను. కాని మనం ఊహించనంత గొప్పదవుతుందని ఇప్పుడే తెలిసింది!"

"విద్య, విజ్ఞానం మనిషికి ఏది మంచో ఏది చెడో చెబుతుందంటారు. హంసలా

పాలు- నీరు వేరుచేసే శక్తినిస్తుందంటారు. దీనికేవిటో ఇలాటి బుద్ధి పుట్టింది. తెలిసి తెలిసీ నిప్పులగుండం తొక్కుతోంది! మన మింకా బతికున్నామన్న ధ్యాసైనా లేకుండా బరితెగించి..” ఆ పైన మాటలు రాక బావురుమంది రేవతి.

“ఎన్ననుకుని ఏం లాభంలే! అడ్డాలనాడే బిడ్డలు, రెక్కలొచ్చేక గడ్డలు. పిల్లల్ని కన గలం గాని వాళ్ల రాతల్ని కనలేం కదా? ఇప్పుడు ఎన్నకునేం లాభంలే.. దీనికి మనమంటే గౌరవ మర్యాదలు లేకపో యినా అతిథి అంటే మనకి గౌరవముంది. అతగాడి స్నానానికి వేణ్ణీళ్ళు పెట్టి టిఫిన్ తయారు చెయ్యి”

“శోషొచ్చేలా కంఠశోష పెడుతున్నా బెల్లం కొట్టిన రాయిలా ఉలుకూ పలుకూ లేకుండా కూర్చున్నావేమే? చేయాకూడ నిదంతా చేసేసి నంగనాచిలా కూర్చుంది చూడండి!” నిష్ఠూరమాడింది రేవతి.

“నీ నోరు పడిపోయిందా స్వప్నీ? ”

తండ్రి మాటలకి బాధతో కమిలిన మొఖంతో, తడిసిన కళ్లతో చూసింది.

వారి గుండెలు విలవిల్లాడాయి. ‘అయ్యో ఎంత కష్టమొచ్చింది మా బిడ్డకీ!’ అను కుంటూ చూశారు.

“అసలేం జరిగింది, ఎందుకలాటి నిర్ణయం తీసుకున్నావు, ఏ విషమ పరిస్థి తులు నిన్నందుకు పురిగొల్పాయి- అని మీరడగలేదు. నన్ను దోషిగా నిలబెట్టి చిత్రవధ శిక్ష వేసి అమలు చేసేస్తున్నారు. కానివ్వండి. సంతోషంగా స్వీకరిస్తాను”

తల్లి పేగు ఆక్రోశించింది. తండ్రి గుండె లబలబలాడింది.

“ఏవిటో బుర్ర పనిచేయలేదు. ఆవే శంలో కొట్టుకుపోయాం. నా స్వప్ని తప్పు చేయదని తెలుసు. అసలేం జరిగిందమ్మా” ఆప్యాయత కురిసిందా మాటల్లో.

ఆర్తిగా చూసింది తల్లి.

“మీరిప్పుడు సావధానంగా వినగల

## ఆరోగ్యవంత నగరాలు




ప్రపంచంలోనే అనేక రంగాల్లో అగ్రగామి దేశంగా అమెరికా విరాజిల్లుతోంది. ఆ దేశంలోని ఒకసంస్థ నగరీకర ణలోని సాధకబాధకాలపై దేశవ్యాప్తంగా ఒక ఆసక్తికరమైన సర్వే నిర్వహించింది.

‘అమెరికన్ కాలేజ్ ఆఫ్ స్పోర్ట్స్ మెడిసిన్’ ఇటీవల అక్కడి పౌరులకి చక్కటి ఆరోగ్యాన్ని అందించే నగరాల గురించి శోధన మొదలుపె ట్టింది. దీనికోసం పటిష్టమైన ప్రశ్నావళి



రూపొందించి, దాని ప్రకారం సర్వేలు నిర్వహించింది. అనేక నగరాల్లో పౌరుల ఆరోగ్యం, పర్యావరణ పరిరక్షణ, పారిశుద్ధ్యం, ప్రజల ఆహారపుటలవాట్లు, క్రీడలు, వ్యాయా మం మొదలైనవాటిని ప్రాతిపదికగా తీసుకుని అధ్యయనం చేసింది ఆ సంస్థ. చివరికి పాతిక నగరాలను దేశంలో ఆరోగ్యవంతమైనవిగా ఎంపిక చేసింది. అవి..

1. మినియా పొలిస్ 2. వాష్టింగన్ డిసి 3. బోస్టన్ 4. పోర్ట్‌లాండ్, 5. డెన్వర్ 6. శాన్‌ఫ్రాన్సిస్కో 7. హార్డ్‌ఫోర్డ్ 8. సియాటెల్ 9. వర్జీనియా బీచ్ 10. శాక్రిమెంటో 11. సేనోజా 12. రిచ్‌మండ్ 13. శాన్‌డియాగో 14. సిన్సినాటీ 15. సాల్ట్‌లేక్ సిటీ 16. ఆస్టి న్-రేండ్‌రాక్ 17. పిట్స్‌బర్గ్ 18. అట్లాంటా 19. ప్రావిడెన్స్ 20. బాల్టిమోర్ 21. మిల్వాకీ 22. కేన్సాస్ సిటీ 23. బఫెలో 24. రేలి 25. క్లీవ్‌లాండ్.

పైక్రమంలో అవి కిందనుంచి ఒక దానికన్నా మరొకటి అత్యుత్తమ నగరం అని ఆ సర్వే అధికారులు వెల్లడించారు.

# చతుర ప్రవేశిక

## అక్టోబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. సుబ్బారావుకు కూతుళ్లెందరు?
జ.
2. స్వప్నికను పెళ్లాడింది?
జ.
3. హెచ్ఐవి పాజిటివ్‌గా తేలిందెవరికి?
జ.
4. పరాంకుశం భార్య ఎవరు?
జ.
5. గాయత్రి భర్త పేరు?
జ.
6. రుషి భార్యకొచ్చిన జబ్బు పేరు?
జ.
7. అనురాగ్ వదిన?
జ.
8. సిటీ ఆఫ్ సైకిల్స్‌గా దేనికి పేరు?
జ.
9. విడాకులకు కారణమైన వాసన?
జ.
10. అకార, ఉకార, మకారాలు కలిస్తే?
జ.

పంపినవారి పేరు: ----------------
------------------వయసు (   )
చిరునామా: ------------------
------------------------------
------------------------------
పిన్‌కోడ్:            ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

స్థితిలో లేరు. నేను చెప్పినా అర్థం చేసుకో గల పరిస్థితిలో లేరు. తర్వాత చెబుతాన్లే డాడీ. అప్పుడు నాకు ఉరిశిక్ష వేసినా సరే నేను సిద్ధం"

లేచి గదిలోకెళ్ళిపోయింది స్వప్నిక. ముఖాముఖాలు చూసుకున్నారు సుబ్బారావు దంపతులు.

లోపలికొచ్చిన స్వప్ని వంక వేదనగా చూశాడు అనురాగ్. కానామె విజయ హాసం చేసింది.

"సక్సెస్! థాంక్స్ టు రుషి"

"మధ్యలో ఆయనేం చేశారు? "

"సపోర్టుకి ఎవరి సాయమైనా తీసుకోమని సలహా ఇచ్చారు. నిన్ను తీసుకొచ్చాను. నేనేమీ చెప్పనక్కర్లేకుండానే వాళ్ళు గ్రహించేశారు. కడుపులోని బాధంతా కక్కేశారు. ఇంకోగంటకి క్షమించేస్తారు. నువ్వు రాకపోయివుంటే విషయం చెప్పడానికి నాకు చచ్చే చావొచ్చేది!"

"వాళ్ళు ఊహించుకుంటున్నది కరెక్టు కాదని చెబుతావా? "

"అంత అవసరమేముంది? వాళ్ళ మన శ్శాంతిని కొల్లగొట్టి బాధించడమెందుకు? వాళ్ళేదో అనుకున్నందువల్ల మనకి వచ్చే నష్టం లేదుకదా! వాళ్ళనుంచి, బంధువుల నుంచి మనకెలాంటి అడ్డంకులూ రావు. ఇక మా బావ ఒక్కడూ వున్నాడు. ఆయనో పరమ మూర్ఖుడు. ఆయన నోరు మూయించగలిగితే చాలు, ఇక మనం ఆడింది ఆట, పాడింది పాట"

"మీ పేరెంట్స్ మాటలు విన్నాను. పాపం వాళ్ళు చాలా బాధపడుతున్నారు. వాళ్ళ తపన ఆరాటం నీ క్షేమం గురించే. నువ్వు సుఖంగా వుండాలనే. నీ జీవితం ఒడిదుడుకుల్లేకుండా సాగాలనే. నువ్వు పిల్లా పాపల్తో ఆనందంగా జీవించాలనే కదా? "

అతడి ధోరణికి విస్తుబోయింది.

"అయితే? "

"వాళ్ళని మోసం చేస్తున్నామేమో అన్పిస్తోంది. మనం తప్పు చేస్తున్నామన్పిస్తోంది స్వప్నీ" ఆర్తితో అన్నాడతను.

విడ్డూరంగా చూసింది. చాదస్తుడిగా చూసింది. "ఈ పిచ్చి ఎక్కడ్నుంచొచ్చింది? మనం కొత్త పద్ధతిని ఆవిష్కరిస్తున్నాం. ఇది పెళ్లికన్నా చాలా గొప్పది, కోరదగింది అంటూ నా బ్లాగులో రాశాను. అది నిజమేనని మనం రుజువు చెయ్యాలి"

"ఏదో రాసుండొచ్చు. దాన్నే అనుసరించాలని లేదుకదా. పరిస్థితిని బట్టి అభిప్రాయాలని మార్చుకుంటే అది వెనుకంజ వెయ్యటం కాదు"

"ముమ్మాటికీ వెనకడుగే. పిరికితనమే. ఓటమే" తీవ్ర స్వరంతో అంది.

"ఎన్నో అబద్ధాలు చెప్పి, ఎందర్నో మభ్యపెట్టి మనమేం సాధించబోతున్నామో అర్థం కావట్లేదు"

"పెళ్లే పరమావధి కాదు. ఆడమగ కలిసి జీవించడానికి పెళ్లికన్నా ఉత్తమ మార్గముంది. ఎలాంటి లోపాలు, ఒత్తిళ్ళు, ఆంక్షలు, అజమాయిషీలు లేని సరికొత్త జీవన విధానాన్ని- సహజీవనాన్ని సమాజానికి అందివ్వ బోతున్నాం. దిక్సూచులం కాబోతున్నాం" ఆనందోద్వేగంతో వూగిపోతూ అంది.

"ఆ సిస్టం ఆల్రెడీ కొన్ని దేశాల్లో వుంది. ముంబయి లాంటి మెట్రోపాలిటన్ నగరాల్లో వుంది. సెలబ్రిటీస్ ఎక్కువగా అలా వుంటున్నారు. వాళ్ళ జీవనదృక్పథం వేరు. నైతిక విలువలకి వాళ్ళు చెప్పుకునే అర్థం వేరు. వాళ్ళని చూసి మనం వాతలు పెట్టుకోకూడదు. మనం మధ్యతరగతి వాళ్ళం స్వప్నీ"

అమితాశ్చర్యంగా చూసింది.

"నువ్వు నువ్వేనా? హఠాత్తుగా నీకేవయ్యింది అనురాగ్?"

"మీ వాళ్ల ఆక్రోశం చూశాక ఏదో తెలీని పశ్చాత్తాపం కలుగుతోంది"

"పిచ్చి సెంటిమెంట్లొద్దు. వ్యక్తి స్వేచ్ఛ కన్నా ఏవీ ఎక్కువ కాదు. మనం వున్నంత స్వేచ్ఛగా హ్యాపీగా పెళ్లైనవారెవరూ వుండటం లేదు. పిచ్చి పిచ్చి ఆలోచనలు రానివ్వకు. వస్తే వెంటనే గిల్లిపారెయ్. సహజీవనం సూత్రానికి నేనెప్పటికీ కట్టుబడి వుంటాను. నువ్వూ వుండాలి. దట్సాల్"

సాలోచనగా చూస్తూ తలపంకించాడు అనురాగ్. అతడికి తన తల్లిదండ్రులు గుర్తొస్తున్నారు.




సుబ్బారావు దంపతులు అడిగిన రకరకాల ప్రశ్నలకి వినయంగా జవాబిచ్చాడు అనురాగ్. ముఖ్యంగా అతడి గురించి, అతడి కుటుంబం గురించి ఎన్నో వివరాలడిగారు. అతడు భోంచేసి వెళ్ళేక స్వప్ని, ఆమె తల్లిదండ్రులూ భోజనాలకి కూర్చున్నారు.

"అబ్బాయి బుద్ధిమంతుడే" జనాంతికంగా అన్నారు సుబ్బారావు.

"మేలిమి బంగారంలానే వున్నాడు. అదే నిజమైతే అమ్మాయి అదృష్టవంతురాలే. మనం మాత్రం ఇంతకంటే గొప్ప సంబంధం తేగల్గుదుమేంటీ!" అంది తల్లి రేవతి.

"స్వప్నీ! అబ్బాయిది మన కులమే

కదా? "

పోల మారిందామెకి. తలమీద ఇన్ని నీళ్లు కొట్టి "చిరంజీవ చిరంజీవ! ఎవరో తలచుకుంటున్నారు" అంది తల్లి.

"మంత్రదండంతో మాయ చేసినట్టుగా ఇదంతా ఎలా జరిగిందే? " అనునయంగా అడిగిందామె.

ఆ మాటల్లోని ఆప్యాయతకి స్వప్ని కళ్లు చెమర్చాయి.

"నిన్ను బాధ పెట్టాలని కాదు స్వప్నీ, జరిగిందేదో తెలుసుకోవాలనీ.. నలుగురికీ సమాధానం చెప్పుకోవాలిగా. మనం వుంటోన్నది సభ్య సమాజంలోగాని అరణ్యంలో కాదు కదా!" తనెందుకు ఆరా తీస్తున్నదీ వివరిస్తూ అన్నారు సుబ్బారావు.

"చెప్పేను కదా డాడ్... అనురాగ్ మా కంపెనీలోనే చేస్తున్నాడు. నేనంటే ఇష్టపడ్డాడు. మ్యారేజ్ ప్రపోజల్ తెచ్చాడు. అంతా మా అమ్మానాన్నల ఇష్టం అన్నాను. వాళ్ళు గీచిన గీటు దాటనన్నాను. తన తండ్రిని తీసుకుని ఇక్కడికొచ్చి మీతో మాట్లాడతానన్నాడు. ఈలోగా ఓ ఘోరం జరిగిపోయింది"

"ఏం జరిగింది? " ఇద్దరూ ఒక్కసారే అడిగారు.

"అనురాగ్ వాళ్ళ తాతయ్యకి క్యాన్సర్ హైదరాబాద్ తీసుకొచ్చారు. ఎక్కువ రోజులు బతకరని డాక్టర్లు తేల్చి చెప్పేసరికి మనవడి పెళ్లి చూడాలని పట్టుబట్టారు. ఆ సంగతి నాకు చెప్పి నా అంగీకారం కోరాడు. పెద్దాయన ఆఖరి కోరిక తీర్చడం కన్నా ఏం కావాలని ఒప్పుకున్నాను. ఆయనెదుట దండలు మార్చుకున్నాం. ఇది నిజమోం నాటకమోం తెలీదు గనుక రిజిస్టర్డ్ మ్యారేజ్ చేసుకురండన్నాడాయన. తప్పనిసరి పరిస్థితిల్లో చేసుకుని ఆ సర్టిఫికెట్ ఆయనకి చూపించాం"

"ఇంత తతంగం జరిగినా మాకు మాట మాత్రమైనా ఎందుకు చెప్పలేదు? " పాయింటు లాగారు సుబ్బారావు.

"సెలవు పెట్టి వద్దామనుకునేంతలో అనురాగ్ తాతయ్య కాలం చేశారు. కర్మ కాండలు పూర్తయ్యాక శుభవార్త చెబుదాంలే అని ఆగాను. ఇంతలో నా ఆరోగ్యం వికటించింది"

"ఏమయ్యిందే? " ఆందోళన పడింది తల్లి మనస్సు.

"ఇరవై నాలుగ్గంటల నొప్పి వచ్చింది. రూమ్మేట్ ఊరెళ్ళింది. అనురాగ్‌కి ఫోన్ చేశాను. హాస్పిటల్లో చేర్చి ఆపరేషన్ చేయించాడు. మధ్యలో ఇంకేవో కాంప్లికేషన్లొచ్చాయి. అనురాగ్ కంటికి రెప్పలా చూసుకోవడం వల్లగానీ లేకపోతే బతికేదాన్నే కాదు" అప్రయత్నంగా ఆమె కళ్ళల్లోంచి కన్నీళ్లు ఒలికాయి.

"అవేం మాటలే.. మేం చేసిన పూజలు వృథా పోతాయేంటి? దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు" కూతురి తల నిమిరింది.

కథ వింటున్నట్లు వింటూ అన్నారు సుబ్బారావు "ఇంత జరిగిందా! అయినా నీకు మేం గుర్తురాలేదు. ఎప్పుడూ చేతిలో వుండే సెల్‌ఫోన్ని ఇలా నొక్కి అలా ఒక్క ముక్క చెప్పడానిక్కూడా నీకు నోర్రాలేదా? "

తడబడింది స్వప్ని. "స్పెషల్ కేర్ కావాలన్నారని నన్ను తన రూమ్‌కి తీసుకుపోయాడు అనురాగ్"

"హాస్టల్నుంచి మారానని చెప్పేవు గాని, ఈ కథేదీ చెప్పలేదు"

"చెప్పడానికి ముఖం చెల్లలేదు డాడీ. మీకు తెలీకుండా ఇంత చేసినందుకు నాలో నేనే కుళ్ళిపోయానంటే నమ్మండి. పైగా ప్రాజెక్టు బిజీ ఒకటి. రాత్రీ పగలూ ఆఫీసు పనే అయ్యింది. 'తీరిక చేసుకుని ఇద్దరం వెళ్ళి అంతా వివరిద్దాం, కన్నవాళ్ళు

అర్థం చేసుకుంటారు. పెద్ద మనస్సుతో ఆశీర్వదిస్తారు' అన్నాడు అనురాగ్. అన్నీ తెములుచ్చుకుని ఇప్పటికి రాగలిగేం!" నిట్టూర్చింది.

"పరాంకుశం అక్కడికొచ్చి సంగతేంటో తేల్చేస్తానన్నాక కదా మీరు బయల్దేరింది!" పూర్తిగా నమ్మకం చిక్కక అనుమానంగా చూస్తూ అడిగారు తండ్రి.

"అహహ... మేం ముందే ప్లాన్ చేసుకున్నాం. సరిగ్గా బావ వస్తానన్నప్పటికి మేం రావడం కాకతాళీయమే"

"సరే, అయిందేదో అయ్యింది. దాని పెళ్లి చూసే యోగం మనకి లేదు. ఇంతే ప్రాప్తమని సరిపెట్టుకుందాం. సాయంత్రం యంబరమన్నారుస్వామి కోవెలకి తీసుకెళ్ళి ఇద్దరి పేరునా అభిషేకం చేయిద్దాం. దోషాలేమైనా వుంటే కొట్టుకుపోతాయి"

భార్య మాటలకి "ఇంకేదారి మిగిలుందిలే!" అన్నారు వేదనగా సుబ్బారావు.

"మా డాడీ గ్రేట్. డాడీకి అక్కకన్నా నేనంటేనే ఎక్కువిష్టం" ఉబ్బేసింది స్వప్న.

బయట డొక్కు మోటారుసైకిలు ఆగిన శబ్దం విన్పించింది. స్వప్నిక గుండెలు గుబగుబలాడాయి.

పరాంకుశం లోపలికొచ్చాడు.

"వచ్చేవన్నమాట" అదోలా నవ్వుతూ అన్నాడు పరాంకుశం.

'రాక ఎక్కడికి పోతావులే' అన్న భావం కన్పించిందా నవ్వులో.

సన్నగా ముచ్చెమటలు పోయసాగాయామెకి.

"ఒంటరిగా రాలేదు. అల్లుడుగార్ని వెంటబెట్టుకుని మరీ వచ్చింది. అనుకోని పరిణామాల వల్ల హడావిడిగా పెళ్లి చేసుకోవాల్సి వచ్చిందట. అంతా చెప్పిందిలే. అదంతా తిరిగి తవ్వుకోవడం ఎందుకులే గాని జరగాల్సింది చూద్దాం"

సుబ్బారావు మాటలు పట్టించుకోకుండా స్వప్నికని ఆసాంతం డేగ కళ్ళతో పరిశీలించాడు. ఆమె కంగారు చూసి పెదాలు విడీ విడకుండా నవ్వాడు.

"రంకు నేర్చినమ్మ బొంక నేర్వదా అని అది కట్టు కథలు చెప్పడం, మీరు నమ్మేసి క్షమించెయ్యడం అన్నీ అయ్యాయన్నమాట"

"కట్టుకథేం కాదు" రోషపడింది.

"అహ. అలాగా.. నాకు తెలీదు కదా మరదలు పిల్లా. పెళ్ళెప్పుడు చేసుకున్నారూ? "

"రెండు మూడు.. నాలుగు నెలలయ్యింది" జేవురించిన మొఖంతో చెప్పింది.

"విన్నావా మావయ్యా. చేతిలో సెల్లుంది. ఇంట్లో కంప్యూటరుంది. దానికి

> ## కొత్తగాలి...
>
> **నిఘా నీడలో..**
> **తుపాకీ తూటాలో..**
> **స్వతంత్రం!**
>
> – ఆరుద్ర శ్రీవిద్య,
> ముల్కలపల్లి, వరంగల్ జిల్లా

నెట్ కనెక్షనుంది. మన చెవినెయ్యడానికి వీలు కుదర్లేదు. మా చెవుల్లో కాలీఫ్లవర్లు కన్పిస్తున్నాయా? "

"నమ్మితే నమ్మండి, లేకపోతే లేదు. ఉన్నమాట చెప్పేను కదా డాడీ"

"డాడీ కాదు నాన్నకూచీ.. నా వంక చూసి చెప్పు. ఇన్నాళ్ళూ లేనిది ఇప్పుడొచ్చి చెబుతున్నావంటే నీళ్ళోసుకున్నావా? "

తల అడ్డంగా వూపింది తత్తరపడుతూ.

"వేవిళ్ళ బాధ తట్టుకోలేక వచ్చావేమో అనుకున్నాన్లే. పెళ్లెక్కడ చేసుకున్నారూ.. ఆర్యసమాజ్ లోనా? "

"రిజిస్ట్రార్ ఆఫీసులోనట. సర్టిఫికెట్

వుందిట" సుబ్బారావు అందుకున్నారు.

"కాపీ తెచ్చేవా? ఏంలేదు, ఫోటో కట్టించి గోడకి తగిలిద్దావనీ...!"

"మాకసలు ఆ రిజిస్ట్రేషన్లూ, సర్టిఫికెట్లూ ఏవీ అక్కర్లేదు. మాకు ఒకరిమీద ఒకరికి భూదేవంత నమ్మకం, ఆకాశమంత భరోసా వున్నాయి. మేమెవరికీ సంజాయిషీ ఇచ్చుకోవాల్సిన అవసరం లేదు"

"అబ్బో! మనం అనుకున్న దానికన్న చాలా పెద్దదైపోయింది మావయ్యా మన స్వప్నిక. మెడలో తాళి, నల్లపూసలు, కాలికి మట్టెలు ఏమీ అక్కర్లేదుట. చాలా అడ్వాన్సయిపోయారు"

"అవును, అక్కర్లేదు ఇప్పుడేంటంట? " లేచి నిలబడి గద్దించింది స్వప్ని.

"బావతో మాట్లాడుతున్నావే" తల్లి వారించింది.

"ఎవరైనా కావొచ్చు. నన్ను తప్పుబడితే సహించను" రోషంగా అంది.

"నాకంతా అర్థమయ్యింది మావయ్యా. మనం ఒకందుకు పోస్తే తనింకోందుకు తాగింది. మనం ఒకటనుకుని స్వేచ్ఛ ఇస్తే తనింకో రకంగా ఉపయోగించుకుంది. నా భయాలన్నీ నిజమయ్యాయి. అందులో సందేహమేమీ లేదు!"

"ఏంటి మీ భయం? బరితెగించి తిరుగుతున్నాననా? " స్వప్ని సూటిగా ప్రశ్నించేసరికి కలవరపడ్డారంతా.

మందలించారు గాని ఆమె వినేస్థితిలో లేదు.

"నా ఇష్టం.. నా ఇష్టమొచ్చినట్లు బతుకుతాను. ఇష్టమైనవాళ్ళతో కలిసుంటాను. ఏం చేస్తారు? మెడకోసి మొలేస్తారా? !" పరాంకుశాన్ని సవాలు చేసింది.

"మా చేయిదాటిపోయాక ఇంక మేం చేయగలిగేది ఎంత వుంటుంది గానీ.. కూర్చో కూర్చో. ఆవేశం కాదు ఆలోచన కావాలి. లోకజ్ఞానం కావాలి"

బావగారి మాటలకు సంబాళించుకుని కూర్చుంది.

"చూడు స్వప్నికా.. నీకు అందముంది, వయస్సు వుంది. శక్తి వుంది. సాహస గుణం వుంది. కాని ఇవన్నీ రేపటికి వుండవు. అప్పుడు కూడా అతడు నిన్ను అంటిపెట్టుకునే వుండాలి. నీ సుఖసంతోషాల కోసం పాటుపడాలి. నిన్నెవరైనా అవమానిస్తే వాళ్ళకి బుద్ధి చెప్పాలి. నీ పిల్లలకి విద్యాబుద్ధులు నేర్పి పెద్ద చెయ్యాలి. నీ కోసం, నీ పిల్లల కోసమే బతకాలి. నిన్నెవరైనా ఎత్తుకుపోతే అతగాడితో యుద్ధం చేసి మరీ నిన్ను రక్షించాలి. అలా చెయ్యగలడా నువ్వు పెళ్లి చేసుకున్నానంటున్నవాడు? "

పెదవి కొరుక్కుంది. ఆలోచనలో పడింది. ఆ కోణం నుంచి ఆలోచించలేదు. నిజానికి తామూహించుకున్న సహజీవనంలో వాటికి స్థానమే లేదు!

"ఆ రామాయణం ఎందుకులే పరాంకుశం. మన భారతం చూడు!" అసహనంగా అన్నారు సుబ్బారావు.

"మనక్కావల్సింది రామాయణమే బావా. సీత ఎవరు? ఒక మహారాజు గారాల పుత్రిక. ఇంకో మహారాజు కోడలు. అలాటి ఆమె భర్త అరణ్యవాసం వెళ్ళాల్సొస్తే ఏం చేసింది? పుట్టింటికి పోయిందా? అత్తింట్లో ఆగిందా? వూహు.. భర్త తోడిదే తన సుఖం అనుకుంది. భర్త వున్నచోటే తన ఇల్లు అనుకుంది. ఇహ తనని నమ్మి వెన్నంటి వచ్చిన సీతకోసం రాముడేం చేశాడు? ఆమెకెలాంటి కష్టం కలక్కుండా చూశాడు. ఆమె బంగారులేడిని కోరింది. రాముడు మూర్ఖుడు కాదు. అన్నీ తెలిసినవాడు. అయినా భార్య కోరిక నెరవేర్చాలనుకున్నాడు. రిస్కు తీసుకున్నాడు" పరాంకుశం మాటలకి రామకథని నెమరు వేసు

కోసాగింది స్వప్న.

కొత్త అర్థాలు స్ఫురించసాగాయి.

"సీతని రావణుడు మోహించి అపహరించాడు. అతడూ రాజే. పరాక్రమవంతుడే. మహాభక్తుడే. అయినా ఆమె అతడ్ని వరించలేదు. అసహ్యించుకుంది. 'నా భర్త వస్తాడు. నిన్ను చంపి సగౌరవంగా నన్ను తీసుకెళ్తాడు' అని చెప్పింది.

మనస్ఫూర్తిగా విశ్వసించి నిరీక్షించింది. ఆమె నమ్మకాన్ని వమ్ము చేయలేదు రాముడు. అదీ అలా వుండాలి భార్యాభర్తల బంధం. అందుకే సీతారాముళ్ళు ఆదర్శమూర్తులయ్యారు. ఏ కాలానికైనా సరే వాళ్ళే ఆదర్శం. స్ఫూర్తి!"

"అంత గొప్ప రాముడేంజేశాడు? సీతని అనుమానించి అగ్నిలోకి దూకమన్నాడు!" వ్యంగ్యంగా అంది.

"పాయింటే. వనవాసం పూర్తయ్యింది. జనావాసానికి వెళ్ళబోతున్నాడు. రాజుగా పట్టాభిషిక్తుడు కాబోతున్నాడు. అంచేత సీత పవిత్రతని సమాజానికి ముఖ్యంగా తన ప్రజలకి చాటి చెప్పడం అవసరం. ఆమె నీతి తప్పనిదనీ, భార్యగా మహారాణిగా అర్హురాలనీ మెస్సేజ్ ఇవ్వాల్సివుంది. అందుకే అలా చేశాడు!"

"అయినా తర్వాతెప్పుడో ఎవడో వంకర కూతలు కూశాడుగా!"

"సమాజంలో అన్నిరకాలవాళ్ళూ వుంటారు. అందుకే మన జాగ్రత్తలో మనం వుండాలి. స్త్రీ పురుషుల ప్రవర్తనే సత్సమాజానికి గీటురాయి. మనసా వాచా కర్మణా స్త్రీ పురుషుల్ని బంధించేదే పెళ్లి"

"కరెక్ట్. ఒక ఆడనీ ఒక మగనీ విడిపోకుండా తాళ్లతో బంధించి వుంచేదే పెళ్లి. అంతేకదా బావగారూ?"

పరాంకుశం తప్ప ఆమె వ్యంగ్యానికి, అప్పుడు నవ్విన నవ్వుకీ అదిరిపడ్డారంతా.

"పెళ్లి గురించి నీకు చాలా తెలుసే. అసలు వివాహ వ్యవస్థ ఎలా పుట్టిందో

## అమెరికాకు రారెందుకు?

ఒకసారి ఓ అమెరికన్ వనిత గాంధీజీతో 'మీరు ఏవేవో దేశాలు తిరుగుతున్నారుగానీ మా అమెరికాకు మాత్రం ఒక్కసారి కూడా రావడం లేదు. అక్కడున్న ప్రజలంతా మీ రాకకోసం ఎంతో ఆత్రుతగా చూస్తున్నారు. అందువల్ల మీరెప్పుడు వస్తారో చెప్పండి?' అని ప్రశ్నించింది.



'సమీప భవిష్యత్తులో రాలేను. అక్కడి ప్రజలు నా రాకకోసం నిరీక్షిస్తున్నారా? బహుశా నేను మీ దేశం వస్తే అస్థిపంజరంలా అర్ధనగ్నంగా ఉన్న నన్ను తమ జంతు ప్రదర్శనశాలలో పెట్టి, చూసుకుని వినోదిస్తారేమో?' అన్నారు గాంధీజీ, తనమీద తనే జోక్ వేసుకుంటూ.

ఆ మాటలు విన్నాక జూలో కటకటాల వెనక గాంధీజీని నిర్బంధించిన దృశ్యం ఆమెకు హఠాత్తుగా ఊహలోకి రావడంతో ఆయన వంక చూస్తూ విపరీతంగా నవ్వింది.

నీకు తెలుసా స్వప్నీ?"

తల అడ్డంగా వూపింది. తెలియాల్సిన అవసరం లేదు అనబోయి మింగేసింది.

"శ్వేతకేతువు అనే సంస్కర్త వివాహ వ్యవస్థకి రూపకల్పన చేశాడు. ఆనాటి కాలంలో మగాడు ఆడదాన్ని ఎలావోలా ప్రలోభ పెట్టి తన కోరిక తీర్చుకునేవాడు. బలమైన వ్యవస్థ, కట్టుబాట్లు లేవు. శ్వేత

కేతువు తండ్రి ఉద్దాలకుడనే ముని. అత డింటికి వచ్చిన ఓ అతిథి మునిభార్యతో పొందు కోరాడు. సాధ్వియైన తన తల్లిని పరాయివాడు కామించడం శ్వేతకేతువుకి దుర్భరంగా తోచింది. తపశ్శాలియైన అతడు ఉగ్రుడయ్యాడు. వివాహితను ఇత రులు కోరడానికి వీల్లేదని కట్టడి ఏర్పాటు చేశాడు. సామాజికమైన, నైతికమైన కట్టు బాట్లు విధించి వివాహ వ్యవస్థకి ప్రాణ ప్రతిష్ఠ చేశాడు"

"అంటే ఒక మగాడు మగజాతి కోసం ఏర్పాటు చేసిన ఇనుపచట్రం పెళ్లి. స్త్రీని బంధించి వుంచడానికి, ఆమె స్వేచ్ఛని హరించి అణగదొక్కడానికి, తన అదుపా జ్ఞలో ఉంచుకోవడానికి, తనకి వండి వార్చ డానికి, తనకి సర్వసుఖాలందించడానికి, సేవకురాలిగా పడివుండటానికి, తనకే పిల్లల్ని కనడానికి మగాళ్ళు పన్నిన భయం కర కుట్ర పెళ్లి. స్త్రీ రెక్కల్ని కత్తిరించి, మెదడుని ట్రిమ్ చేసి, నైతిక కట్టడి పేరిట బ్రెయిన్ వాష్‌చేసి ఆమెనో అసహాయురా లిగా, బానిసగా చేసిన దుర్వ్యవస్థ పెళ్లి. ఆడామగా కలిసుండడానికి ఎవరి వ్యక్తి త్వాన్ని వారు ఎవరి అస్తిత్వాన్ని వారు కాపాడుకుంటూ సహజీవనం సాగించడా నికి మీరొప్పుకోరు. అదేదో అరాచకానికి, విశృంఖలత్వానికి దారి తీస్తుందని గగ్గోలు పెడతారు. హీనంగా చూస్తారు. ఈసడి స్తారు. ఫారిన్ కంట్రీస్‌లో ఎందరో అలా హాయిగా జీవిస్తున్న సంగతి మీరు పట్టిం చుకోరు. ఎంచేతంటే మీరు మగమహారా జులు!"

ఆమె వాగ్ధోరణికి ఊపిరి పీల్చుకోవడం మర్చిపోయారంతా. తల్లి అయితే నోరెళ్ళ బెట్టేసింది. తండ్రి బుర్ర గోక్కున్నారు. పరాంకుశం మాత్రం నేనూహించగలన న్నట్టు చూశాడు.

"ఆడవాళ్ళు ఆర్థికస్వేచ్ఛ అభించేసరికి నేనే గ్రేట్ అనుకుంటారు. నేనొక్కదాన్నే చక్రం తిప్పెయ్యగలననుకుంటారు. అది ఓ అందమైన భ్రమ. ఆడామగా ఇద్దరికీ కూడా రెండోవారి తోడు కావాల్సిందే. అది ఒకరోజో రెండ్రోజులో కాదు. జీవితాంతం కావాలి. ఇద్దరూ రెండు రథచక్రాల్లా కలిసి వుంటేనే రథ గమనం ఒడిదుడుకుల్లేకుండా సాగుతుంది. రెండూ వేటి ఇష్టానుసారం అవి తిరిగితే రథం బోల్తా పడుతుంది!"

"అందుకని ఆడదే తన్ను తాను సమ ర్పించుకోవాలి. దాసోహమనాలి. బాని సలా మారాలి. ఎంత సంపాదించినా ఎన్ని శక్తియుక్తులున్నా మరెన్ని అధికా రాలు కల్గివున్నా సరే మగాడికి పాదా క్రాంతం కావాలి. అప్పుడే ఆమె తరి స్తుంది. గొప్పదవుతుంది. మీలాటి వాళ్ళ చేత పతివ్రత అంటూ పొగడబడుతుంది. అంతేకదా? "

"పిచ్చిదానా.. ప్రకృతి స్త్రీకి కొన్ని అద నపు బాధ్యతలు కల్పించింది. పితృస్వా మిక సమాజం మగాడికి కొన్ని సౌకర్యాలు కొంత ఆధిక్యతా ఇచ్చినమాట నిజమే. కాని ఆడామగా ఎలాంటి బంధం లేకుండా కలి సుంటే నష్టపోయేది ఆడదే. మగాడు చిత్త కార్తె కుక్కలాటివాడు. ఎవర్తోబడితే వాళ్ళతో పోతాడు. ఆపైన దులిపేసుకుం టాడు. ఆడది అలా చెయ్యలేదు. గర్భం మోయాలి. పిల్లల్ని కనాలి. పెంచాలి. మగాడు ఇలా అర్ధాంతరంగా వెళ్లిపోకుండా ఒక్క స్త్రీనే అంటిపెట్టుకునుండేలా చేస్తూనే కుటుంబ బాధ్యతని భుజాలకెక్కించింది పెళ్లి!"

"పెళ్లైనా పక్కదార్లు తొక్కేవాళ్ళూ ఆడవా ళ్ళకి అన్యాయం చేసేవాళ్ళూ సెకండ్, థర్డ్ సెటప్పులగాళ్ళూ లేరా? "

"కుక్కమూతిపిందెలెప్పుడూ వుంటాయి. వారిని సమాజం వెనకేసుకురాదు. గౌరవ మివ్వదు. భార్యాభర్తలు విడిపోతామంటే

సమాజం హర్షించదు. ఎలాగోలా కలిసుండేలా చేస్తుంది. ఇద్దరితో బాటు ముడివడిన పిల్లల భవిష్యత్తు, తద్వారా సమాజ ఉన్నతినీ దృష్టిలో పెట్టుకుని అలా ప్రవర్తిస్తుంది. అవసరమైతే బంధుమిత్రులూ రంగంలోకి దిగి ఒత్తిడి తెస్తారు. కోర్టు సైతం విడాకులకెంతో సమయం తీసుకుంటుంది. మరో అవకాశమిస్తుంది. గురకపెడుతున్నాడని ఈమె, లావెక్కిందని అతడు- చిన్న చిన్న కారణాలకే తేలిగ్గా విడాకులు తీసుకుంటారు పాశ్చాత్యదేశాల వారు. వారికి భౌతికసుఖాలు, స్వసంతోషాలు ముఖ్యం. మనం అలా కాదు. అందుకే భౌతిక సుఖలాలసే ప్రధానమనుకున్న అమెరికా ఆర్థిక సంక్షోభంలోపడి కొట్టుకుపోతోంది. తృప్తి, పొదుపు, పరలోక చింతన గల భారతదేశం రోజురోజుకి బలపడుతోంది. ప్రబలశక్తిగా ఎదుగుతోంది"

స్వప్నికకి ఏం మాట్లాడాలో తెలీలేదు. మొహం ఎర్రగా జేవురించింది. ముక్కుపుటాలెగరేస్తూ నేలచూపులు చూస్తుండిపోయింది.

కూతురి స్థితి చూసి సుబ్బారావుకి జాలేసింది.

"ఇప్పుడీ చర్చలూ రాద్ధాంతాలూ మనకెందుకు పరాంకుశం? వాళ్ళేదో చేశారు. పెద్దవారిగా మనం ఏంచేస్తే వాళ్ళకి రక్షణగా వుంటుందో చెప్పు. అలా చేద్దాం"

"వివాహం ఇద్దరు వ్యక్తుల మధ్యకాదు, రుకుటుంబాల మధ్య జరుగుతుంది. రహస్యంగా గాక సమాజం ఎదుట బహిరంగంగా జరిగే వేడుక అది. ఆ అబ్బాయి తల్లిదండ్రులెవరో మనకి ఎదురుపడ్డా గుర్తించలేం. ఇక బాంధవ్యం ఏం కలుస్తుంది? అంచేత వాళ్ళూ మనం కలిసి మాట్లాడుకుని వీళ్ళిద్దరికీ పెళ్ళి చేద్దాం"

సర్రున లేచింది స్వప్ని. "నేనొప్పుకోను. పెళ్లయ్యాక మళ్ళీ పెళ్ళేవిటి. అతడు నా గురించేమనుకుంటాడు? అతడి ముందు తలెత్తుకోగలనా? ఫ్రెండ్సంతా నవ్వరూ? ఇంక శంఖంలో పోయాల్సిన అవసరమేమీ లేదు. మీకు నమ్మకం లేకపోతే చెప్పండి. రిజిస్ట్రార్ ఇచ్చిన మ్యారేజ్ సర్టిఫికెట్ చూపిస్తాను. ఇంకెవరూ ఈ విషయంలో జోక్యం చేసుకోవడం నేను సహించను..."

అక్కడ కూర్చున్నవారిలో ఎవరికీ మొఖాన కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు!

★ ★ ★

మర్నాటి ఉదయమే స్వప్నిక అక్క దీపిక, పరాంకుశం, పిల్లలు బిలబిలమంటూ వచ్చేశారు.

> **కొత్తగాలి...**
>
> **కొరివి పెట్టడానికే**
> **కొడుకు ఉన్నది**
> **ఏడ్పిస్తాడని తెలీకే**
> **వాడ్ని కన్నది**
>
> – మాధవీ సనారా,
> అనకాపల్లి

పులిహోర, చక్కెర పొంగలి, బొబ్బట్లు, కారప్పూస చేసుకొచ్చింది దీపిక. అవాళ్టి సాయంత్రమే తిరుగు ప్రయాణం అని చెప్పినా వినకుండా పిక్నిక్ ప్రోగ్రాం వేసింది.

అంతా గోదావరి దాటి అద్దరికెళ్ళి తోటల్లో అనువైన ప్రదేశం చూసుకుని సెటిలయ్యారు.

పెద్దల కబుర్లు, పిల్లల ఆటలు పాటలు మధ్య చిరుతిళ్ళు- సందడిగా వుంది వాతావరణం.

స్వప్నిక ముభావంగా, కొంచెం రిజర్వ్డుగా వుంది. కాని దీపిక కలుపుగోలు



మనిషి. అందర్నీ కలేస్తోంది, గలగలా మాట్లాడుతోంది. ఎవర్నీ తిన్నగా వుండనివ్వట్లేదు. ఏదోటి చేయిస్తోంది.

ఆమె చురుకుదనం, కలివిడితనం చూసెంతో ముచ్చటపడ్డాడు అనురాగ్.

పరాంకుశం కూడా జోకులేస్తూ స్కూలు కబుర్లూ ఊరి కబుర్లూ చెప్పడం పెద్ద విశేషంగా ఫీలయ్యింది స్వప్ని.

అనురాగ్‌ని ఓ పక్కకి తీసుకెళ్ళాడు పరాంకుశం.

"స్వప్నిక తెలివైందేగాని చిన్నపిల్ల మనస్తత్వం. తను పట్టిన కుందేటికి మూడే కాళ్లంటుంది. నువ్వు కొంచెం సర్దుకుపోతే చాలు దారిలో పడిపోతుంది. తను నాకు మరదలు కాదయ్యా.. చెల్లెలే. నా కళ్ల ముందు పెరిగిన పిల్ల. తను పిల్లాపాపల్తో సుఖసంతోషాల్తో తులతూగాలి.. అది చూసి మేం సంతోషపడాలన్నదే మా కోరిక. స్వప్నికని కంటికి రెప్పలా చూసుకుంటానని మాటివ్వు బాబూ!"

ఆయన్లో బావగారు కాదు, తండ్రి కన్పించాడు. చేతిలో చెయ్యి వేశాడు అనురాగ్. కళ్ళు తుడుచుకున్నాడు పరాంకుశం.

"మీ వాళ్ళతో మాట్లాడి రిసెప్షనో మరో ఫంక్షనో ఏర్పాటు చేస్తాంలే" అని కూడా అన్నాడు.

అదే సమయంలో చెల్లికి హితబోధ చేసింది దీపిక.

"అయినదానికీ కానిదానికీ అతడ్తో వాదనలేసుకోకు. పంతాలకు పోకు. దేన్నికైనా



పట్టూవిడుపూ వుండాలి. మంచితనంతో ప్రేమతో ఆకట్టుకోవాలి. 'నాది.. నావాడు' అన్న భావన ఎంత బలంగా వేళ్లూనితే అంత దృఢంగా వుంటుంది భార్యాభర్తల బంధం. బలహీనతల్ని అర్థం చేసుకోవడం, తప్పుల్ని సహించి సరిదిద్దటం చెయ్యాలే తప్ప నామాటే నెగ్గాలంటూ తెగేదాకా లాక్కూడదు. ప్రేమాభిమానాలూ పిల్లలూ-మొగుడూపెళ్లాల బంధాన్ని శాశ్వతం చేస్తాయి, గుర్తుంచుకో"

"మాకలాంటి భయాలూ జాగ్రత్తలూ ఆకట్టుకోవడాలూ కట్టిపడెయ్యడాలూ ఏమీ అక్కర్లేదు. నన్ను నన్నుగా అనురాగ్ ఇష్టపడుతున్నాడు. నేనూ అంతే. ఎవరి పరిధిలో వాళ్ళుంటున్నాం. ఎవరి కక్ష్యలో వాళ్ళు తిరుగుతున్నాం. ఇక పట్టింపుకీ భేదాలకీ సంఘర్షణకీ స్థానమే లేదు. బావ పురాణకథలు చెప్పుకొస్తూ భయపెడ్తున్నారు గాని వాటి అవసరం మాకు లేదు"

తప్పుచేసి బుకాయిస్తోన్న చిన్నపిల్లని చూసి నవ్వే తల్లిలా నవ్వింది దీపిక.

"మీ బావని తక్కువగా అంచనా వెయ్యకు. నీ విషయాలన్నీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నారు. మీరిద్దరూ కలిసుంటున్న సంగతీ ఆయన చెవిన బడింది..."

బ్రాన్పడిపోయింది స్వప్నిక.

ఆ నేపథ్యంలో నిన్నటి ఆయన మాటల్ని, బోధనల్ని గబగబా సమీక్షించుకుంది.

మొఖం ఎర్రగా కందిపోగా సిగ్గుతో చితి

కిపోతూ గంభీరంగా మారిపోయింది.

ప్రయాణమై బయల్దేరుతూ "మీరంతా మా ఇంటికి రావాలి" అంటూ ఆహ్వానించాడు అనురాగ్.

"మా అమ్మాయికన్నా నువ్వే నయం. నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు చల్లగా వర్ధిల్లు నాయనా" అంది స్వప్నిక తల్లి మురిసిపోతూ.

కూతురికీ అల్లుడికీ కొత్తబట్టలు పెట్టేరు. స్వీట్లూ పండ్లూ కొనిచ్చారు.

అంతా స్టేషన్‌కెళ్ళి రైలెక్కించారు.

అనురాగ్‌ని పక్కకి పిలిచి యాభైవేల కట్ట అతడి చేతిలో పెట్టి అన్నారు సుబ్బారావు "చీరెసారె ఏమీ పెట్టలేదు. మీ కొత్తింటికి కావాల్సిన ఏర్పాట్లూ చెయ్యలేకపోయాను. ఈ డబ్బుతో ఇంట్లోకి కావాల్సిన ఫర్నిచరూ బట్టలూ కొనుక్కోండి. పిల్లని జాగ్రత్తగా చూసుకోవయ్యా. తెలీక తప్పు చేస్తే క్షమించి కడుపులో పెట్టుకో"

అతడి కళ్ళు చెమర్చాయి. "మీరు నిశ్చింతగా వుండండి. స్వప్ని బాధ్యత నాది, సరేనా? "

"ఆ మాట చాలు. ఇంకో పదేళ్ళు నిశ్చింతగా బతికేస్తాం"

ట్రెయిన్ కదిలింది.

"హమ్మయ్య గాలివాన వెలిసింది. అంతా బుద్ధులు చెప్పేవాళ్ళే. మనం తప్పు మీద తప్పు చేస్తున్నట్టు తెగ ఫీలైపోతున్నారు!"

స్వప్నిక మొహంలోకోసారి చూసి తల తిప్పుకున్నాడు అనురాగ్.

"మా డాడీ ఏదో చెప్పినట్టున్నారు. ఏం చెప్పేరేంటి? "

"నిన్ను జాగ్రత్తగా చూసుకోమన్నారు"

"షీర్ ఫూలిష్‌నెస్. ఆడదాని బాగోగులు మగాడి చేతుల్లోనే వున్నాయనుకుంటారు.. అప్పగింతలు పెడతారు. స్త్రీలు తమ బాగోగులు మంచి చెడ్డలు తామే చూసుకోగల స్థాయికి ఎదిగేరని ఎప్పుడు తెలుసుకుంటారో ఏమో!"

"వారి నమ్మకాలు వారివి. వారి ధైర్యం వారిది" అంటూ ఆమెతండ్రి ఇచ్చిన డబ్బు తీసివ్వడం కోసం జేబులో చెయ్యిపెట్టుకున్నాడు అనురాగ్.

"మా డాడీ ఇచ్చిన డబ్బు ఇచ్చెయ్. అది నాది" చేయి చాచింది.

అతడు ఖిన్నుడయ్యాడు.

మౌనంగా నోట్లకట్ట తీసి స్వప్నిక చేతిలో పెట్టాడు.

"ఫ్లాట్ లోన్‌కి జమ కట్టేస్తాను. నెల నెలా ఇరవైవేలు చెల్లిస్తున్నా ఏమీ తగ్గటం లేదు. ఆ కటింగ్ వల్ల నాకెక్కువ మిగల్టం లేదు. ఇకనుంచి ఇంటిఖర్చుకి ఇంటద్దె కూడా చేర్చి షేర్ చేసుకుందాం అనురాగ్"

"అలాగే" అన్నాడు మొఖాన గంటుపెట్టుకుని.

"లెక్కల విషయంలో నేను కచ్చితంగా వుంటాను. ఏమీ అనుకోకు.."

"అలవాటవుతోందిలే"

కళ్ళెగరేసి చూసింది.

తల తిప్పుకున్నాడు.

★ ★ ★

"వెరీగుడ్ ప్రోగ్రెస్" ప్రాజెక్ట్ ప్రోగ్రెస్‌ని పరిశీలించి మెచ్చుకున్నాడు రుషి.

"థాంక్యూ" పరమానంద భరితురాలైంది

**కొత్తగాలి...**

**ఎన్నికల్లో**
**గెలిస్తే పీఠం!**
**ఓడితే..**
**ఓ పాఠం!!**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల*

స్వప్నిక.

"ఇదే స్పీడ్‌తో వెళ్తే డెడ్‌లైన్ కన్నా చాలా ముందే ప్రాజెక్టు వర్కు పూర్తవడం ఖాయం"

మందహాసం చేసింది. మీ సలహాల వల్ల పెద్ద భారం దిగిపోయిందని చెబుదా మనుకుంది. అహం అడ్డొచ్చి మింగేసింది.

"చల్లగాలికి చెదరిన కారుమేఘాల్లా మీ సమస్యలన్నీ పటాపంచలైనట్టున్నాయి కదూ? "

"అవునండీ.. భూతద్దంలో చూసి బెంబేలు పడ్డాను. తాడుని చూసి పామేమో.. కరుస్తుందేమోనని భయపడ్డాను. అది వట్టితాడే అని తేలిపోయింది. సమస్యని ఉఫ్‌మని ఊదేశాను" రెట్టించిన ఆత్మవిశ్వాసంతో చెప్పింది.

"ఆ ప్రభావం ప్రాజెక్టుమీద పడింది. జోరందుకుంది"

అవునంటూ తలాడిస్తూ నవ్వింది.

"ఏదైనా సరే, మనం చూసే దృక్పథాన్ని బట్టి వుంటుంది. హమ్మో గులాబీ కింద ముల్లు వుందే అని బాధపడొచ్చు. ముల్లుకి గులాబీ పూచిందే అని సంబరపడనూ వచ్చు. ఒకటే దృశ్యం. రెండు భావాలు, ఒకటి ఆశావాదం. రెండోది నిరాశావాదం. ఆశావాదమే మనిషిని గట్టెక్కిస్తుంది. గెలిపిస్తుంది. దాన్ని వదులుకుంటే అస్త్రశస్త్రాలన్నీ నిర్వీర్యమే అవుతాయి"

అతడెందుకు చెబుతున్నాడో అర్థం కాలేదు. అయినా అర్థమైనట్టు తలాడించింది.

"స్త్రీ విజయం పురుషుడి మీదా పురుషుడి విజయం స్త్రీ మీదా ఆధారపడి వుంటాయి. ఇంట్లో అంతా అనుకూలంగా, ప్రశాంతంగా, సంతోషంగా వుంటే బయట ఎన్నెన్నో విజయాలు సాధించొచ్చు. ఇంట గెలిస్తేనే రచ్చ గెలుపుంటుంది. ఇంట్లో చికాకులు, సమస్యలు, అసంతృప్తులు లేకపోతే ఎలాంటివారైనా కార్యసాధకులవుతారు. ఎంచేతంటే చేసే పనిమీద పూర్తి శ్రద్ధ పెట్టగలరు. శక్తులన్నిట్నీ కేంద్రీకరించగలరు. ఆత్మవిశ్వాసంతో ఆశావాదంతో పనిచెయ్యగలరు"

అతడు వదిలేలా లేడనిపించి "అందుకు నేనే ఉదాహరణ" అంది మౌస్‌ని కదిలిస్తూ.

"ఒకే. కీపిటప్. టెక్నికల్ డైరెక్టర్ కూడా తన అభినందనలు తెలియజేయమన్నారు. మీ వర్క్ గుర్తించబట్టే అంత ముఖ్యమైన ప్రాజెక్ట్ మీకప్పగించారని నాకిప్పుడర్థమైంది. బై..."

రుషి వెళ్ళిపోయాడు. సృష్టిలోని ఆనందమంతా తన స్వంతమైనట్టు పొంగిపోయింది.

ఇంటికెళ్ళొచ్చాక మనస్సు దూది పింజె అయింది. అనురాగ్ కూడా మరింత సాయపడ్తున్నాడు. శక్తియుక్తుల్ని ప్రాజెక్టుమీద కేంద్రీకరించింది. నిజం చెప్పాలంటే దానిమీదే మనస్సుని లగ్నం చేసింది. చక్కని ఫలితం కన్పించింది.

టైం ఫ్రేంలో ఈ ప్రాజెక్టు పూర్తిచేస్తే చాలు తన స్థాయి పెరిగిపోవడం ఖాయం!

సంతోషంతో ఉక్కిరి బిక్కిరయ్యింది. దాన్ని ఎవర్తోనైనా పంచుకోవాలన్పించింది. ఏం చేయాలో తోచలేదు. వెంటనే అనురాగ్ గుర్తొచ్చాడు. అతడి వింగ్‌లోకి వెళ్ళింది. సీట్లో లేడు.

"లీవ్ తీసుకున్నాడు. మీకు తెలీదా? "

ఆఫీసుకొచ్చేక లీవుపెట్టి వెళ్ళాల్సినంత అర్జెంట్ పనేమొచ్చింది? తనకెందుకు చెప్పలేదు?

రకరకాల ఆలోచనలు తేనెటీగల్లా చుట్టేస్తోంటే ఫోన్ చేసింది. రెస్టారెంట్లో వున్నానని చెప్పి కట్ చేశాడు.

తర్వాత పనిమీద శ్రద్ధ పెట్టలేకపో



యింది.

ఆ సాయంత్రం అనురాగ్ ఇంటికి రాగానే అడిగింది "లీవు తీసుకున్నావెందుకు?"

"ఓ ఫ్రెండ్ ఇంటర్వ్యూ వుందని వచ్చింది. ఆమెనటు తీసుకెళ్ళాల్సొచ్చింది" క్యాజువల్ గా చెప్పేడు.

"గాయత్రి మనల్ని లంచ్ కి రమ్మని ఎప్పట్నుంచో పిలుస్తోంది. కమింగ్ సండే వెళ్దామా?"

"నాకు కుదరదు. వేరే ప్రోగ్రాం వేసుకున్నాను. నువ్వెళ్ళు" అంటూ స్నానానికెళ్ళిపోయాడు.

ఆమె స్థాణువై అటే చూస్తుండిపోయింది.

★ ★ ★

లంచ్ టైంలో కొలీగ్ షీలా, ఇయర్ టాప్స్ తీసుకుంటాను.. సాయం రమ్మంటే వెళ్ళింది స్వప్నిక. ఆ పని చూసుకొస్తోంటే ఎవరో అమ్మాయిని బైక్ మీద ఎక్కించుకుని వెళ్తూ కన్పించాడు అనురాగ్.

ఆ అమ్మాయి మెరుపుతీగలా వుంది. అతడి మీదపడి నవ్వుతూ కబుర్లు చెబుతోంది!

అప్పట్నుంచీ ఏదో తెలీని అశాంతి ఉద్వేగం ఆమెని కుతకుత వుడికిస్తోంది.

అనురాగ్ ఆ అమ్మాయి ఆకర్షణలో పడ్డాడా? ఆ ఆలోచన రుచించలేదు. పైగా ముచ్చెమటలు పోయిస్తోంది. మరచిపోదామనెంత ప్రయత్నించినా మళ్ళీ మళ్ళీ గుర్తు వస్తోంది. మనస్సుని కలుషితం చేస్తోంది.

అతడొస్తే వాళ్ళ సంబంధం ఏమిటో, ఎలాంటిదో తెలుసుకోవాలని నిర్ణయించుకుంది. అదే సమయంలో 'నేనెలా తిరిగితే నీకెందుకూ?' అంటాడేమోనని భయపడింది కూడా.

రాత్రి పదవుతోంటే వచ్చాడు అనురాగ్. అలసినట్టుగా వున్నాడు. నీరసంగా వున్నాడు.

"అడ్డమైన తిరుగుళ్ళు ఇప్పటికి పూర్తయ్యాయన్నమాట!"

ఆమె మాటలకు దెబ్బతిన్నట్టు చూశాడు. నడుం దగ్గర నొక్కుకుంటూ వచ్చి బాధగా కూలబడ్డాడు.

అదేమీ గమనించే స్థితిలో లేదామె. "నేనన్నది గోడనో సోఫానో ఉద్దేశించి కాదు, నీతోనే అన్నాను..."

"లీవ్ మీ"

బాధతో మెలికలు తిరుగుతూ అన్నాడు. అప్పుడామె గమనించింది.

"ఏమైంది అనురాగ్.. ఆర్యూ ఆల్ రైట్?" ఆందోళనపడుతూ దగ్గరికెళ్ళి నుదుటిమీద చేయివేసి చూసింది.

"టెంపరేచర్ లేదు.. ప్రోబ్లం ఏమిటి?"

"నొప్పి..." కడుపుకోపక్కా, వీపు కిందా చూపించాడు.

"బయటా నానాగడ్డీ తినటం వల్ల ఫుడ్ పాయిజనింగ్ అయ్యిందేమో. డాక్టర్ కి చూపించావా?"

తల అడ్డంగా వూపాడు. "రెండ్రోజుల్నుంచి వుంది. తగ్గిపోద్దనుకున్నాను. పెయిన్ కిల్లర్స్ వేసుకున్నాను. ఇవాళ ఎక్కువైపోయింది. నడవలేకపోతున్నాను. యూరిన్ వెళ్ళదు. మోషన్ అవ్వదు"

ఆమె భయపడింది. అలర్టయ్యింది. అతడి మాటలు విన్పించుకోకుండా ఆటోలో అపోలోకి తీసుకెళ్ళింది. రకరకాల పరీక్షలు చేశారు.

అతడికేం కాకూడదని, త్వరగా నయమవ్వాలని దేవుణ్ని కోరుకుంటూ కూర్చుంది.

కంపెనీ వారిచ్చిన హెల్త్ ఇన్సూరెన్స్ కార్డు సంగతి మరిచి అడిగినప్పుడల్లా డబ్బు చెల్లించింది.

కిడ్నీలో స్టోన్ వుందనీ, ఇన్ఫెక్షన్ సోకిందనీ చెప్పేరు. ఆ స్టోన్ కూడా మెలికలో

చిక్కుబడినందున బయటికి రావట్లేదనీ, వైరులాటిది లోపలికి పంపి తీసేస్తామన్నారు. ఆందోళన పడింది స్వప్నిక.

"బేలగా వున్నావేంటి? ధైర్యంగా వుండు. రాత్రి నుంచి తిండీనిద్రా లేకుండా కూర్చున్నావు. అద్దంలో చూసుకో. మొఖం ఎలా పీక్కుపోయిందో" అనురాగ్ అన్నాడు బాధని దిగమింగుతూ.

"ఎక్కువ మాట్లాడకు. అంతా సెట్‌రైట్ అవుతుందిలే.. ఇంకా బాధగా వుందా? "

"లేదులే.."

అతడ్ని ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్ళారు. కన్నీళ్ళు తుడుచుకుంటూ కూర్చుంది.

నీరసంగా వుంది. అలసటగా వుంది. కాఫీ తాగితే బావుండ్ననిపించింది. కాని కదల్లేదు. 'ఆపరేషన్ పూర్తవ్వనీ' అనుకుంది.

థియేటర్లోంచి అనురాగ్‌ని రూమ్‌లోకి షిఫ్ట్ చేశారు. అతడ్ని చూసి బోలెడు సంబరపడిపోయింది.

"రాత్రి నుంచి అనురాగ్ ఏమీ తిన్లేదు. డయిట్ ఏమైనా ఇవ్వొచ్చా? " సిస్టర్ని అడిగింది.

"మేం అరేంజ్ చేస్తాం. డోంట్ వర్రీ. మీ హజ్బెండ్‌ని జాగ్రత్తగా చూసుకునే బాధ్యత మాది..."

ఆ పదం ఆమెని ముభావంగా మార్చింది. ఏమిటోగా అన్పిస్తోంటే మౌనంగా మంచం పక్కన చతికిలబడింది.

ఆమె మోములో మారుతున్న భావాలని గమనిస్తూనే వున్నాడు అనురాగ్.

"ఇంక నువ్వు ఇంటికెళ్ళి ఫ్రెషప్ అవ్వు. ముందిక్కడ కాఫీ తాగివెళ్ళు. పది లంఖణాలు చేసిందాన్లా వున్నావు"

"అయితే వెళ్ళనా? ఒక్క గంటలో వచ్చేస్తాన్లే గాని ఒంటరిగా వుండగలవా? "

నవ్వేడు "నా గురించి వర్రీ కాకు. అయామ్ ఆల్‌రైట్ నౌ. లీవ్ పెట్టొద్దులే"

"నిన్నిక్కడ వదిలి నేనక్కడెలా పని చెయ్యగల్ను! ఏం కావాల్సొచ్చినా సిస్టర్ని అడుగు. ఇలా వెళ్ళి అలా వచ్చేస్తాను"

స్వప్నిక హడావిడిగా వెళ్తోంటే ఆమెనే చూస్తూ, ఆమె గురించే ఆలోచిస్తూండిపోయాడతను.




హాస్పిటల్నుంచి ఇంటికొస్తూనే అడిగింది స్వప్నిక "ఆ అమ్మాయి ఎవరు? "

"ఏ అమ్మాయి? " అనురాగ్ ఏమీ తెలీనట్లడిగాడు.

"నీ బైక్‌మీద ఊరంతా ఊరేగించావే ఆ అమ్మాయి!"

"నా ఫ్రెండ్..."

"నేన్నమ్మను"

"సరే అయితే. మేనత్త కూతురు. ముదినేపల్లి నుంచి తిన్నగా హైదరాబాదొచ్చింది. ఇక్కడి రూట్లూ రేట్లూ తెలీవు. మొన్న వెళ్ళిన ఇంటర్వ్యూలో సెలక్టయ్యింది. ఉండటానికీ వాటికీ ఏర్పాట్లు చేశాను"

"అంతేనా? "

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా అంతే. మా నాన్నా బంధువులూ కేర్ తీసుకోమని మరీ మరీ చెప్పడంతో తప్పలేదు. అవునూ- నువ్వా అమ్మాయిని



## ఎక్కడికెళ్లినా వస్తారా?

క్రిప్స్ ఆధ్వర్యంలోని కాబినెట్ మిషన్‌తో రౌండ్‌టేబుల్ సమావేశం తర్వాత బయటికి వచ్చిన గాంధీజీపై బ్రిటిష్ జర్నలిస్టులు ప్రశ్నల వర్షం కురిపించారు. అందులో



చర్చించిన అంశాలపట్ల ఎంతో గోప్యత పాటించాల్సిన అవసరం ఉంది.

తన చుట్టూ మూగిన విలేఖర్లను చూసిన గాంధీజీ 'మీరు ఇక్కడికి కూడా వచ్చేశారా? బహుశా నేను చనిపోయి స్వర్గానికి వెళ్లినా అక్కడ కూడా మీ బెడద నాకు తప్ప దేమో!?' అన్నారు, వారిని నవ్విస్తూ.

చూశావా? ఎలాగుంది?" కళ్ళెగరేస్తూ అడిగాడు.

"అదో కోతి, నువ్వో చింపాంజీ!"

పెద్దగా నవ్వేశాడు. "ఆడబుద్ధి పోనిచ్చు కున్నావు కాదు. నన్ను ఆపాల్సింది.. పరి చయం చేద్దును"

"నా గురించేమని చెబుదువు?"

"ఫ్రెండ్‌వని"

"గర్ల్‌ఫ్రెండ్ వుండటం మగాళ్ళకి గొప్ప కదా.. అందుకనలా చెప్పేవాడివన్నమాట. మగబుద్ధి ఎక్కడికి పోతుందీ!"

"నీకిష్టం లేకపోతే నువ్వు చెప్పేట్టే కంపా నియన్ అని చెప్పేవాణ్ణి"

"వాళ్ళకర్థమవుతుందా?"

"అది వాళ్ళ కర్మ. మనకేం?"

"సరేలే గాని, నాల్రోజులు ఫుల్ రెస్ట్ అవ సరమన్నారు డాక్టర్. బుద్ధిగా ఇంట్లోనే వుండు. ఎవరు ఫోన్జేసినా బైక్ వేసుకుని తెయ్‌రంగా అంటూ వెళ్ళకు"

"యస్ మేడం" చేతులు కట్టుకుని అ న్నాడు.

ఆ సరికే మనస్సు తేలికబడిందేమో ఫక్కున నవ్వేసింది.

"నువ్వు నవ్వితే భలే బావుంటావు స్వప్నీ. అమాంతం ముద్దు పెట్టేసుకోవాల న్పిస్తోంది"

"ముద్దులకీ ముచ్చట్లకీ చాలా టైముంది గాని ముందు రెస్టు తీసుకో. టీ కాచి తెస్తాను"

అతడి ఫోన్ మోగింది.

"ఆ అమ్మాయే అయితే కట్ చెయ్" గట్టిగా అరిచింది కిచెన్లోంచి.

టీ కప్పుల్తో వచ్చేసరికతడు సీరియస్‌గా వున్నాడు.

"ఎక్కడ్నుంచి ఫోన్?"

క్షణకాలం తటపటాయించి చెప్పేడు "మీ నాన్నా, బావా గుడివాడ వెళ్ళి మా పేరెంట్స్‌ని కలిశార్ట"

నడినెత్తిన నాటుబాంబు పడినట్టు బెంబేలు పడింది. "ఏవన్నార్ట?" కంపిస్తూ అడిగింది.

"మా తాతయ్యలు నా చిన్నప్పుడే చని పోయారని చెప్పేర్ట"

"చచ్చింది గొర్రె!" తల పట్టుకుంది.

"ఒక నిజం దాచడానికి ఒక అబద్ధం చెప్పావు. దానికి సపోర్టుగా పది అబద్ధాలు చెప్పావు. ఇప్పుడు చూడు ఏమైందో, పేక మేడలా కుప్పకూలింది!"

"ఇలా బూమరాంగ్ అవుతుందనుకో లేదు. ఆ స్థితిలో ఆ గొడవలోంచి ఎస్కేప్ అయితే చాలనుకున్నాను"

"నిజం చెప్పడానికి చాలా గట్స్ కావాలి"

"నేనేమీ అబద్ధాలకోరుని కాదు. కాని

మన సంబంధం గురించి వాళ్ళకి తెలిసేలా చెప్పడం కష్టం. ఒప్పించడం అసాధ్యం"

"ఏటికెదురీదుతున్నప్పుడు కొన్ని కష్టాలూ నష్టాలూ నిష్ఠూరాలూ తప్పవు"

"నా సంగతి వదిలెయ్. నువ్వు చెప్పగలిగేవా చెప్పు? "

"లేదు. నేనూ నీ బోటులోనే ప్రయాణిస్తున్నా కదా? మా అన్నయ్యా వదినలు చెప్పిన మాటలకి సంతృప్తిపడి క్షమించేస్తారనుకున్నాను. మీ వాళ్లిప్పుడు ఇంకోలా చెప్పేసరికి కథ మొదటికొచ్చింది. మూఢం వెళ్లేక మా నాన్న ఇక్కడికొచ్చి అన్నీ సెటిల్ చేస్తానన్నార్ట"

తెల్లగా పాలిపోయిన మొహంతో అంది. "అయితే మన సమస్యింకా సమసిపోలేదన్నమాట"

"మనం అనుకుంటున్నంత ఈజీగా అవ్వదు. రెండు జీవితాల సమస్య. రెండు కుటుంబాల సమస్య. ఇంకా చెప్పాలంటే సామాజిక సమస్య"

చిత్రంగా చూసింది. "ఇదంతా ఇదివరకు గుర్తు రాలేదా? "

"వూహూ. నీలాంటి చక్కని చుక్కతో కలిసుండటం.. అదీ.. హక్కులే తప్ప ఎలాంటి బరువూ బాధ్యతల్లేకుండా.. అంతా హ్యాపీయే కదా అని వూరిపోయాను" నవ్వేడు.

"ఇప్పుడలా లేదంటావు? !"

"వుందిగాని ఇందరు ఇన్ని రకాలుగా ప్రెజర్ తీసుకొస్తారని, ఇన్ని రకాల సమస్యలొస్తాయని ఊహించలేదు. ఇందాక ఫోన్ చేసింది మీ బావే"

సన్నగా వణికింది. "ఏవన్నారు? " కీచుగా అంది.

"మీరు నిజంగా పెళ్లి చేసుకున్నారా? - అని అడిగారు"

"ఏమన్నావు? "

"చేసుకున్నామన్నాను"

"థాంక్ గాడ్. బతికించావు" రిలీఫ్‌గా ఫీలవుతూ అంది.

"పెళ్లి చేసుకుంటే బతికిపోతాం"

"అనురాగ్!"

"మొదట నేనూ నీలాగే అనుకున్నాను. ఇప్పుడన్పిస్తోంది.. పెళ్లి స్థిరత్వాన్నిస్తుంది. పెళ్లైతే మగాడికైనా ఆడదానికైనా మరి ఊగిసలాట వుండదు. చేసుకున్నవారితో ఎడ్జస్టైయిపోతారు. కోరికలు నేల మీదికొచ్చేస్తాయి. ప్రేమాభిమానాలు ఇంటికి కట్టిపడేస్తాయి. పక్క చూపులుండవు. వీరిని చేసుకోవాలి, వారిని చేసుకుంటే బావుణ్ణు అన్పించదు"

"ఇప్పుడన్పిస్తోందా? "

స్వప్ని సూటిగా అడిగేసరికి తడబడ్డాడు. ఆమె ముఖంలోకి చూడలేక ఎటో చూస్తూ అన్నాడు "నేనెప్పుడు అనుకుంటే అప్పుడు మన సహజీవన అరేంజ్‌మెంట్లోంచి బయటికెళ్లిపోగలను. అలాటి వెసులుబాటున్నప్పుడు అలా అన్పించడంలో అసహజమేముంది? "

వెర్రిగా అతన్నే చూస్తుండిపోయింది.

మనస్సులో మాత్రం పెద్ద విస్ఫోటం!

★ ★ ★

స్వప్నిక రైతుబజార్లో పండ్లు కొంటోంటే ఆమె పక్కన ఆగింది మారుతి ఆల్టో.

"హే! కమాన్ యార్" డ్రైవింగ్ సీట్లో వున్న శృతి పిలిచింది.

డబ్బు చెల్లించి వచ్చి కారెక్కింది స్వప్ని.

"నా కారెలా వుంది? నా బుగ్గల్లా వుందన్నాడు ప్రదీప్, నా లేటెస్ట్ బాయ్ ఫ్రెండ్"

"నువ్వూ అనురాగ్ పెళ్లి చేసుకున్నార్ట కదా, గాయత్రి చెప్పింది. నాకు చెప్పలేదేం, కొరుక్కుతినేస్తాననా? "

గాయత్రి ఎందుకలా చెప్పిందో, వారి మధ్య తన ప్రసక్తి ఎందుకొచ్చిందో అని ఓ

పక్క ఆలోచిస్తూనే అంది "ఇంకా చేసుకో లేదు"

సడన్ బ్రేకు వేసింది.

"ఈజిట్?"

"ఇటీజ్"

"నేనే కాదు, నువ్వూ గ్రంథసాంగురాలివే నన్నమాట" కారు వెనకాల హారన్ మోత లెక్కువయ్యేసరికి ముందుకి పోనిస్తూ అంది.

స్వప్నికి చాలా ఎంబ్రాసింగ్‌గా వుంది. అనవసరంగా కారెక్కానేమోనని ఫీల య్యింది.

"పెళ్లి కాకుండానే కలిసుంటూ యమగా ఎంజాయ్ చేస్తున్నారన్నమాట"

"డేటింగ్ చేస్తున్నాం"

ఇంతింత కళ్లు చేసుకుని చూసి ఆపైన మొఖమంతా నోరు చేసుకుని పెద్దగా నవ్వింది శృతి.

"అమెరికా కంపెనీల పనిని ఇక్కడ చేస్తూ అమెరికా కల్చర్ని ఇక్కడ అమలు చేస్తున్నావన్నమాట. గుడ్ ప్రోగ్రెస్. నోట్లో వేలు పెడితే కొరకలేని దానివనుకున్నాను. నా గెస్ తప్పు. వేలుతోబాటు చేతినీ కొరి కెయ్యగల నెరజాణవే"

చురుగ్గా చూసింది స్వప్ని.

"ఆ మధ్య జగ్గీ.. అదే జగన్ పెళ్లి చూపుల కొచ్చాట్ట. నువ్వేమో నైతికవర్తన ముఖ్యమంటూ క్లాసు పీకేవంట"

జవాబేమివ్వాలో తోచక బయటికి చూస్తూ కూర్చుంది.

"జగ్గీ డేటింగ్‌కి ఎవ్రెడీ. చక్కని బెడ్ పార్ట్‌నర్. ఒక ట్రయల్ వేస్తావా?"

"షటప్.. స్టాప్ ది నాన్సెన్స్" అరిచింది.

"అంత కోపమెందుకు? ఎస్ ఆర్ నో.. ఏదోకటి చెబితే చాలుగా?"

గంభీరంగా వుండిపోయింది స్వప్ని.

"అనురాగ్‌తో ఎలా వుంటుందో.. ఓ సారి ఇంటికి రానా? లెటజ్ షేర్. నారీ నారీ నడుమ మురారి!"

"స్టాప్ ది కార్.."

చటుక్కున దిగి "బై ఫరెవర్" అనేసి దడాలున డోర్ వేసేసింది స్వప్ని.

ఆమె మనశ్శరీరాలు కుతకుత ఉడికిపో తున్నాయి.

ఆటో పిలిచి ఎక్కి తిన్నగా ఇంటికెళ్లింది. అనురాగ్ ఇంట్లోనే వున్నాడు.

ల్యాప్‌టాప్‌లోంచి తల ఎత్తలేదు.

చెప్పులో మూలకి, హేండ్‌బ్యాగ్, ఫ్రూట్స్ బ్యాగ్ మరో పక్కకి విసిరేసి గదిలోకి వెళ్లి పడుకుంది.

అసలు శృతి తన గురించేమనుకొం టోంది? ఎంత అసహ్యంగా మాట్లాడిందీ! ఫ్రెండ్ గనుక వూరుకుంది గాని లేకపోతే కాలి చెప్పుతీసి చెంపలు వాయించేదే.

ఆమె బిచ్ గనుక తననీ అలాగే అను కుంటోంది కాబోలు.. డర్టీ క్రీచర్!

ఆమెకీ తనకీ.. ఆకాశానికీ భూమికీ వున్నంత తేడా వుంది.

శృతికి మంచీచెడుల్లేవు. పద్ధతీ పాడూ లేదు. ఒకేసారి అనేక మందితో తిరుగు తుంది.

తను అలా కాదు. లివ్ ఇన్ పార్ట్‌నర్‌కే అంకితం. మరొకరి వంక కన్నెత్తి చూడదు.

ఒకవేళ అనురాగ్ ఇంట్లోంచి వెళ్లిపోతే? తనింకొకర్ని లివ్ ఇన్ పార్ట్‌నర్‌షిప్‌లోకి ఆహ్వానిస్తుందా?

దానర్థం తను కూడా ఒకరికంటే ఎక్కువ మందితో- కాదంటే ఒకేసారి ఒక ర్తోనే? !

ఎంతో జుగుప్సగా అన్పించింది స్వప్నికి.

అనురాగ్‌కీ తనకీ ఒకరంటే ఒకరికెంతో ఇష్టం, అభిమానం, ప్రేమ. అది తమ బంధాన్ని దృఢంగా వుంచదా? ఇద్దర్నీ బంధించి వుంచలేదా?

బంధం!

ఏడడుగులు కలిసి నడిస్తే వారు వీరవు తారంటారు. గత కొన్ని నెలలుగా కలిసి జీవిస్తున్నారు. నిస్సందేహంగా తమ ప్రేమ బంధం వివాహబంధం కన్నా గొప్పదే.

తనేదో భయంకరంగా ఊహించుకుని భయపడటం భావ్యం కాదు.

కాని అనురాగ్ ఈ మధ్య అదోలా వుంటున్నాడు. మునుపటిలా ఉత్సాహంగా వుండటం లేదు. డల్‌గా వుంటున్నాడు. బెడ్ మీదా యాంత్రికంగానే.. మాటలు కూడా తడిపొడిగా!

అక్కడికీ ఒక రోజున నిలదీసింది.

"ఇల్లు, ఆఫీస్ రొటీన్‌గా, బోర్‌గా వుంటోంది. నో థ్రిల్.. నథింగ్! ఐ థింక్ ఐ నీడ్ సమ్ ఛేంజ్"

"ఎలాంటి ఛేంజ్? "

"తెలీదు. అయామ్ టోటల్లీ కన్ఫ్యూజ్‌డ్"

"మనస్సు విప్పి మాట్లాడుకుంటే అంతా క్లియరవుతుంది. నీకు గుర్తుందా? నీహారికా ఆమె హజ్బెండ్ మొనాటనీ భరించలేక సూయిసైడ్ చేసుకున్నారు"

తల విదిలించి చూశాడు. అతడి కళ్ల నిండా బెరుకు! భయం!

"వాళ్లంటే పెళ్లి చేసుకున్నారు. కొన్ని బాధ్యతలూ, కొన్ని రెస్ట్రిక్షన్లూ వున్నాయి. మనకలాటివేం లేవు. ఫ్రీ బర్డ్స్‌మి. సో - ఫ్రీగా ఇష్టమొచ్చినట్టుగా వుండొచ్చు కదా అనురాగ్. స్వేచ్ఛలో ఎంతో హ్యాపీనెస్ వుంటుంది"

"ట్రై చేస్తాను. ఎడ్జస్టవ్వగలనేమో చూద్దాం"

"ఐ హేట్ దట్ వర్డ్ 'ఎడ్జస్ట్‌మెంట్'. ఎందుకు చేసుకోవాలి? "

"ఫర్ స్మూత్ సెయిలింగ్" అనేసి వెళ్లిపోయాడప్పుడు.

ఆ తర్వాత కొంచెంగా మార్పు వచ్చిన మాట నిజమే కాని ఇదివరకటి అనురాగ్ కాలేదు.

## కొండను కదిలించా!

మనదేశంలో 1948లో మతకల్లోలాలు తీవ్రమయ్యాయి. దీన్ని నిరసిస్తూ, ఇరు మతాలవారు శాంతించాలని గాంధీజీ కలకత్తాలోని బిర్లాహౌస్‌లో ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు.

ఆ విషయం తెలుసుకున్న లార్డ్ మౌంట్ బాటన్ వెనువెంటనే గాంధీజీ వద్దకు వచ్చాడు. ఆయనను చూసిన గాంధీజీ



అంతటి విషమ పరిస్థితిలోనూ హాస్యంగా 'మహ్మద్ కొండదగ్గరకు రాకపోతే కొండే మహ్మద్ దగ్గరకొచ్చిందట అలా ఉంది మీరు రాటం. కొండను దగ్గరకు రప్పించేందుకు ఉపవాసం చేయక తప్పదన్నమాట!' అన్నారు.

శరీరం అంతగా కృశించినా గాంధీజీ తన హాస్యచతురత అలా ఉండేది మరి!

గర్ల్‌ఫ్రెండ్ అన్నాడు. మేనత్త కూతురన్నాడు. లైఫ్ రొటీన్‌గా వుందన్నాడు.. ఛేంజ్ కావాలన్పిస్తోందన్నాడు.

కర్మకాలి అతడు తనతో అనుబంధం వద్దనుకుని వెళ్లిపోతే?

బావ పరాంకుశం భయపెట్టినట్లు మగాడి నైజం బయటపెట్టుకుంటే?

తన పరిస్థితేమిటి? బతుకేమిటి? ? భవిష్యత్తేమిటి? ? ?

★ ★ ★

"స్వప్నికా! ఫ్రీగా వున్నావా? కొంచెం మాట్లాడాలి" అనురాగ్ ఫోన్.

"వర్కుందనుకో.. నీకన్నా ఇంపార్టెంట్ కాదులే. నా క్యాబిన్‌కొస్తావా? "

"ఆఫీసులో బాగోదు. ఏదైనా రెస్టారెంట్ కెళ్దాం. జస్ట్ హాఫ్ యాన్ అవర్. మళ్లీ కంపెనీకొచ్చేద్దువు గాని.."

మరో పావుగంటకి ఇద్దరూ రెస్టారెంట్లో కూర్చున్నారు. ఇద్దరి మధ్య బిస్కెట్స్ వున్నాయి. పక్కనే పొగలు గక్కుతోన్న టీ వుంది. కాని ఇద్దరి దృష్టీ వాటిమీద లేదు. ఎదురెదురుగా గంభీరంగా కూర్చును న్నారు.

"ఆ మధ్య చెప్పేవు మీ పేరెంట్స్ వస్తా నన్నారని. కాని ఇంత తొందరగా వస్తార నుకోలేదు"

"నేను డిటోయే. హోటల్లో దిగేం.. రమ్మని ఫోన్ చేసేసరికి షాకయ్యాను. సాటర్‌డే, సండే హాలిడేస్ కదా.. వాళ్లతో స్పెండ్ చేయగలనని వచ్చార్ట"

"తిన్నగా ఇంటికి రమ్మనాల్సింది"

"అన్నాను. నా ఇల్లు అయితే వచ్చేవా ళ్లట. ఇప్పుడేమొఖం పెట్టుకునిరావాలని అన్నారు"

"ఇల్లు నాదని చెప్పేవా? "

"నిజమదే కదా!"

కొన్ని నిమిషాల అనంతరం అంది "ఏం మాట్లాడతారంటావు? "

"మన గురించే. మన సంబంధం గురించే. మన ఫ్యూచర్ గురించే. అంత కన్నా ఏముంటుంది? "

"నాకేవిటో భయంగా వుంది"

"డేరింగ్ లేడీవి. నీకు భయమేవిటి నాన్సెన్స్"

"నిన్ను నా నుండి వేరుచేస్తారేమోనని. పెద్దవాళ్ల కిష్టంలేని పెళ్లి చేసుకుంటే వాళ్లు ప్రయోగించే మొదటి అస్త్రం అదేగా!"

"మీవాళ్లు వెళ్లటంతో మన కులాలు వేరన్న సంగతి కూడా తెలిసింది"

"అదొకటుంది కదూ.. కర్ణుడి చావుకి సవాలక్ష కారణాలన్నట్టు ఒక్కోటీ.. పిల్లల సుఖసంతోషాలకన్నా కులానికీ సాంప్రదా యానికీ పెద్ద పీట వేస్తారీ ముసలాళ్లు!"

"వాళ్లు పెరిగిన సంస్కృతి ప్రభావం అలాటిది"

అతికష్టం మీద గొంతు పెగల్చుకుని అంది "మీవాళ్లు ఒత్తిడి తెస్తే నన్ను మోసం చేస్తావా? "

"ఏయ్.. ఏమిటా మాటలు.. సిల్లీగా, ఉయార్ గ్రోన్‌అప్.. యూ నో. మనం చిన్నపిల్లలం కాదు.."

"ఉయ్ లివ్ అవర్ లైవ్స్ ఆన్ అవర్ టరమ్స్. మన బతుకులు మనం బతుకు తున్నాం. కాని వీళ్లంతా మనమీద కక్ష కట్టి.." ఆ పైన మాట్లాడలేకపోయింది. రెండు కన్నీటిబొట్లు కనుకొనకల్నుంచి జారిపడ్డాయి.

"ఇంత బేలగా నిన్ను చూడలేకపోతు న్నాను స్వప్నీ. మనం భాగస్థులం. పార్ట్ నర్స్ ఇన్ హ్యాపీనెస్.."

"ఇన్ పర్స్యూట్ ఆఫ్ హ్యాపీనెస్, ఆనం దాన్వేషణలో భాగంగా సహజీవనాన్ని ఎన్నుకున్నాం. ప్రయాణం హ్యాపీగా సాగి పోతోంటే అనుకోని అవాంతరాలు- ఒక దాని తర్వాత ఒకటి కాదు ఒకేసారి ఎన్నో ఎన్నెన్నో!"

"లైఫ్ ఈజ ఛాలెంజ్. ఫేసిట్. పలా యనం పరిష్కారం కాదు"

"సరే. నీకంతా తెలుసు. అన్నీ తెలుసు. నువ్వేం చేసినా సరే, ఎలాంటి డెసిషన్ తీసుకున్నా సరే" గాద్గదిక స్వరంతో చెప్పింది.

"లెట్మీ ట్రై మై లెవెల్ బెస్ట్" లేస్తూ అన్నాడు అనురాగ్.

బిస్కెట్లూ టీ వదిలేసి డబ్బు చెల్లించి బయటపడ్డారు.

కంపెనీకెళ్ళి కంప్యూటర్ ఆన్‌చేసి బొమ్మలా కూర్చుండిపోయింది.

అనురాగ్ అన్నావదినెలు తిన్నగా ఇంటి కొచ్చారు. తనని అభినందిస్తూ వెళ్ళారు. అవన్నీ వారు చెప్పేవుంటారు. అయినా అతడి పేరెంట్స్ ఎందుకు రాలేదు? కొడుకు ఇల్లు కాదనటం అదో వంక తప్పించి నిజంకాదు. వారికింకేదో ఉద్దేశం వుండి వుంటుంది.

అదేమయ్యుండొచ్చు?

లక్షలకి లక్షలు కట్నం ఇస్తామని సంబంధాలొస్తున్నాయని అనురాగ్ అన్నయ్య చెప్పారు. ఆ మధ్య సిటీలో జాబ్ వచ్చిన అమ్మాయి మేనత్త కూతురని చెప్పేడు అనురాగ్. నిజమో లేక ఏడిపించడానికన్నాడో గాని ఆ అమ్మాయి సన్నగా, చక్కగా బాగుంది.

వేరుకులాలన్న అస్త్రం ఎలాగూ వుంది. తమకి పెళ్లవ్వలేదన్నది డాడీ, బావల మాటల్ని బట్టి తెలిసిపోయి వుంటుంది. చట్టప్రకారం తమ బంధానికి గుర్తింపు లేదు. సుప్రీంకోర్టు పేర్కొన్నట్టు ఇద్దరు పెద్దవాళ్ళు సహజీవనం చేయడం నేరం కాదు. చట్టవ్యతిరేకమూ కాదు. కాని పెళ్లి వల్ల సంక్రమించే హక్కులూ బాధ్యతలూ రక్షణలూ వుండవు. విడిపోవడానికి విడాకుల అవసరమూ లేదు.

తమ మధ్య ఇష్టం వుంది. ప్రేమ వుంది. శారీరక సంబంధం వుంది. కలిసి ఇంటిపని చెయ్యడం ఉంది. ఖర్చు పంచుకోవడమూ ఉంది.

అవి తమ బంధాన్ని పటిష్టపరుస్తాయా లేక విడగొట్టడానికి కారణమవుతాయా?

ఈ రెండ్రోజుల్లో ఏం జరగనుందో ఎవరైనా భవిష్యత్తు చూసొచ్చి చెబితే బావుణ్ణు!

"థాంక్ గాడ్! ఇవాళ ఫ్రైడే అయినా ఇంకా సీటుకి అతుక్కుపోయారేంటి?" అంటూ పలకరించాడు రుషి.

"క్లోజ్ చేద్దామనుకొంటోంటే మీరొచ్చారు.." మొఖం అతడికి కనపడకుండా జాగ్రత్తపడుతూ అంది.

అయినా అతడు గమనించాడు.

"మనసున మనసై బ్రతుకున బ్రతుకై తోడొకరుండిన అదే భాగ్యమూ అదే స్వర్గమూ... ఎలా వుంది పాట? నా గానం గురించి కాదండోయ్ సాహిత్యం గురించడుగుతున్నా"

"బావుంది"

"నీరసంగా చెబుతారేంటి? అద్భుతం కదూ.. మహాకవి శ్రీశ్రీ రాశారు. ఇవాళంతా దాన్ని హమ్ చెయ్యండి. రేపటికి మీలో క్రొంగొత్త ఉత్సాహం చిందులేయక పోతే నా పేరు మార్చెయ్యండి"

### కొత్తగాలి...

**కొత్తగాలి**
**కవితల జెండా!**
**ఎగరాలి**
**పాఠకుల గుండె నిండా!!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరిపేట

చిన్నగా నవ్వింది. "చిన్నప్పుడు చాలాసార్లు విన్నాను. పాడాను. గొప్ప పాటను గుర్తుచేశారు"

"ప్రతి భార్యా ప్రతి భర్తా నిత్యపారాయణం చేయాల్సిన పాటండీ. ఒడిదుడుకులొచ్చినప్పుడు గుర్తుచేసుకుంటే గొప్ప టానిక్‌లా పనిచేస్తుంది"

తలాడిస్తూ వెళ్ళడానికుద్యుక్తురాలయ్యింది.

"రేపూ ఎల్లుండి హాలిడేస్ కదా..

ఎట్టైనా జాలీట్రిప్ వేసుకోండి. రీచార్జ్ మీకు చాలా అవసరం"

"ఫరవాలేదు. చార్జి అయి వున్నాను"

"ప్రాజెక్టు వర్కు కొంచెం స్లో అయ్యింది. టెస్టింగ్ సరిగ్గా జరగట్లేదు. కొంచెం అటెన్షన్ పెట్టాలి. వీలుంటే రేపొచ్చి రివ్యూ చెయ్యండి. టెస్టింగ్ టూల్స్ అతడ్నీ రమ్మనండి"

★ ★ ★

టిఫిన్ చేసుకోబుద్ధి కాలేదు స్వప్నికి. పాలల్లో ఇన్ని ఓట్స్ వేసుకుని తిన్నది.

తల్లిదండ్రులు పిలిచేరని అనురాగ్ శుక్రవారం రాత్రే వెళ్ళాడు. ఇంతదాకా ఎలాంటి ఫోనూ లేదు. ఒకవేళ వాళ్ళని తీసుకుని సడన్‌గా వస్తాడేమోనని ఇల్లంతా నీట్‌గా సర్దివుంచింది.

హోటల్లో ఏం మంతనాలు జరుగుతున్నాయో! మరేం గూడుపుఠాణీలు పురుడు పోసుకుంటున్నాయో!

రాత్రి, అంతక్రితం రాత్రి కూడా ఆమె నిద్ర పోలేదు. కన్ను మూస్తే చాలు పీడ కలలు దాడి చేస్తున్నాయి!

ఒకటే ఆదుర్దాగా, ఆందోళనగా వుంది. 'ఈ టెన్షన్ భరించలేను' అనుకుంది పదోసారి.

ఎక్కడికైనా వెళ్తే, ఇంకేదైనా వ్యాపకం పెట్టుకుంటే మర్చిపోవచ్చేమో అన్పించింది.

గాయత్రి గుర్తొచ్చింది. ఆ వెంటనే గుండెల్లో సన్నాయి రాగం మోగింది.

ఉత్సాహంగా కాల్ చేసింది.

"నిన్ను కలవాలన్పిస్తోంది. వచ్చేస్తున్నాను. ఇబ్బంది లేదుకదా? "

"నీ మొఖం. నాకు ఇబ్బందేవిటే? ఎన్నిసార్లు పిలిచినా రాలేదు. ఇద్దరూ భోజనానికి వచ్చెయ్యండి"

"నేనొక్కదాన్నీ వస్తున్నా" మరో ప్రశ్నకవకాశం ఇవ్వకుండా కట్ చేసింది.

దారిలో అరకిలో స్వీట్సు కొనుక్కువెళ్ళింది.

సాదరంగా ఆహ్వానించింది గాయత్రి. ఆమెలో వచ్చిన మార్పుని చూసి యమా ఆశ్చర్యపోయింది స్వప్ని.

ఎత్తైన పొట్టతో నిండుకుండలా వుందామె.

"సర్ప్రయిజ్ న్యూస్! ఎన్నో నెల? "

"ఫోర్త్ మంత్"

"నిన్నిలా చూస్తుంటే చాలా చిత్రంగా అన్పిస్తోంది గాయత్రీ. ఇంజినీరింగ్ కాలేజీలో కలిసినప్పుడు ఎంతో అమాయకంగా వుండేదానివి. ఫైనలియర్లో కొచ్చేసరికి మెచ్యూరిటీ వచ్చి బుద్ధిమంతురాలన్న బిరుదు కొట్టేశావ్. నా రూమ్మేట్‌గా వున్నప్పుడు ఆరిందాలా మాట్లాడేదానివి. కంపెనీలో పనే దైవం అన్నట్లుండేదానివి. పెళ్ళయ్యాక లక్ష్మీకళ స్వంతమైనట్లున్నావు. ఇప్పుడేమో పరిపూర్ణత్వం సిద్ధించినట్లు వెలిగిపోతున్నావు"

"అందుకే ఆడవారికి అరవై కళలంటారు మా వారు.."

"ఆయనేరి? "

"బజారుకెళ్ళారు"

"ఇంటిపనిలో చేదోడొస్తారా? "

"బాగా హెల్ప్ చేస్తారు. నెల తప్పినప్పట్నుంచి కాలు కింద పెట్టనివ్వటం లేదు" మురిపెంగా నవ్వుతూ అంది.

"వారసుడ్నిస్తున్నావుగా? "

"నాకూ వారసుడే కదా!"

"మీ ఆయన ఆస్తిపాస్తులకి వారసుడంటున్నాను"

"ఇల్లూ ప్లాటూ నా పేరుమీదే వున్నాయి"

మిర్రిచూసి అంది "అయితే వంశానికి వారసుడనుకో"

"అనుకోవడమే గాని పిల్లల్లో ఇరువైపుల వారి జీన్స్ వుంటాయిగా. సైంటిఫిక్‌గా చెప్పాలంటే ఇరువంశాలకీ వారసుడు"

"మీ అత్తామామ మీతోనే వుంటున్నారేమో. బాగా చూసుకుంటున్నారా?"

"కూతుర్లా చూసుకుంటున్నారు. మా ఆడబడుచుకి ఒంట్లో బాగోలేదంటే చూసి రావడానికి వెళ్ళేరు. వాళ్ళలా వెళ్లారో లేదో ఈయనిలా ఫోన్లు మొదలెట్టేరు వెంటనే వచ్చెయ్యమని. నాకు బోరు కొడుతుందనిట!"

"మీ సంసారం గురించి వింటుంటే చాలా ముచ్చటగా వుందే. ఇల్లూ, ఇంటి చుట్టూ మొక్కలూ, ఇంట్లోని అలంకరణ... లైఫ్ ఉట్టిపడుతోందనుకో..."

"నీ ఇంటినీ బాగా డెకరేట్ చెయ్"

## కొత్తగాలి...

**నదీ జలాలు**
**సముద్రం పాలు**
**ప్రజల సొమ్ము**
**అవినీతి పాలు!**

– ఎస్. జయచంద్రారెడ్డి,
బాపట్ల

"చేశాంగాని ఎంచేతో ప్లాస్టిక్ పూల అందమే వచ్చింది"

"మనుషులు ఆత్మీయంగా మెలిగితే ఇంటికి కళ వస్తుంది. జీవం వస్తుంది"

"నేనూ వచ్చాను" అంటూ వచ్చాడు సతీష్.

"నా ఫ్రెండ్ స్వప్నిక. మీ వంటరుచి చూట్టానికొచ్చింది" హాస్యమాడింది.

"నేను రెడీ. నేను బట్టర్ చికెన్ చేస్తాను, నువ్వు నాన్ చెయ్యి. మన అతిథి సుష్టుగా భోంచేసి త్రేన్చాలి"

"నాకు పెద్ద పనిష్మెంటే ఇస్తున్నారు..." నవ్వింది స్వప్ని.

టీవీ పెట్టి కిచెన్లోకెళ్లింది గాయత్రి. సతీష్ కూడా లుంగీ కట్టుకుని వెళ్ళాడు.

వార్తలేం స్వప్ని బుర్రకి ఎక్కడంలేదు. అనురాగ్ ఎలాంటి వార్తతో వస్తాడోననే ఆలోచిస్తోంది.

"అనురాగ్ కూడా వచ్చివుంటే బావుండేది" కాస్సేపయ్యాక వచ్చి కూర్చుంటూ అంది గాయత్రి.

అతడి తల్లిదండ్రులొచ్చిన సంగతి చెప్పింది.

"మీ ఇంటికి రాకుండా హోటల్లో దిగటం.. దాల్ మె కుచ్ కాలా హై"

"చూద్దాం"

"అనురాగ్ మంచివాడే. అందులో సందేహం లేదు. మీ ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి నమ్మకం వుందికదా?"

"వుందిలే గాని... నీకు తెలుసుగా మగాడి మనస్సు చంచలం. ఎప్పుడెటుమళ్ళుతుందో చెప్పలేం"

"ముక్కుకి తాడు వెయ్యాల్సిందేలే. కానది నీ విధానంలో కుదరదేమో?!"

గాయత్రి వంక చూసి తల అడ్డంగా వూపింది.

"అతిస్వేచ్ఛ అనర్థదాయకం. ఛాయిస్ వున్నప్పుడు మనిషి అటూ ఇటూ వూగుతాడు. గుర్రపు కళ్ళకి గంతలు కట్టకపోతే అది తిన్నగా పరుగెట్టదు. ఆ విషయాల్లో పెళ్లి మగవాడ్ని బాగా నియంత్రిస్తుంది..."

"కాని పెళ్లిలో మనకంటూ స్పేస్ వుండదు. స్వాతంత్ర్యం వుండదు. ప్రతి దానికీ మరొకరి పర్మిషన్ కోసం ఎదురు చూడాలి. ఎంత సంపాదిస్తున్నా స్వంతంగా ఖర్చు చెయ్యడానికుండదు. అడుగడుగునా ఆంక్షలు ఆరళ్ళు.."

"నా విషయంలో అలా లేదుమరి. నాకు భావస్వేచ్ఛ వుంది. ఆర్థిక స్వేచ్ఛ వుంది. ఎక్కువగా అన్నిట్లోనూ ఇద్దరం డిస్కస్ చేసుకుని ఒక అభిప్రాయానికొస్తాం. కొన్ని సార్లు నా అంతట నేను ఏం కొన్నా ఆయ

నేమీ అనరు. పట్టించుకోరు. ఒకర్నొకరు సంప్రదించుకోవడం సహకరించుకోవడం న్యూనతగా భావించినప్పుడే చిక్కులొస్తాయి"

"పెళ్ళైన వాళ్ళు- చాలామంది- సుఖంగా వుండటం నేను చూడలేదు. ఏదో రకమైన బాధ. అస్తిత్వలోపం. స్వేచ్ఛాహీనత. మనదేశంలో నలభై అయిదు శాతం వివాహితలు వివిధ రకాల గృహహింసకు లోనవుతున్నారు. పితృస్వామ్యపు నాలుగు గోడల మధ్య మగ్గిపోతున్నారు తెలుసా? "

"ఆ స్థితి రోజురోజుకీ మారుతోంది. ఆడపిల్లలు ఉన్నత విద్యనభ్యసిస్తున్నారు. వేలల్లో జీతాలు సంపాదిస్తున్నారు. ఆస్తులు కొంటున్నారు. ఉన్నత స్థానాలకెదిగి శాసిస్తున్నారు. తదనుగుణంగా మగవారూ మారుతున్నారు. వరకట్నాలు తగ్గాయి. విద్య విజ్ఞానం వివేకం మనిషిని సంస్కరిస్తూనే వుంటాయికదా!"

"హాట్ హాట్‌గా చర్చించుకుంటున్నారు. బాగానే వుంది. వేడివేడిగా తింటే నా పాకశాస్త్ర ప్రావీణ్యం బాగా తెలుస్తుంది"

సతీష్ మాటలకి నవ్వుతూ భోజనాలకి లేచారు.

స్వప్నిక వెళ్ళడానికుద్యుక్తురాలయ్యింది. బొట్టుపెట్టి జాకెట్ పీసూ అరటిపళ్ళూ ఇచ్చింది గాయత్రి. వీధివరకూ సాగనంపుతూ అంది- "టెంపరరీ ఉద్యోగుల్ని చూసుంటావు కదా. ఉద్యోగం ఎప్పుడుంటుందో ఎప్పుడు వూడుతుందో తెలీదు. అనుక్షణం టెన్షన్. అభద్రత. అదే పర్మినెంటు ఉద్యోగులు చూడు ఎంతో నిశ్చింతగా వుంటారు. వారు తప్పుచేసినా ఉద్యోగం నుంచి తీసెయ్యాలంటే బోల్డంత తతంగం. విచారణ, అప్పీలు, యూనియన్ల రాయబారాలూ వుంటాయి. మీ అరేంజ్‌మెంట్ టెంపరరీ ఉద్యోగం లాంటిది. పెళ్లి పర్మినెంట్ ఉద్యోగమన్నమాట. నీలో ఎంత అభద్రత వుందో నీ మాటల్ని బట్టి తెలుస్తోంది. హిప్పీల్లా బతకొద్దు. హ్యాపీ కపుల్‌లా బతకండి. పెళ్లి గురించొక్కసారి ఆలోచించు. ఆల్ ద బెస్ట్!"




అనురాగ్ వచ్చేసి వుంటాడనుకుంటూ గబగబా మెట్లెక్కి ఫ్లాట్‌లో కెళ్లింది.

తలుపుకి వేలాడుతోన్న తాళంకప్ప కంటబడేసరికి నవనాడులూ కుంగిపోయాయి.

వెళ్ళి రెండ్రోజులైంది. ఇంతదాకా కబురూ లేదు కాకరకాయా లేదు. ఏం చేస్తున్నట్టు?

సెల్ అందుకుని కాల్ చేసింది. లిఫ్ట్ చెయ్యలేదు.

విసుక్కుంటూ సోఫాలో ఒరిగింది. నిద్ర పట్టేసింది.

కాలింగ్‌బెల్ శబ్దానికి ఉలిక్కిపడి లేచెళ్ళి తలుపు తీసింది.

అనురాగ్‌ని చూసి "ఏమన్నారు? " గుమ్మంలోనే అడిగింది.

అతడు బదులివ్వలేదు. లోపలికొచ్చి షూ విప్పి ఫ్రిజ్ దగ్గరకెళ్ళి కూలింగ్ వాటర్ తీసుకుని తాగి వచ్చి కూర్చున్నాడు.

జవాబు కోసం అసహనంగా ఎదురుచూస్తోంది స్వప్నిక.

"ఒక నెల టైమిచ్చారు బాగా ఆలోచించు

కోడానికి"

"ఏం ఆలోచించాలి? "

"భవిష్యత్తు గురించి. తరచి ఆలోచించి సరైన నిర్ణయం తీసుకోమన్నారు. అంటే ఇలాగే వుండటమా, పెళ్లి చేసుకోవడమా లేక ఎవరిదారి వాళ్ళు చూసుకోవడమా- ఏది బెస్ట్ అన్నది మనల్నే తేల్చుకోమన్నారు"

"ఇంతోటిదానికి నెల టైమెందుకు. ఇప్పుడే చెప్పేయగల్ను. ఇలాగే వుంటాం. ఇదే లివ్ ఇన్ పార్ట్‌నర్‌షిప్‌ని కొనసాగిస్తాం"

"తొందరపడొద్దనే తొందరపడకూడదనే నెల గడువిచ్చారు. దాన్ని ఉపయోగించుకుందాం. అన్ని కోణాల్నుంచీ విశ్లేషించుకుందాం. ఇప్పటికి వచ్చిన అనుభవాన్ని సమీక్షించుకుందాం. ది బెస్ట్ నిర్ణయానికి వద్దాం"

ఎంతో తాపీగా చెప్పాడు. ఎలాంటి ఎమోషన్‌కీ లోనుకాకుండా అన్నాడు.

అతడి నాన్చుడు ధోరణి ఆమెకి నచ్చలేదు. తన అభిప్రాయాన్ని వెంటనే చెప్పేయక ఈ సాగదీత ఎందుకో అర్థంకాలేదు.

అలా అని ఒత్తిడి తేదలచలేదు. పెద్దవాళ్లే గడువిచ్చి పెద్దరికం చాటుకున్నప్పుడు తను తొందరపట్టం కుత్రచేష్ట అవుతుందనుకుంది.

"అయితే ఈ మంత్ మనకి టెస్టింగ్ టైమన్నమాట"

తలూపాడు.

"నాలో ఎలాంటి మార్పూ రాదు. నా దారినుంచి అంగుళం కూడా జరగను. నువ్వే చూస్తావుగా"

"మార్పుకి రోజులక్కర్లేదు, క్షణాలు చాలు!"

ఆ రాత్రి స్వప్నిక నిద్రపోలేదు. ఆలోచిస్తోందనడంకన్నా వ్యూహరచన చేస్తోందనడం సబబు.

ఎలాగైనా సరే కడకి ఎమోషనల్ బ్లాక్ మెయిలింగ్ చేసైనా సరే అనురాగ్‌ని తనతో వుండేలా చేయాలి. తమ రిలేషన్ ఇలాగే కొనసాగాలి. తనెన్నుకున్న మార్గం అనితరసాధ్యం అనిపించాలి.

ఇది ఇగో లేక ప్రిస్టేజ్ సమస్య కాదు.

సహజీవన విధానానికి పరీక్ష. యాసిడ్ టెస్ట్. దీన్లో గెలిచితీరాలి!

గాయత్రి, తనూ చెరో జీవన విధానానికి ప్రతినిధులు.

గాయత్రి హ్యాపీగా వుంది. అర్థం చేసుకుని సహకరించే భర్త. ఆదరిస్తోన్న అత్త మామలు. మేము, మాది, మనది- అన్న భావమే వుంది భార్యాభర్తలిద్దరిలో. ఒకరంటే ఒకరికి కొండంత నమ్మకం వుంది. ఆజన్మాంతం తోడు నీడగా కలిసి నడుస్తామన్న ధీమా వుంది. సర్వదేవుళ్ళూ రక్షగా వుంటారన్న భావనా వుంది. పిల్లలకి చక్కని సాంస్కృతిక వారసత్వం ఇచ్చి ఉత్తముల్ని సమాజానికి జతచేస్తామన్న గొప్ప విశ్వాసమూ వుంది. వారికి బంధుమిత్రుల ఆదరణ వుంది. సమాజపు ఆశీస్సులూ సంపూర్ణంగా వున్నాయి.

ఇకపోతే తమదీ సంతోషకరమైన బంధమే. చిటపటల్లేవు. హెచ్చుతగ్గుల్లేవు. ఆజ్ఞలూ అణకువలూ లేవు. పెత్తనాలు, ఫోజులూ లేవు. ఒకర్నొకరు గౌరవించుకుంటున్నారు. అభిమానిస్తున్నారు, సహకరించుకుంటున్నారు. అన్నీ సమంగా పంచుకుంటున్నారు. ఇష్టానుసారం మసలుతున్నారు. ఆంక్షలనేవే లేవు. పూర్తి స్వేచ్ఛని ఆస్వాదిస్తున్నారు.

కాని తమ మధ్య వున్నది ఇష్టమే. కోరికే. భౌతికావసరమే, ఆకర్షణ బంధమే. అంతే తప్ప దాన్ని ప్రేమ అనలేం. ప్రేమ మరొకరి ఆనందాన్ని కోరుతుంది. స్వత్వాగాన్ని ఆశిస్తుంది. అవి తమకి తెలీనివి. ఒకరంటే ఒకరికి ఆపేక్ష, అభిమానం

వున్నాయి. అవన్నీ సాన్నిహిత్యం వల్ల ఏర్పడినవే. ఒకరిమీద మరొకరికి పూర్తి నమ్మకముందని చెప్పలేం. ఎప్పుడైనా ఎవ రైనా జారిపోవచ్చు గనుక అభద్రత వుంది. బంధుమిత్రులు సహకరించట్లేదు సరికదా తిన్నగా బతకనీకుండా సమస్యలు సృష్టిస్తున్నారు. ఆందోళన వుంది! అంచేత పిల్లల గురించి సమాజం గురించి ఆలో చించే స్థితిలోనే లేరు. నేను, నాది- అన్న లెక్కలే తమ మధ్య తిష్ట వేసుక్కూర్చు న్నాయి!

తాము వ్యక్తి సుఖాన్ని, వ్యక్తి స్వేచ్ఛని, వ్యక్తి మనుగడనే కోరుకుంటున్నారు.

ఒక్క ముక్కలో చెపాల్పంటే తాము భౌతికంగా కలిసుంటున్నారు తప్ప మాన సికంగా కాదు!

పెళ్లి అయినా సహజీవనమైనా స్థిరంగా దృఢంగా నిలబడాలంటే ఆడమగ మధ్య గల 'బంధం' బలంగా వుండాలి. అది ప్రేమబంధమా మానసిక బంధమా విశ్వా సబంధమా మరోటా మరోటా అన్నది అప్రస్తుతం. కాని ఒకర్ని విడిచి ఒకరు విడువలేనంత పటిష్టంగా వుండాలి. దాని మీదే వారి దాంపత్యం సంసారం సమస్తం ఆధారపడి వుంటాయి!

అంచేత ఆ దిశగా తను పావులు కద పాలి.

అనురాగ్‌ని ఆకట్టుకోవాలి. అలరించాలి. ఆత్మీయత పెంచాలి. తమ అనుబంధం శాశ్వతమన్న భావన కలిగించాలి.

అవసరమైతే తనో మెట్టు దిగి వచ్చి అయినా సరే లక్ష్యాన్ని సాధించాలి! దీన్ని సర్దుబాటు అనకూడదు. దాసోహమన డమూ కాదు. నమ్మకాలని పక్కన పెట్ట డమూ కాదు. విజయసాధనకి అవలంబి స్తోన్న ఎత్తుగడ, అంతే!

స్వప్నికకెంతో తృప్తిగా అనిపించింది. ఆ నిర్ణయానికొచ్చేసరికి గెలిచినంత సంబరప డింది.

హాయిగా ఎలాంటి శంకలూ లేకుండా నిశ్చింతగా నిద్రపోయింది.

ఆ మర్నాటినుంచే కొత్తగా మారిపో యింది స్వప్ని.

ఉదయం లేవగానే కిస్ ఇస్తోంది. అతడు లేచి రాగానే నవ్వుతూ విష్ చేస్తోంది. 'నిద్ర బాగా పట్టిందా?' అని అడుగుతోంది. అతడి అవసరాలు, ఇష్టాలు గురించెక్కువ శ్రద్ధ తీసుకుంటోంది. అతడు చేస్తోన్న పనినీ సాయాన్నీ మెచ్చు కుంటోంది. భవిష్యత్తు గురించీ కెరీర్ గురించీ చర్చిస్తోంది. గొప్పగా ఊహల్ని అతడి కళ్లముందు ఆవిష్కరిస్తోంది.

**కొత్తగాలి...** 

**ప్రళయతాండవానికి తట్టుకుని మరీ..**
**'దేవుడనే వాడున్నాడా' అని**
**మనిషికి కలిగిన సందేహాన్ని**
**'నివృత్తి' చేసింది- కేదారనాథం!!**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

తమకంటే లెక్కలు ఎక్కువ కాదనే సింది. తమ బంధంలో లాభనష్టాల గోల వద్దంది. ఎవరికి తోచినట్టు వాళ్లు ఖర్చుపె డదామన్నది. 'అంతా మనదే కదా' అన్న ట్టుగా వ్యవహరిస్తోంది. బంధుమిత్రులతో సంబంధాలు పెంచుకుందామంటూ అతడి తల్లితో వదినతో సోదరితో ఫోన్లో మాట్లా డుతోంది. తనవారితో మాట్లాడింపజే స్తోంది.

ఏం చేసినా కలిసి చెయ్యడానికి ప్రాధా న్యమిస్తోంది. కవిత్వం రాయమని ప్రోత్స హిస్తోంది. రాసిందాన్ని వినిపించుకుని పొగుడుతోంది. చక్కని కవిత్వ పుస్తకాలు

కొని బహూకరిస్తోంది. రాసుకోడానికను వైన కుర్చీ కొన్నది. బాల్కనీలో ఊయల వేయించి 'ప్రకృతిని చూడు.. కొత్త ఐడి యాలొస్తాయి' అని చెప్పింది.

మన రక్తం పంచుకుపుట్టే 'మన' పిల్లలు కావాలంటోంది. కాంట్రాసెప్టివ్స్ వాడటం మానేద్దామని పోరుతోంది. పిల్లల్ని ఎలా చదివించాలో, ఎంత ఆనందమయ జీవితం ఇవ్వాలో ఊహలల్లుతోంది. వారి బుడిబుడి నడకల గురించి, ఎదిగేదాకా వారిలో వచ్చే మార్పుల్ని వర్ణిస్తూ మురిసి పోతోంది.

అతి త్వరలోనే రెండు కుటుంబాలూ కలిసిపోతాయని ఇకనుంచి ఇరువైపుల బంధువులిళ్ళలోని శుభాశుభాలకు వెళ్ళొద్దా మనీ అంటోంది. పదిమంది బలగం వుండటమే మనిషికి బలం అని వివరి స్తోంది. పదిమందితో పంచుకున్న ఆనందం రెట్టింపవుతుందని చెబుతోంది.

అనుక్షణం అనురాగ్‌ని అంటిపెట్టుకుని ఉంటోంది. కంటికి రెప్పలా చూసుకుం టోంది. అతడి కోసం అహరహం తపి స్తోంది. అతడి తోడిదే ఆనందం, జీవితం, పరమార్థం అన్నట్టు ప్రవర్తిస్తోంది.

స్వప్నిలో వచ్చిన మార్పు అనురాగ్‌కి బాగా నచ్చింది. తనూ ప్రతిస్పందిస్తు న్నాడు. ఆమె మీదెంతో శ్రద్ధ చూపిస్తు న్నాడు. వీకెండ్ ప్రోగ్రామ్స్ వేస్తున్నాడు. ఆమెతో ఓ ఆనందమన్నట్టు ప్రవర్తిస్తు న్నాడు. ఆమె ప్రోత్సాహం మేరకు ప్రముఖ కంపెనీలకు రెస్యూమె పంపిస్తు న్నాడు.

తమ అనుబంధంలో సరికొత్త అధ్యాయం మొదలైనట్టుగా వుంది ఇద్దరికీ.

'ఎప్పటికీ ఇలాగే వుండిపోతే ఎంత బావుణ్ను' అనుకుంటున్నాడు.

★ ★ ★

టెక్నికల్ డైరెక్టర్, క్లయింటు ప్రతినిధి, ప్రోగ్రాం కో-ఆర్డినేటర్, రుషి తదితరు లంతా స్వప్నిక ప్రెజెంటేషన్‌ని శ్రద్ధగా చూస్తున్నారు, వింటున్నారు.

చాలా చక్కగా, సరళంగా, సూటిగా వివ రిస్తోంది. ఎంతో ఉత్సాహంగా మరెంతో కాన్ఫిడెన్సుతో చెబుతోంది.

ఒకప్పుడు 'పనిరాక్షసి'గా అభివర్ణింపబ డిందామె. ఆ రోజులు మళ్లీ వచ్చినట్టుగా పనితో మమేకమైపోయింది. ప్రాజెక్టునే ఊపిరిగా చేసుకుంది.

ఇంట్లోని చక్కని వాతావరణం, అనురా గ్‌తో గల తీయని అనుబంధం ఆమెను ఆ దిశగా పురిగొల్పాయి. మనస్ఫు లగ్నం చేసేలా మంత్రించాయి.

రెట్టించిన ఉత్సాహంతో శ్రమించిందేమో ఫలితం మిరుమిట్లు గొల్పుతోంది!

ప్రెజంటేషన్ పూర్తయింది. చప్పట్లు కొట్టి ఊరుకోలేదు. అభినందనల్తో ముంచె త్తారు.

"మీ పొటెన్షియల్ నాకు తెలుసు. ఈ ప్రాజెక్టు మీకప్పగించి నేను సరైన నిర్ణ యమే తీసుకున్నాను. గో ఎహెడ్. బీ రెడీ ఫర్ బిగ్గర్ రెస్పాన్సిబిలిటీస్" టెక్నికల్ డైరెక్టర్ షేక్‌హేండ్ ఇస్తూ చెప్పేడు.

ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యింది స్వప్నిక.

"మీ వల్ల మాకు కంపెనీ గ్రాండ్ పార్టీ ఇస్తుందని ఆశిస్తున్నాం. కీపిటప్. వెనక డుగు వద్దు. వెనక చూపులొద్దు. ముందుకే ముమ్ముందుకే సాగిపోండి. నౌ యూ ఆర్ ఇన్ రైట్ ట్రాక్!

రుషి మాటలకు పొంగిపోయింది.

అతడు ఆఫీసుపని గురించన్నాడో పర్స నల్ విషయాల గురించన్నాడో తెలీదు. కాని వ్యక్తిగత పంథా గురించే అన్నాడని భావించుకుంది.

కాన్ఫరెన్స్ హాల్లోంచి బయటికొస్తూనే అనురాగ్‌కి ఫోన్ చేసింది.

తన సంబరాన్ని మాటల్లోకి మార్చి అర గంట మాట్లాడింది. అతడామె శక్తియుక్తుల్నీ కార్యదక్షతనీ పొగిడాడు.

"ఏదో ఒకరోజున నువ్వు చుక్కలు చూడటం ఖాయం. ఇంత చిన్నవయస్సులో ఇంత గుర్తింపూ ప్రాధాన్యం లభించాయంటే ఇక ఆకాశమే నీకు హద్దు మైడియర్ స్వప్నికా" అన్నాడు మనస్ఫూర్తిగా.

తొలిసారిగా 'మైడియర్' అన్న పదం వాడాడు.

అమృతపు సోనల్లా విన్పించి ఫోన్లోనే ముద్దు విసిరేసింది.

★ ★ ★

స్వప్నిక తల్లీ తండ్రీ ఫోన్ చేశారు.

ఈ మధ్య తరచూ ఫోన్లు చేస్తూ ఇద్దర్తోనూ మాట్లాడుతున్నారు. ఎన్నో సూచనలిస్తున్నారు. జాగ్రత్తలూ చెబుతున్నారు.

ఇక బావ పరాంకుశం సరేసరి.

క్షేమసమాచారాలయ్యాక అడిగింది తల్లి "అల్లుడుగారు నీ పక్కనే వున్నారా? "

"లేరులే గాని చెప్పు మమ్మీ"

"నెలనెలా బయటవుతోందా"

"వూఁ"

"పిల్లల గురించాలోచించండి. మొగుడూ పెళ్లాల్ని కట్టిపడేసేది పిల్లలేనే మొద్దూ. పిల్లల్ని కన్నాకే భర్త దృష్టిలో భార్య విలువ, గౌరవం పెరుగుతాయి. అనుబంధమూ గట్టిపడుతుంది. నేనెందుకు చెబుతున్నానో విను. ఇదివరకెలా ఊరేగినా ఇప్పుడైనా నా మాట వినవే..."

తల్లి తపన, వేదన ఆమెని కదిలించాయి.

ఆ రాత్రి కండోమ్ వాడనివ్వలేదు స్వప్నిక!

★ ★ ★

తిన్నగా స్వప్నిక క్యాబిన్‌లోకొచ్చాడు అనురాగ్.

అతడిలా రావడం ఇదే ప్రథమం. ఆశ్చర్యచకితురాలై చూసింది.

వెనగ్గా దాచిన స్వీట్స్ డబ్బాలోంచి ఓ స్వీట్ తీసి ఆమె నోట్లో కుక్కేడు.

'ఏయ్.. ఏంటిది చిన్న పిల్లాడిలా.." నోటికి చేయి అడ్డు పెట్టుకుంటూ అంది.

"నేను చిన్నపిల్లవాడ్ని, నువ్వు చిన్న పిల్లవి. కమాన్ వానలో తడుస్తూ వానా వానా వల్లప్పా అని పాడుతూ ఆడుకుందాం"

"నీ కోసం వాన కురవాలన్నమాట. కురుస్తుందిలేగాని తీపి తెచ్చావు తీపి కబురు చెప్పవా? "

"ఐబియంలో సెలక్టయ్యాను"

"ఈజిట్? ఓ కంగ్రాచ్యులేషన్స్" గబుక్కున అతడి బుగ్గమీద ముద్దు పెట్టేసింది.

## కొత్తగాలి...

**అర్ధనగ్న పోస్టర్లని**
**పశువులు తింటాయి**
**మనిషి నెమరేస్తాడు!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

"ఇది ఆఫీసు యార్..."

"లెటిట్ బీ. ఆనందం పట్టలేకపోయాను. ఆఫరెంత? "

"నైన్ లాక్స్ ప్యాకేజ్"

"ఓహ్ నన్ను మించిపోయావ్. నాకు చాలా చాలా హ్యాపీగా వుంది అనురాగ్. ఐ లవ్యూ సో మచ్" అంటూ ఓ స్వీట్ అతడి నోటికందించింది.

అతడి చేతిని ముద్దాడి గాలిలో తేలిపోతూ స్వీట్ డబ్బా తీసుకెళ్లి టీం మెంబర్స్ అందరికీ పంచింది.

"అనురాగ్ ఐబీయంలో చేర్తున్నాడు. హీ

గాట్ గుడ్ డీల్. నైన్ లాక్స్..." గర్వంగా అందరికీ చెప్పి వచ్చింది.

"ఒన్ ఇయర్ ఇక్కడ చేశాక ఇంకో టూ ఇయర్స్ యుఎస్‌లో చెయ్యాల్ట. నెక్ట్స్ ఇయర్ ఎల్ ఒన్ మీద పంపిస్తానన్నారు. అక్కడి ఖర్చంతా వాళ్లదే"

"ఫెంటాస్టిక్ డీల్. అప్పుడు వీళ్లూ నన్ను యు.ఎస్. పంపితే సరేసరి. లేక పోతే హెచ్ఒన్‌బీ మీద వచ్చేస్తాను. ఇద్దరం ప్రపంచాన్ని చుట్టేద్దాం!"

అతడింకేదో చెప్పడానికి సంకోచిస్తు న్నాడు. అదేమీ పట్టించుకునే స్థితిలో లేదామె.

"పద, లెటజ్ సెలబ్రేట్" అంటూ లాక్కుపోయింది.

మాల్గుడిలో చికెన్ బిర్యానీ తింటూ మధ్య మధ్య కోక్ తాగుతూ కబుర్లలో పడ్డారు.

"అన్నివిధాలా నన్ను మించిపోయావు అనురాగ్. అయినా నాకే మాత్రం అసూ యగా లేదు. అవన్నీ నాకే వచ్చినంత సంబరంగా వుందంటే నమ్ము. అమ్మా యిలు తనక్కాబోయేవాడు తనకన్నా పెద్ద వాడై వుండాలి, ఎత్తుగా వుండాలి, ఎక్కువ సంపాదిస్తుండాలి, పెద్ద హోదా ఆస్తి కలిగి వుండాలి- అనెందుకు కలలు కంటూం టారో ఇప్పుడర్థమవుతోంది. ఆ గర్వమే మిటో, ఆ ఫీలింగేమిటో ఇప్పుడు తెలు స్తోంది"

"ఎక్కువ తక్కువల గొడవొద్దు. ఉయార్ ఈక్వల్ పార్ట్‌నర్స్"

"ఇదివరకు మగాళ్ళు కాస్తెక్కువ సమాన మన్నావుగా" నవ్వింది.

అతడూ శృతి కలుపుతూ "అది నిజమే అని క్షణంముందు నువ్వన్న మాటలే సాక్ష్యం చెబుతున్నాయి" అన్నాడు.

"చోడో ఇస్ బాతోంకో. మీ మమ్మీ డాడీ లకి చెప్పేవా? "

"ఇంకా లేదు. ఫస్ట్ నీకే..."

"భలేవాడివే..." టకటకా డయల్ చేసి చ్చింది "నాకన్నా కన్నవాళ్ళెక్కువ సంతోష పడతారు. సంతానం ఎంత వృద్ధిలోకొస్తే వారికంత పండుగ..."

తండ్రికీ ఆ తర్వాత తల్లికీ చెప్పి వారి సంతోషాన్ని పంచుకున్నారు.

ఈలోగా తన తల్లిదండ్రులకీ చెప్పేసిం దామె. వారి అభినందనలూ అందుకు న్నారు.

లంచ్ పూర్తయ్యాక మెల్లగా అన్నాడు అనురాగ్ "పోస్టింగ్ బెంగళూరులో ఇచ్చారు"

"వ్హాట్!" అరిచింది.

"కూల్డౌన్. అక్కడికే కావాల్ట"

"నువ్వక్కడ నేనిక్కడ... అలా ఎలా కుదుర్తుంది? "

"అదేమంత దూరమనీ. అక్కడ రాత్రి బస్సెక్కితే తెల్లారేసరికి ఇక్కడుంటాను. ట్రెయిన్లూ, ఫ్లయిట్లూ వుండనే వున్నాయి. దూరంగా వెళ్ళినంత మాత్రాన దూర మైపోం"

అతడి చేయి గట్టిగా పట్టుకుంది. "వూహు. నిన్ను వెళ్ళనివ్వను. ఇక్కడే అలాంటి ఛాన్స్ వస్తుంది. ప్రయత్నిద్దాం అనురాగ్.. ప్లీజ్.."

"ఐబీఎం ఆఫర్ కాదనుకుని..."

"పోనీ నేను కూడా అక్కడికే వచ్చే స్తాను. నాకొచ్చేక ఇద్దరం ఒకేసారి వెళ్దాం. నిన్ను వదలి వుండలేను" బేలగా అంది. నిస్సహాయురాల్లా చూసింది.

"నువ్వూ వచ్చేద్దువుగాన్లే. నీ ప్రాజెక్టు ఫినిషింగ్ స్టేజ్‌లో వుందికదా. అదవ్వ గానే టెక్ పీపుల్‌కి గుడ్‌బై చెబుదువు గాని. ఈలోగా మా కంపెనీలోనే నా రిఫ రెన్సు మీద గుడ్ ఆఫర్ వస్తుందేమో ట్రై చేస్తాను..."

"తప్పదంటావా? "

"నో అదర్ వే. లెటజ్ ట్రై టు ఎడ్జస్ట్"

ఆమె మాట్లాడలేదు. ఎడ్జస్ట్ అన్న పదానికి మండిపడనూ లేదు!

'సర్దుబాటు'తో సర్దుబాటు చేసుకోడానికి ప్రయత్నిస్తోంది!!




అనురాగ్ బెంగళూరు వెళ్ళి దాదాపు రెండు నెలలవుతోంది.

ఇంతదాకా ఒక్కసారీ రాలేదు.

అతడెళ్తోంటే స్వప్నిక ఎన్నో జాగ్రత్తలు చెప్పింది. ఎన్నో ప్రామిస్‌లు తీసుకుంది. అవన్నీ ఏ ఏట్లో కలిసిపోయాయో తెలీదు.

మొదట్లో తరచూ గాకపోయినా ఎక్కువగానే ఫోన్ చేసేవాడు. అతడు చేశాడా లేదా అన్నది పట్టించుకోకుండా తను మాత్రం రోజూ చేసేది.

కొన్నిసార్లు మాట్లాడేవాడు. చాలాసార్లు లిఫ్ట్ చెయ్యకపోవడమో స్విచాఫ్ చెయ్యడమో చేసేవాడు.

ఊరు మారేసరికి ఊసరవెల్లిలా రంగులు మార్చేస్తాడని కలలో కూడా ఊహించలేదామె.

అసలెవరైనా ఇంత త్వరగా మారిపోతారంటే నమ్మశక్యం గావట్లేదు.

ఎన్ని కలలు కన్నారు! ఎన్ని రమ్యహర్మ్యాలు నిర్మించుకున్నారు! అవన్నీ చిరుగాలికే కొట్టుకుపోవడం ఎంత చిత్రం!

అతడికి తనమీద మోజు, ఆకర్షణ తగ్గాయా లేక మరొకరి ఆకర్షణలో పడ్డాడా?

గాయత్రి భర్త సతీష్ ఐబిఎంలో పనిచేస్తున్నాడని తెలిసి అతడి ద్వారా కూపీ తీయించింది.

"అనురాగ్ చాలా హుషారుగా వుంటున్నాట్ట. అతడు గాళ్స్‌తో చనువుగా వుంటాడు కాబోలు కదా? " అని ఎదురు ప్రశ్నించాడతడు.

'అనురాగ్ తనకి దూరంగా జరిగాడు' అన్న అభిప్రాయానికొచ్చేసింది.

డిప్రెషన్‌కి లోనయ్యింది.

అయినా నమ్మలేకుండా జీర్ణించుకోలేకుండా వుంది. ఆశ కొన వూపిరితోనే అయినా కొట్టుమిట్టాడుతోంది.

ఫోన్లో ఎన్నో అడగాలని ఒక రకంగా నిలదీయాలని చూసింది. కానతడాస్కారం ఇవ్వలేదు.

ఒకరోజున ఛాటింగ్‌లో కలిశాడు. "నాకిప్పటికీ నమ్మకం చిక్కటం లేదు. నువ్వు నా అనురాగ్‌వేనా అనురాగ్? "

"నేనేం మారలేదు. ఎప్పట్లానే వున్నాను"

"నాతో ఎక్కువ మాట్లాడటం లేదేం? నన్ను కలవడానికి రాలేదేం"

"అవసరం అన్పించలేదు"

"నన్ను చూడాలని కూడా అన్పించలేదా? నేనెలా వున్నానో తెలుసుకోవాలన్పించలేదా? నేనేం చేస్తున్నానో ఏం తింటున్నానో నీ కోసం ఎంత కలవరిస్తున్నానో మరెంతగా తపిస్తున్నానో తెలుసుకోవాలని ఒక్కనాడూ ఒక్కక్షణమూ అన్పించలేదా? "

"సీ స్వప్నీ.. మనం రిలేషన్‌లోకి ఎంటరయ్యే ముందు ఓరల్‌గా చేసుకున్న అగ్రిమెంటుని ఓ సారి గుర్తు చేసుకో. ఇద్దరం కలిసివుంటాం.. కలిసి తింటాం.. కలిసి పడుకుంటాం.. కలిసి పంచుకుంటాం.. అంతే తప్ప ఎలాంటి కమిట్‌మెంట్స్

లేవు. నీ బాధ్యత నాకు లేదు. నా బాధ్యత నీకు లేదు. ఎవరూ మరొకరి మీద ఆధారపడరు. అధికారం చలాయించరు. మరొకరి స్వేచ్ఛకి ఇష్టానికి అడ్డురారు. ఇష్టముంటే కలిసుంటాం లేకపోతే విడిపోతాం. అదేకదా మనం అనుకున్నది? "

"అఫ్‌కోర్స్. అలా అని మన మధ్య ఎలాంటి అనుబంధమూ లేదా? "

"ఏముంది చెప్పు? కలిసుంటే పార్ట్‌నర్స్‌మి. విడిపోతే ఎక్స్‌పార్ట్‌నర్స్‌మి. దట్సాల్"

"దారుణంగా మాట్లాడకు. ఐ వాంట్యూ. నువ్వు నాక్కావాలి. నువ్వు వూ అంటే ఇప్పుడే ఈ క్షణమే ఉద్యోగానికి రిజైన్ చేసి వచ్చెయ్యడానికి నేను రెడీ"

"అప్పుడేమవుతుందో ఆలోచించు. నీకు సంపాదన వుండదు. అన్నిటికీ నా మీద ఆధారపడాల్సి వస్తుంది. ఆర్థికస్వేచ్ఛ వుండదు. సో- సమానత్వం వుండదు. నీ అహం దెబ్బతింటుంది. రాజీపడలేక రెచ్చిపోయి ప్రవర్తిస్తావు. అశాంతి, ఆందోళన, కోపం, ద్వేషం, ఆఖరికి విడిపోవటం... అదేమైనా బావుంటుందా చెప్పు? సాంప్రదాయిక భార్యగా మారటానికి నీ శరీరంలోని ఏ అణువూ ఒప్పుకోదు. సో మనమిలా ఫ్రెండ్లీగా విడిపోవడం ఇద్దరికీ మంచిది. గుడ్ బై ఫరెవర్.."

అతడు ఆఫ్‌లైన్ అయ్యాడు.

స్థాణువయ్యింది. సర్వశక్తులూ ఒక్కసారిగా హరించుకుపోయినట్లు కూలబడింది. కన్నీళ్ళు రాలేదు. గుండెల్లో మాత్రం దుఃఖం. పొర్లి పొర్లి ఏడుస్తోంది!

ఆఫీసుకి వెళ్ళలేదు. వంట జోలికి పోలేదు. తనలో తను దుఃఖిస్తూండిపోయింది.

తను చేసిన తప్పేవిటో, తనెక్కడ తప్పటడుగు వేసిందో, ఎంతాలోచించినా అర్థం కావట్లేదు.

అనురాగ్ మంచివాడని విశ్వసించడం ఒక్కటే ఘోరాపరాధం అన్పించసాగింది.

బావ పరాంకుశం అన్నట్టు అతడు మగాడు. ఈజీగా దులుపుకెళ్లిపోయాడు!

తన పరిస్థితేమిటి?

ఫ్రెండ్స్‌లో బంధువుల్లో సంఘంలో తన స్థానమేమిటి?

అందరికన్నా భిన్నంగా నడిచినందుకు తనకు విధించిన శిక్షా ఇది? !

ఆఫీసుకి వెళ్లటం లేదని తెలిసిందో ఏమో గాయత్రి ఫోన్ చేసింది.

"అనురాగ్ నాకన్యాయం చేసి వెళ్లిపోయాడు. నా రాతకి నన్నొదిలేసి తన సుఖం తను చూసుకున్నాడు.. మగాడు!" ఏడుస్తూ నవ్వింది. నవ్వుతూ ఏడ్చింది.

"ఫూలిష్‌గా మాట్లాడకు. కలిసుండటం అతడికిష్టం లేదు. బయటికి పోవాలనుకున్నాడు. పోయాడు. పీడ వదిలిందని మర్చిపోక అతడ్నే తలచుకుని విచారిస్తావెందుకే. ఒకదారి మూసుకుపోతే ఎన్నో దార్లు తెరుచుకుంటాయి గాని ధైర్యంగా వుండు. ఆడది అబలకాదే ఆదిశక్తి. ఆ సంగతి గుర్తుంచుకో"

"అనురాగ్‌ని మర్చిపోలేకపోతున్నాను. ఒంటరిగా వుండాలంటే భయమేస్తోంది గాయత్రీ..."

"ఆత్మవిశ్వాసాన్ని కోల్పోకుండా వుంటే చాలు అన్నీ అవే సర్దుకుంటాయి. అనురాగ్ కాకపోతే మరొకరు. మగాళ్ళకేం కరువు రాలేదు. సిటీలో ఆడవారి కన్నా మగాళ్లే చాలా అధికంగా వున్నార్ట"

"అనురాగ్ ప్లేస్‌లో ఇంకొకర్ని వూహించుకోలేను. అసలా వూహే ఎంతో జుగుప్సగా అన్పిస్తోంది. ఒళ్లు జలదరిస్తోంది"

"సహజీవనంలో అంతేగా. ఒకరుపోతే ఇంకొకరొస్తారు. ఎవరూ శాశ్వతం కాదు. ఏదీ శాశ్వతం కాదు. ఎవరి సుఖం వాళ్ళదే. ఎవరి గమ్యం వారిదే కదా? !"

"అదంతా ఆలోచించగల స్థితిలో లేను. మెదడు మొద్దుబారిపోయింది"

"నువ్వు అతిగా ఫీలవుతున్నావు గాని ప్రతి జీవన విధానంలోనూ కొన్ని పాజిటివ్ అంశాలుంటాయి. కొన్ని నెగటివ్స్ వుంటాయి. కొన్ని లాభాలుంటాయి. కొన్ని నష్టాలుంటాయి. కొన్ని బాధలుంటాయి. కొన్ని సంతోషాలుంటాయి. సరిపెట్టుకోవాలి. సర్దుకుపోవాలి. సంతృప్తిపడాలి. సహనంతో నేర్పుగా ఓర్పుతో చక్కదిద్దుకోవాలి. మెరుగు పరచుకోవాలి. జీవితమంటే అంతేనే..."

"హుఁ. నువ్వు, రుషి, మా బావ, అమ్మా, నాన్న... అంతా నాకే పాఠాలు చెబుతున్నారు. పెద్ద పెద్ద ఉపన్యాసాలిస్తున్నారు. నేను మీ అందరికీ లోకువగా దొరికాను కదూ? అలుసుగా కన్పిస్తున్నాను కదూ? కాని మీలో ఒక్కరికి కూడా అనురాగ్‌కి చెప్పడానికి ధైర్యం లేదు. గట్స్ లేవు. ఎంచేతంటే అతడు మగాడు. ఐ హేట్ మేల్ ఛావనిజమ్. దాన్ని సపోర్టు చేసేవారంటే పరమ అసహ్యం!"

లైన్ కట్ చేసింది స్వప్నిక.

కొంత కసి తీరిన భావన కలిగింది. అది కొద్దిసేపే. మరుక్షణం అంతులేని నిరాశ నిస్పృహలు ఆకలిగొన్న పులిలా ఆమెమీద దాడి చేశాయి. కుమిలిపోయింది.

ఆమె అటువంటి స్థితిలో వుండగా ఆమె ఇల్లు వెదుక్కుంటూ వచ్చారామె తల్లిదండ్రులు.

వారు కంటబడే సరికి దుఃఖమూ ఆనందమూ ఒకేసారి కలిగాయి. తల్లిని వాటేసుకుని బావురుమంది.

వారి ఓదార్పుకి మెల్లగా తేరుకుంది. తమాయించుకుంది.

"చెప్పాపెట్టకుండా వచ్చారేంటి డాడీ?"

"పరాంకుశం పంపించాడు. నీకు తోడుగా నీతోబాటు వుండమంటే వచ్చాం"

ఆమె నుదురు ముడివడింది. "ఇప్పుడే వంత అవసరమొచ్చిపడిందనీ? మీరేదో దాస్తున్నారు..."

"అవన్నీ తీరిగ్గా మాట్లాడుకోవచ్చులేవే. వంటగది ఎక్కడుందో చూపించు. త్వరగా వంట చేస్తాను. ఆఫీసుకెళ్ళదువుగాని" చీర కొంగు బొడ్లో దోపుకుంటూ అంది తల్లి రేవతి.

"ఆఫీసెక్కడికీ పారిపోదుగాని సంగతేవిటి మమ్మీ. ఇన్నాళ్లూ లేనిది మీరిద్దరూ వచ్చారంటే..మిమ్మల్ని బావ పనిగట్టుకుని పంపించారంటే.. ఏదో పెద్ద కారణమే ఉండి వుంటుంది. అసలేం జరిగింది డాడీ?"

"ఏమీ జరక్కూడదనే. ప్రయాణం చేసి అలసిపోయాం. సాయంత్రం తీరిగ్గా మాట్లాడుకుందాం బేబీ..."

"నన్ను మభ్యపెట్టాలని చూడొద్దు. ఏం జరక్కూడదని?"

స్వప్ని మాటలకి తండ్రి బదులివ్వలేదు. తల్లి కళ్ళొత్తుకుంది "ఏదేదో అనుకుంటాం. అనుకున్నామని ఆగుతాయా చెప్పు. ఎలా రాసి పెట్టివుంటే అలా జరుగుతాయి..."

"మీ మెట్ట వేదాంతపు కబుర్లు కట్టిబెట్టండి. ఏం జరగబోతోందో చెబుతారా లేదా?" అరిచినట్టుగా అడిగింది.

## కొత్తగాలి...

**'తలలు' తీసినా**
**కాల్చివేసినా**
**దండన వద్దా?**
**'దాయాదులకు'!!**

– వెల్మల రాంరెడ్డి,
కరీంనగర్

"చెప్పండిహ. అది చిన్న పిల్లేం కాదు. చెట్టంత ఎదిగింది!" అంది రేవతి.

సుబ్బారావు ధైర్యాన్ని కూడదీసుకుంటూ అన్నారు "అనురాగ్ మళ్ళీ పెళ్లి చేసుకుం టున్నాట్ట..."

"మీకెవరు చెప్పేరు?"

"పరాంకుశం ఫోన్ చేస్తే వాళ్ల నాన్న చెప్పేర్ట..."

"నేన్నమ్మను. అనురాగ్ తమ్ముడికి పెళ్లి సంబంధాలు చూస్తోంటే బావ అలా ఊహించుకున్నారేమో. అనురాగ్ ద్రోహం చెయ్యడు" ఏ మూలో మిణుకుమిణుకు మని వెలుగుతోన్న ఆశ ఆమెచేత అలా మాట్లాడించింది.

"వాళ్ళంతా కుమ్మక్కై అతడ్ని ఒప్పించి వుంటారు. ఈ రోజుల్లో డబ్బుకి తప్ప మంచికీ మనిషికీ విలువేం వుందీ!" నోటికి పమిటకొంగు అడ్డుపెట్టుకుందావిడ.

"మొదట మేమూ నమ్మలేకపోయాం గాని నిజమేనుట.."

"ఎవరు చెప్పినా నేను నమ్మను. అదేదో ఇప్పుడే తేల్చేస్తానుండండి.."

అనురాగ్‌కి ఫోన్ చేసింది. కట్ చేశాడు. మళ్ళీ మళ్ళీ చేసింది.

విసుక్కుంటూ ఆన్సర్ చేశాడు. "ఏంటీ పిచ్చిపని స్పృహ్నీ. నేను బిజీగా వున్నాను"

"నేనూ బిజీయే. ఈ ఒక్కటీ చెప్పు చాలు. నువ్వు పెళ్లి చేసుకుంటున్నావా?" తన స్వరం తనకే వింతగా అన్పించింది.

"పెళ్లి చేసుకోవడం తప్పైనట్టు తప్పిద మన్నట్టు మాట్లాడతావేంటి? పెళ్లి చేసుకో కపోవడం వింత. చేసుకోవడం కాదు"

"నీతులక్కర్లేదు నాకు నిజం కావాలి. నువ్వు పెళ్లి చేసుకుంటున్నావా?"

"ఒక్కముక్కలో చెప్పలేను. సాయంత్రం వివరంగా చెబుతాన్లే"

"సే యస్ ఆర్ నో. చేసుకుంటున్నావా లేదా?" అసహనంతో అరిచింది.

"యస్"

ఆమె కుప్పకూలిపోయింది. ఆ వెంటనే స్పృహ తప్పింది.

తల్లి శోకాలు తీస్తోంటే తండ్రి వారిం చాడు. ఇన్ని నీళ్ళు మొఖంమీద చిలకరిం చారు. లేపి కూర్చోబెట్టి పదేపదే పిల్చారు.

అతికష్టం మీద స్పృహలో కొచ్చింది.

చుట్టూ పిచ్చిగా చూసింది. పడీ పడీ నవ్వింది, బావురుమని ఏడ్చింది.

"పారిపోయాడు ఇడియట్.. బద్మాష్.. కబుర్లు, కవిత్వం చెప్పేడు. నన్ను దేవత న్నాడు. నా యౌవనం కొల్లగొట్టాడు. మోజు తగ్గేసరికి మరో పిల్లవెంట పడ్డాడు, ఆంబోతు వెధవ. వాడు బాగుపడడు, సుఖంగా వుండలేడు. నా ఉసురు పోసు కుంటాడు... అనురాగ్... అనురాగ్... ప్లీజ్... వచ్చేసెయ్... నిన్నెంత అపురూ పంగా చూసుకున్నాను. నీకు సర్వాన్నీ ధారపోశాను... నాకన్యాయం చెయ్యకు... నువ్వెలాగంటే అలా చేద్దాం. పెళ్ళికీ రెడీయే.. వచ్చెయ్ వచ్చెయ్...!"

తల్లీతండ్రీ అనునయించాలని ఎంతగా ప్రయత్నిస్తున్నా వినటంలేదు, ఏడుస్తోంది. తిడుతోంది. తనని తాను నిందించుకొం టోంది.

"నేన్నిజంగా పిచ్చిదాన్నే. బెంగళూరు వెళ్ళనివ్వకుండా వుండాల్సింది. అతడి వెంట వెళ్లినా బాగుండేది. బండారం బయటపడేది. అసలు కావాలనే నాకు దూరమవ్వాలనే బెంగళూరు వేయించుకు నుంటాడు. నెల గడువని చెప్పి వాళ్ళ వాళ్ళతో కలిసి నాటకమాడాడు. ఈలోగా అన్ని ముగ్గులూ పెట్టుకుని ఉడాయిం చాడు. ఎగిరిపోయాడు. నాకింక అందడు... మళ్ళీ రాడు.. రా...డు...!"

హిస్టీరియా పేషంట్‌లా మారిపో యింది. చీరుకొంటోంది. అన్నీ విసిరే స్తోంది. సర్వం కోల్పోయినట్టు గుండెలు

పగిలేలా ఏడుస్తోంది.

ఇరుగూ పొరుగూ వచ్చారు. అంబులెన్స్ పిలిచారు. బలవంతాన తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చారు.

వెంటనే సెడేటివ్స్ ఇచ్చారు. మత్తుగా పడుకుండిపోయింది.

తమ ఒకనాటి చిన్నారి పొన్నారి స్వప్నిక గుర్తొచ్చి, ఆమె నేడిలా చైతన్యరహితంగా ఉండడం చూసి తల్లడిల్లిపోయారు సుబ్బారావు దంపతులు. కన్నీరు మున్నీరుగా విలపిస్తూ కూలబడ్డారు.

"చిలకా గోరింకల్లా బాగానే వుండేవారే. అసలేం జరిగిందేవిటీ" కూపీ లాగుతూ అంది పక్కింటి రమణి.

"అతడు బెంగళూరెళ్ళేసరికి అప్‌సెట్ అయ్యింది" విషయం చెప్పడం ఇష్టంలేక అన్నారు సుబ్బారావు.

"అదేంకాదు, వెళ్ళేప్పుడెన్ని మూటలు కట్టిచ్చిందీ నాకు తెలీదూ! ఇంకేదో వుంది. ఎంతో ధైర్యంగా వుండే పిల్ల ఇలా జావకారిపోయిందంటే ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. మీకు తెలీపోతే తెలుసుకోండి. ముందతగాడ్ని అర్జెంటుగా రమ్మనండి"

"ఇంకేం రమ్మనేదీ! దీన్ని మోసం చేసింది చాలక అభం శుభం తెలియని ఇంకో పిల్ల మెడలో తాళి కట్టడానికి సిద్ధపడ్డాడు త్రాష్టుడు!" ఏడ్చేశారు సుబ్బారావు.

బుగ్గలు నొక్కుకుంది రమణి. ఆ వెంటనే కొంగు బిగించింది.

"చేతకానివాళ్లలాగ కన్నీరు పెడతారేంటి? ఫోన్ అందుకోండి. మీకు నోర్రాకపోతే చెప్పండి.. నేను నిలదీస్తాను. వచ్చి అమ్మాయిని ఏలుకుంటాడా సరేసరి. లేకపోతే పోలీసు కేసు పెట్టి ముప్పుతిప్పలు పెడదాం. మూడు చెరువులు నీళ్ళు తాగి

స్తామని హెచ్చరిద్దాం. అలాంటి లోఫర్లని వూరికే వదలకూడదు. మహిళాసంఘాల వారికి చెప్పి దేహశుద్ధి చేయిద్దాం. ఇంకో పెళ్ళి చేసుకోనివ్వకుండా అడ్డుపడి అతగాడి చేత జైలు ఊచలు లెక్కపెట్టిద్దాం..."

"అలా చెయ్యగలమంటావా? " ఆశగా అడిగింది స్వప్నిక తల్లి.

"ఎందుకు చెయ్యలేం తప్పకుండా చెయ్యగలం. గృహహింస చట్టముంది. మహిళా పోలీసుస్టేషన్లున్నాయి. ఫ్యామిలీ కోర్టులున్నాయి. అతడ్తో చెడుగుడు ఆడేసెయ్యొచ్చు. మీరు ధైర్యంగా నిలబడండి చాలు..." రెచ్చిపోయిందావిడ.

"మీకు తెలుసో లేదో వాళ్ళు పెళ్ళి చేసుకోలేదు" సన్నగా లోగొంతుకతో చెప్పింది.

"నిజవాఁ! ఇన్నాళ్ళూ ఆ ఇకఇకలూ పకపకలూ తిరుగుళ్ళూ చట్టుబండలూ... అన్నీ రంకు బొంకు వ్యవహారమా! సంసారుల మధ్య సానికొంపా! గొప్ప బిడ్డని కన్నారు! మీ పెంపకం మహాగొప్పగా వుందిలే, ఇంకా నయం మావారు పరస్త్రీ వంక కన్నెత్తి చూడరు గనుక సరిపోయింది గాని లేకపోతే నా కొంప కొల్లేరయ్యేది! నా బతుకు గోదావరయ్యేది...!"

చేతులు తిప్పుకుంటూ ఈసడిస్తూ వెళ్ళిపోయింది రమణి.

పెదవి దాటింది. ఇక పృథ్వి దాటడం ఖాయం. బిడ్డ ఎలా తట్టుకుంటుందో. మళ్ళీ తలెత్తుకుని ఎలా తిరుగుతుందో! తల పట్టుకున్నారు సుబ్బారావు.

స్వప్నికకి స్పృహ వచ్చిందని చెప్పగా గబగబా రూంలోకెళ్ళారు. ఏదేదో తలా తోకా లేకుండా మాట్లాడుతూనే దుఃఖంతో సుళ్ళు తిరిగిపోతోంది. ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతోంది.

డాక్టర్ పరుగునొచ్చి ఇంజెక్షన్ చేశారు. అరుస్తూనే మగతలోకి జారుకుంది.

"సెలయేరులా దుమికే పిల్ల ఎలా అయిపోయిందో చూడండి. తిరిగి మళ్ళీ మనిషవుతుందంటారా? "

"ఆందోళన పడొద్దు. తప్పకుండా అవుతుంది. పరాంకుశాన్ని వెంటనే బయల్దేరి రమ్మంటాను. అతడికన్నీ తెలుసు. ఏంచేయాలో అది చేస్తాడు"

భర్త మాటలకి, "ఇప్పుడే చేసెయ్యండి. వస్తూ వస్తూ గుడివాడ వెళ్ళి వాళ్ళ కడుపూ కాలూ పట్టుకోమని చెప్పండి. వాళ్ళ మనసులు కరుగుతాయేమో!" అంది.

తల పంకించాడాయన.




**స్వ**ప్నికని హాస్పిటల్నుంచి డిశ్చార్జ్ చేశారు.

ఎంతో నీరసంగా వుంది. నిస్సత్తువగా వుంది. నడవగల శక్తి లేనట్టుగా వుంది.

కళ్ళు లోతుకుపోయాయి. కళ్ళ కింద నల్లటి చారలు ఏర్పడ్డాయి.

వరదల్లో సర్వం కోల్పోయినదానిలా దిగులుగా వుంటోంది. శూన్యంలోకి చూస్తోంది. ఉండి వుండి కళ్ళనీళ్ళు పెట్టుకుంటోంది.

తల్లీ తండ్రీ, అక్కా బావా ఆమెని కంటికి రెప్పలా చూస్తున్నారు. ఓదారుస్తున్నారు. ధైర్యం చెబుతున్నారు. మౌనంగా వింటోంది. మౌనంగానే వుంటోంది.

ఏమితిన్నా కడుపులో సరిగ్గా ఇమడటం

లేదు. వాంతి అవుతోంది. అది చూసి మరింత ఆందోళన పడ్డారు. అనురాగ్ వూసు ఎవరూ ఎత్తడంలేదు.

ఒకసారి స్వప్ని బాల్కనీలోకెళ్తే రమణి కన్పించింది. మొఖం తిప్పేసుకు నెళ్ళిపోయింది. నవ్వుకుంది స్వప్ని. మరో వారం గడిచింది.

"ఆఫీసుకెళ్ళొస్తాను. అక్కడేం గందరగోళంగా వుందో ఏమో. ప్రాజెక్టు పూర్తిచేశారో లేదో.."

"ఇంకో నాల్రోజులు రెస్టు తీసుకోకూడదూ" తండ్రి అన్నారు.

"ఒకసారెళ్ళి కలిసి రావడమే మంచిది. మెడికల్ రిపోర్టులూ బిల్లులూ తీసుకెళ్ళు. రీఎంబర్స్‌మెంటు వుందికదా. ఎలావోలా నచ్చచెప్పి ఒక నెలరోజులు లీవు శాంక్షన్ చేయించుకో మనూరెళ్దాం. మునుపటి మనిషివవుతావు" అన్నాడు పరాంకుశం.

ఇప్పుడాయన సరళంగానే మాట్లాడుతున్నాడు. ఒక్క పరుషపదమూ ఉపయోగించట్లేదు. తనలో వచ్చిన మార్పు అతడ్నీ మార్చిందేమో!

అన్ని పేపర్లూ తీసుకుంది. సెల్ వంక చూసింది. చార్జింగ్ లేక ఆఫ్ అయ్యింది. చార్జింగ్‌కి పెట్టి బయల్దేరింది.

కంపెనీలో అడుగు పెడుతోంటే కాళ్ళు తడబడ్డాయి. చాలా సంవత్సరాల తర్వాత వచ్చినట్టుగా వుంది. తమ వింగ్‌లో కెళ్ళింది. టీం సభ్యులొక్కరూ లేరు.

ఎంక్వైరీ చేసింది.

ప్రాజెక్టు సక్సెస్‌ఫుల్‌గా కంప్లీటయ్యిందిట. క్లయింట్ యాజ్ ఇటీజ్ యాక్సెప్ట్ చేశాట్ట. అంతా పార్టీ చేసుకుంటున్నార్ట. గుండెల్లో గునపం దిగినట్లు విలవిల్లాడింది. నిస్త్రాణయై కుర్చీ లాక్కుని కూలబడింది.

నైన్టీ పర్సెంట్ ప్రాజెక్టు వర్కు తన ఆధ్వర్యంలోనే పూర్తయ్యింది. అనుకోని పరిస్థితుల వల్ల తను ఆఫీసుకి అటెండవలేదు. తన స్థానంలో మరొకర్ని నియమించి పని పూర్తి చేయించారు. క్రెడిట్టంతా అతడికి కట్టబెట్టారు!

ఏదో తెలీని బాధ గుండెల్ని మెలితిప్పింది. కన్నీరొలికింది. కళ్ళు తడుచుకు నెళ్ళి హెచ్చార్‌ని కలిసింది.

"హేయ్ స్వప్నికా! వాట్ హేపెన్డ్ టూ యూ. ఏమైంది నీకు? ఇన్ఫర్మేషన్ లేకుండా డుమ్మా కొట్టావేం? అలా వున్నావేంటి? ఆర్యూ ఆల్ రైట్?"

మౌనంగా మెడికల్ బిల్లులూ రిపోర్టూ అతడి ముందుకి తోసింది.

"అయాం సారీ.. ఇలా జరిగిందనుకోలేదు. లాయల్టీ మార్చావేమో.. ఇంకో కంపెనీలో చేరావేమో అనుకున్నాం"

"ఇక్కడ నాకు రికగ్నిషన్ లేకపోతే కదా!"

"అఫ్‌కోర్స్, మరి ఎవర్తోనూ ఎందుకు కాంటాక్ట్‌లో లేవు? సెల్ ఆఫ్ చేశావు. మెయిల్ చూడవు.."

"సెల్ చార్జి అయిపోయింది. నేను స్పృహలో లేను..."

"ఓకే.. టెక్నికల్ డైరెక్టర్‌కి వివరిస్తాన్లే. వాళ్ళేం డెసిషన్ తీసుకుంటారో ఏమో. ఐవిల్ కాల్యూ బ్యాక్.."

మరింకెవర్నీ కలవడానికి మనస్కరించలేదు. కాస్సేపుంటే రుషి కలుస్తాడేమో క్లాసు పీకుతాడేమోనన్న భయమూ కలిగింది.

ఎవరో తరుముతున్నట్టుగా బయటికి నడిచింది.

డీలాపడిన కూతురి మొహం చూసేసరికి తల్లి కడుపు తరుక్కుపోయింది. కదిపితే కన్నీళ్ళు ఒలుకుతాయేమోనని భయమేసి ప్రేక్షకుల్లా వుండిపోయారంతా.

భోజనం ముందు కూర్చుని అన్నం కెలికింది. రెండు ముద్దలు తిన్నదో లేదో




భళ్ళున వాంతి చేసుకుంది స్వప్నిక. కలవర పడ్డారు. ఆందోళనగా చూశారు.

"వికారంగా వుంటోందమ్మా. ఏదీ తిన బుద్ధి కావట్లేదు.."

తప్పుచేస్తూ దొరికిపోయిన వారిలా పక్కచూపులు చూశారంతా.

"నిన్న మొన్నటిదాకా మత్తుపదార్థాలె క్కించారు కదా. అలాగే వుంటుంది. కాస్త ఓపికపట్టు తల్లీ దార్లో పడిపోతుంది..."

తల్లి మాటల్ని విశ్వసించి లోపలికెళ్ళి పడుకుంది.

స్వప్నికకి మెలకువ వచ్చేసరికి హాల్లోంచి ఏవో మాటలు విన్పిస్తున్నాయి. 'కొత్త గొంతు ఎవరిదబ్బా' అనుకుంటూ హాల్లోకి వెళ్లింది.

టీ తాగుతోన్న రుషిని చూసి కంగు తింది. కన్నీళ్ళు కారాయి. తల దించు కుంది.

"హెచ్చార్ చెప్పేడు. ఇలా అయ్యిందని ఎవరికీ తెలిదు. ఏమాత్రం మెస్సేజ్ అందినా సాయం వచ్చేవాళ్ళం ఇప్పుడెలా వుంది? "

"ఫైన్..."

"రెస్ట్ తీసుకో. మెంటల్ పీస్ అవసరం. ఎంత ప్రశాంతంగా వుండగల్గితే అంత త్వరగా రికవరవుతావు"

"ప్రాజెక్టు పూర్తయ్యిందని సెలబ్రేట్ చేసుకున్నార్టగా కంగ్రాట్స్"

"నిజానికి మేం నిన్ను అభినందించాలి. గోల్డెన్ ఛాన్స్ మిస్సయ్యావ్. నేనందుకే చెబుతూంటా. ఇంటినీ ఆఫీసునీ సరిగ్గా బ్యాలెన్స్ చేసుకోలేకపోతే ప్రోబ్లమ్స్ ఫేస్



చెయ్యక తప్పదు. ఒక్కోసారిలాగే కెరీర్‌కి గొడ్డలిపెట్టు అవుతుంది..."

ఆమె నేలచూపులు చూస్తుండిపోయింది.

"యూ నీడ్ సమ్ ఛేంజ్. లెటజ్ గో ఫర్ షార్ట్ రైడ్"

అప్పటికే అతడి మీదందరికీ సదభిప్రాయం కలగటంతో "సరదాగా వెళ్ళి తిరిగిరా" అన్నారు.

రెడీ అయి వచ్చింది. ఇద్దరూ రుషి కార్లో బయల్దేరారు.

డ్రైవ్ చేస్తూ అన్నాడతడు "పర్సనల్ విషయాలు అడుగుతున్నాను. వాట్ హేపెన్డ్? "

అతడి మాటల్లో ఆత్మీయస్పర్శ కన్పించింది.

సహజీవనం వైపు తను ఆకర్షింపబడటం నుంచి నిన్నమొన్నటి వరకూ జరిగిందంతా పూస గుచ్చినట్టు చెప్పింది.

"ధర్మార్థకామ మోక్షాలని పురుషార్థాలు నాలుగు. ప్రతివారూ వాటిని సాధించాలి. ఏదోలాకాదు, ధర్మబద్ధంగా సాధించాలి. మనిషి మనీషిగా రూపొందాలి. ఆ క్రమంలో పశుత్వం విడిచి మానవత్వం దాటి దైవత్వంవైపు అడుగులు వెయ్యాలి"

ఇదిప్పుడు తనకెందుకు చెబుతున్నారన్నట్టు చూసింది.

అతడామె చూపుల్ని పట్టించుకోలేదు.

"ధర్మార్థ కామాలు మూడూ సాధించడానికి అనువైనది వివాహ వ్యవస్థ. మనిషి జీవితానికి సార్థకత చేకూరాలంటే ధర్మాచరణ తప్పనిసరి. అర్థం కూడా ధర్మసహి

తంగానే సంపాదించాలి. కామమూ ధర్మ బద్ధంగానే తీర్చుకోవాలి. చక్కని సంతానానికి జన్మనివ్వాలి. యజ్ఞం చెయ్యటం వల్ల సమాజానికి ఎంత ప్రయోజనమో సత్సంతానం వల్ల కూడ సమాజానికి అంతే ప్రయోజనం. అందుకే వివాహాన్ని సంతాన యజ్ఞం అన్నారు. ఈసంతాన యజ్ఞానికి ఉపకరించే హోమ ద్రవ్యమే కామం. అధార్మిక కామ ప్రవృత్తి సమాజ వినాశనానికి దారి తీస్తుంది"

"పాశ్చాత్య దేశాల సమాజాలన్నీ ఫ్రీ సెక్స్ వల్ల ఇన్హిబిషన్స్ లేని ప్రవర్తన వల్ల భ్రష్టుపట్టుకుపోయాయనీ, పతనమయ్యాయనీ అంటారు? అంతేనా? "

"వారి సభ్యత వేరు, సంస్కృతి వేరు. దృష్టి, దృక్పథం, లక్ష్యం.. అన్నీ వేరు. వారిని చూసి మనం వాతలు పెట్టుకోవడం సరికాదు. వ్యక్తిగతంగా సామాజికంగా నీతి, న్యాయం, ధర్మాలకి భారతీయ సంప్రదాయం అత్యంత విలువనిస్తుంది.."

"ఆ రూల్సన్నీ స్త్రీకే వర్తిస్తాయి. పురుషుడిక్కాదు. అతడు ఈజీగా తోసిరాజనేసి వెళ్ళిపోగలడు"

"ధర్మేచ అర్థేచ కామేచ మోక్షేచ నాతిచరామి అని ప్రమాణం చేసినవాడు అంత తేలిగ్గా వివాహబంధం నుంచి బయటపళ్ళేడు. ఈజీగా తప్పించుకోగలడనుకోవడం ఓ భ్రమ!"

"తాళి ఐ మీన్ పెళ్లి అంత శక్తిమంతమైందంటారు? "

"నిస్సందేహంగా. భార్యాభర్తలు మనసా వాచా కర్మణా కలిసిపోవాలి. అప్పుడది జన్మజన్మల బంధమన్పిస్తుంది. జీవితాంతం కొనసాగుతుంది"

"మీరు ఉపన్యాసాలు బాగా ఇస్తారు"

కారు ఆపి "దిగండి" అన్నాడు రుషి.

అయోమయంగా చూసింది. "మా ఇంటికి వచ్చాం. కమాన్. ఓ కప్పు కాఫీ తాగి వెళ్దాం"

ఎన్నో నీతులు చెబుతూంటాడు. ఎంతో సరదాగా హుషారుగా వుంటాడు. ఇంట్లో అతడి నిజరూపం ఎలా వుంటుందో చూద్దాం- అనుకుంది.

డోర్ లాక్ తీస్తోంటే అమితాశ్చర్యంగా చూసింది స్వప్ని.

భార్యని లోపలపెట్టి బయట తాళంవేసే రాక్షసుడా? లేక ఇంట్లో భార్యే లేదని తెలివిగా తనని ట్రాప్ చేస్తూ...! అతడు లోపలి కెళ్ళాడు. ఆమె గుమ్మం దగ్గరే ఆగిపోయింది.

"హాయ్ లక్ష్మీ సాధన బాగానే చేశావన్న మాట. గుడ్. నీకో కొత్త ఫ్రెండ్‌ని పరిచయం చేస్తాను.." అంటూ తల తిప్పి "స్వప్నికా! అక్కడే ఆగిపోయావేం? లోపలికి రా" అన్నాడు రుషి సీడీప్లేయర్ కట్టేస్తూ.

లోపలికెళ్లింది. మంచం మీద పడుకుందో ఎముకల గూడులా వున్నామె. ఆమె మెడలో తాళిబొట్టూ నల్లపూసల గొలుసు మెరుస్తున్నాయ్.

మనస్సు ఆముదం తాగినట్టు అయ్యింది. అతడి వంక వేదనగా చూసింది.

"కూర్చో" అని చెప్పి మంచంమీద ఉన్న ఆమెని రెండు చేతుల్తో ఎత్తుకుని బాత్ రూంలోకి తీసుకెళ్ళాడు.

షోకేస్‌లోని వారిద్దరి ఫొటోలూ చూస్తూ అటూ ఇటూ తిరిగింది. 'అందగత్తే పాపం. ఎందుకిలా అయ్యిందో!' అనుకుంది. డాన్స్ చేస్తున్న ఫొటో చూసి అచ్చెరువొందింది.

లక్ష్మిని తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెట్టి వీపుకి తలగడ సపోర్టుగా పెట్టాడు రుషి. తువ్వాలు తడిపి తెచ్చి ఆమె మొఖాన్నీ చేతుల్నీ కాళ్ళనీ తుడిచాడు. టాబ్లెట్స్ తెచ్చి వేసి నీళ్ళు తాగించాడు.

పాలల్లో ఏదో పౌడర్ కలిపి తెచ్చి తినిపించాడు.

"ఒన్ మినిట్లో టీ తెస్తాను. బేర్ విత్ మీ" అంటూ ఉత్సాహంగా కిచెన్లోకెళ్లాడు.

సరదాగా చక్కగా ఎంతో ఇష్టంగా అతడు చేస్తున్న పనులు చూసి ముక్కున వేలేసుకుంది స్వప్ని.

'ఇలాంటి భర్తలు కూడా వుంటారా!' అనుకోకుండా వుండలేకపోయింది.

"రామ్మా.. నీ పేరేంటి? " అడిగింది లక్ష్మి.

జవాబుగా లోపల్నుంచొచ్చి అన్నాడు రుషి "సారీ! పరిచయం చెయ్యనేలేదు. ఈమె లక్ష్మి. నా జీవితలక్ష్మి. మా ఇంటి మహాలక్ష్మి. ఈమె స్వప్నిక. ఇదివరకు చెప్పేను గుర్తుందా? వెరీ స్మార్ట్ అండ్ హార్డ్ వర్కర్. వర్క్‌మీద కమాండ్ వుంది. నాలెడ్జి వుంది. ఈ మధ్య కొన్ని ఒడిదుడుకుల వల్ల నిరాశపడుతోంది. మీరు మాట్లాడుకుంటూ వుండండి"

"నిరాశ దిగులు దుఃఖం అధైర్యం- వీటిని అధిగమించి ముందుకెళ్ళాలి గాని అవి మనల్ని డామినేట్ చేసే ఆస్కారం ఇవ్వకూడదు" అందామె.

"కదల్లేని స్థితిలో వుండి కూడా మీరిలా మాట్లాడుతున్నారంటే మీ మనోనిబ్బరాన్ని అభినందించాలి"

"ఇదంతా మా వారి సాహచర్య ఫలం. నేనివాళిలా మాట్లాడుతున్నానంటే ఇదంతా ఆయన చలవే. చూస్తుండు ఏదో ఒక రోజున మళ్ళీ గజ్జెకట్టుకుని స్టేజిమీద ప్రదర్శన ఇస్తాను"

ఆమె కళ్లల్లో కురిసిన మెరుపుల్ని చూసి ఆశ్చర్యబోయింది స్వప్నిక.

"అసలిదంతా ఎలా జరిగింది. ఫొటోల్లో ఎంతో చలాకీగా వున్నారు"

"నాట్యమంటే నాకు ప్రాణం. ఎన్నో ప్రదర్శనలిచ్చాను. అప్పుడే ఆయన నా అభిమానినంటూ పరిచయం చేసుకున్నారు. పరిచయం ప్రణయానికీ ప్రణయం పరిణయానికీ దారితీశాయి. ఆయన భార్యనవడం నా అదృష్టం. జన్మజన్మల నోముల ఫలం"

"మొగుడ్ని ఎక్కువగా పొగిడితే ఆయుక్షీణం" అంటూ టీ కప్పుల్తో వచ్చాడు రుషి.

"ఏం కాదు, నేను పొగిడితే ఆయుష్షు రెట్టింపవుతుంది. నేను లక్ష్మీదేవినండీ"

"ఓహో.. నా తపస్సు మెచ్చి ప్రత్యక్షమైనందుకు కృతజ్ఞుడ్ని. కాస్త టీ రుచి చూడండి లక్ష్మీజీ" టీ కప్పు నోటికందించి మెల్లగా సిప్ చేయించాడు.

"చేతులు స్వాధీనంలో లేవా? " స్వప్ని అడిగింది టీ చప్పరిస్తూ.

"ఉహూ. ఇప్పుడింకా నయం ఇలాగైనా వున్నాను. ఇదివరకైతే జీవచ్ఛవాన్ననుకో"

చటుక్కున ఆమె నోరు మూసేశాడు. "షటప్ ఐ సే.."

ఆమె కనుకొనల్నుంచి రెండు వేడి కన్నీటిబొట్లు జారిపడ్డాయి.

"డాక్టర్లేమంటున్నారు? "

"మల్టిపుల్ స్క్లిరోసిస్. నరాలకు రక్షణగా వుండే పదార్థం దెబ్బతినడంతో ఇలా అవుతుంది. అది యుక్తవయసు మహిళలకే ఎక్కువగా వస్తుందిట" చెప్పాడు

> ## కొత్తగాలి...
>
> **తీర్థయాత్రలకు వెళ్లిన భక్తులని భగవంతుడు తన సన్నిధికి రప్పించుకుంటున్నాడు!**
>
> – తాజీప్రసాద్, చెన్నై

రుషి.

"మైగాడ్! మొదటెలా గుర్తించారు? "

"నాట్య ప్రదర్శనలిస్తోంటే ఏదో నలతగా వుండేది. అదేంటో గుర్తించేలోపే నా అడుగులు లయ తప్పాయి. అకస్మాత్తుగా కళ్ళు మసకబారాయి. మాటలు ముద్దముద్దగా వచ్చాయి. డాక్టరికి చూపిస్తే ఎం.ఎస్. అని నిర్ధారణ చేశారు. మూడేళ్ళ నుంచి మంచానికే పరిమితమయ్యాను. మొదట్లో నా దుస్థితి ఎంత దారుణంగా వుండేదంటే ఒంటిమీద చీమ పాకుతున్నా తోసెయ్యలేకపోయేదాన్ని. కనురెప్ప వెయ్యాలన్న ఒకరిమీద ఆధారపడాల్సి వచ్చేది. మావారెన్ని సపర్యలు చేశారో చెప్పడానికి మాటలు చాలవు. చిన్నపిల్లకి చేసినట్లు అన్నీ చేశారు. నా బతుకుని మూటకట్టి ఆయన పాదాల దగ్గర పెట్టినా ఆ రుణం తీరదు"

ఆమె కంఠం వణికింది... కన్నీళ్ళు చిప్పిల్లాయి. అతడు లేచి కళ్ళు తుడిచాడు.

"మన మధ్య రుణాలేంటి పిచ్చీ. నాకిలాటి దుస్థితి వస్తే నువ్వు చెయ్యవూ? "

"ఇంకోసారలా మాట్లాడితే నా మీద ఒట్టే. మీరు దేవుడు. మీకే కష్టం రాదు. రాకూడదు"

"నువ్వు రావద్దంటే రాదులేగాని ఇవాళెంతసేపు సాధన చేశావు? "

"రెండు మూడు గంటలు చేశాను. కాళ్ళు బాగానే కదుల్తున్నాయి. మెల్లగా చేతులు కూడా కదిలించగలిగితే చాలు.."

"తప్పకుండా కదిలిస్తావు. మాట్లాడటం వచ్చింది కదా. అలాగే చక్కగా నడుస్తావు. నడక వచ్చేక నాట్యం రాకుండా ఎలా వుంటుంది. సీడీప్లేయర్‌లోని పాటల సంగీతానికనుగుణంగా నువ్వెంతెక్కువ సాధన చేస్తే అంత త్వరగా ఫలితం వస్తుంది.."

"నరాల్లో చెప్పలేనంత బాధగా వుందండీ..."

"పంటి బిగువున భరించక తప్పదు. అప్పుడే నీ తపన, నీ ఆరాటం, నీ కృషి ఫలితాన్నిస్తాయి. నిరంతరం మనసుని ఉత్సాహపర్చుకుంటూ మనోబలంతో ఈ వ్యాధిని అధిగమించాలి. నువ్వు అధిగమిస్తావు. మళ్ళీ స్టేజిమీద చెంగుచెంగున ఎగుర్తూ మయూరిలా నాట్యం చేస్తావు.."

రుషి బంగారు భవిష్యత్తుని ఆమె కళ్ళ ముందు ఆవిష్కరిస్తోంటే కలల్లో తేలి ఆడుతోంది లక్ష్మి.

వారిద్దరి అన్యోన్యానురాగానికి ముగ్ధురాలైంది స్వప్నిక.

★ ★ ★

స్వప్నికకి కంపెనీలో చిన్న ప్రాజెక్ట్‌ని ఎలాట్ చేశారు.

ఆమెకెంతో న్యూనతగా అన్పించింది. డిమోషన్ ఇచ్చినట్టు భావించింది.

'తనేవిటో మళ్ళీ రుజువు చేసుకోవాలి' అనుకుందో లేదో పట్టుదల పెరిగింది.

టీం సభ్యుల్తో సమావేశమయ్యింది. తక్కువమందే. సగంమంది కొత్తవారే. అనుభవం లేనివారే.

ప్రాజెక్ట్ గురించి వివరించింది. రూట్ మేప్ వేసింది. ఒక్కొక్కరికీ వర్క్ ఎలాట్ చేసింది.

"మనకి టూ మంత్స్ టైమిచ్చారు. అంత టైం అవసరం లేదు. సిక్స్ వీక్స్‌లో కంప్లీట్ చేయొచ్చు. సో సిక్స్‌వీక్స్ మన డెడ్‌లైన్..." ఉత్సాహపరుస్తూ చెప్పింది.

లంచవర్లో కేంటీన్లో కలిశారు పాత టీం సభ్యులు.

"మీకు దక్కాల్సిన క్రెడిట్ వేరెవరికో వెళ్ళిపోయింది. కనీసం మిమ్మల్ని పార్టీకి కూడా పిలవకపోవడం దారుణం. రుషి గారు తప్ప ఒక్కరూ మీ పేరెత్తకపోవడం ఇంకా దారుణం" అని చెప్పి బాధపడ్డారు.

"ఓ షాకింగ్ న్యూస్ చెప్పనా? నన్నో ఇన్‌సిగ్నిఫికెంట్ ప్రాజెక్టుకి వేశారు" పేల

వంగా నవ్వింది స్వప్న.

"మిమ్మల్నెక్కడికో తీసుకుపోతామని అరచేతిలో స్వర్గం చూపించి కడకిలా సత్కరించారన్న మాట!"

"ప్రైవేట్ మేనేజ్‌మెంట్సుతో వచ్చిన చిక్కే ఇది. వాళ్ళకి గెలుపు గుర్రాలే కావాలి. అందుకు మనం అలుపూ సొలుపూ లేకుండా పరుగెడుతూనే వుండాలి. గెలుస్తూనే వుండాలి. కప్పులు తెస్తూనే వుండాలి. అలా చేస్తున్నంతవరకూ చక్కని ప్యాకేజీలిస్తారు. ప్రమోషన్లిస్తారు.. ఆన్‌సైట్‌కి పంపిస్తారు. అలసిపోయో, అనారోగ్యంవల్లో మనం పరుగెత్తలేకపోతే మనకోసం పింక్ స్లిప్స్ తయారుచేస్తారు. లేదా పాస్ట్ ఎక్స్‌పీరియన్సు వెరిఫై చేస్తున్నామని బెదిరించి మనంతట మనం రిజైన్ చేసి వెళ్ళిపోయేలా చేస్తారు. ఆ కారణం చూపి రావాల్సిన బెనిఫిట్లని తొక్కిపట్టేస్తారు. ఇదేమంటే నువ్వే రిజైన్ చేశావుగా అంటారు. అంతా మేనేజ్‌మెంట్ మాయ!"

"మీరేం వర్రీ కావద్దు. దీని బాబులాంటి ఆపర్చునిటీ మిమ్మల్ని వెదుక్కుంటూ వస్తుంది, చూడండి. ఎక్కడికెళ్ళినా మీ ప్రతిభకి పట్టాభిషేకం చేస్తారు" అన్నారు.

సాయంత్రం పని ముగించుకుని కంపెనీలోంచి బయట పడ్తోంటే రుషి వచ్చి కలిశాడు.

"మీ ఎస్సైన్‌మెంట్ గురించి తెలిసింది. సారీ. ఇర్రెస్పాన్సిబిలిటీ, ఇన్‌డిసిప్లిన్ వగైరా వగైరా అనుకుంటోంది మేనేజ్‌మెంట్. తుమ్మితే ఊడే ముక్కుల్లాంటివి మన జాబ్స్"

తుళ్ళిపడింది. "ఆ రకమైన ప్లాన్స్ కూడా వున్నాయంటారా? "

"సీ స్వప్నకా.. ప్రభుత్వ సర్వీసులో బ్యాంకుల్లో పరిశ్రమల్లో ఒక్కసారి చేరితే చాలు, పర్మినెంట్ అయినట్టే. వారికి జాబ్ సెక్యూరిటీ వుంది గనుక ఎంతో భద్రతగా ఫీలవుతారు. రేపు గురించెంతో భరోసాగా వుంటారు. ఐటీ, ఫైనాన్స్ కంపెనీలొచ్చేక ఎంప్లాయ్‌మెంట్ పొజిషన్ పూర్తిగా మారిపోయింది. ఎప్పుడవి వుంటాయో ఎప్పుడు బోర్డు తిప్పేస్తారో తెలీదు. నష్టాలొచ్చి ఆర్డర్లు రాక బిజినెస్ తగ్గి మనకి ఇంటిగుమ్మం చూపించొచ్చు. ఎప్పుడేం జరుగుతుందో తెలీని అభద్రతని మనం భరించక తప్పదు. రేపటిని దృష్టిలో పెట్టుకుని మనశక్తిని, ఫైనాన్స్‌ని ప్లాన్ చేసుకోవాలి"

"నా ఫ్రెండ్స్ చాలా కంపెనీల్లో వున్నారు. రెస్యూమె పంపిస్తాను సార్"

## కొత్తగాలి... 

**ఒకప్పుడు పెద్దగా పట్టించుకోని**
**ఇసుక రాసులు**
**ఇప్పుడు కనక రాసులై**
**రాజ్యమేలుతున్నాయి!**

– కొళ్ళ గోవిందరావు,
ఆముదాలవలస

"నాకొకటి మెయిల్ చెయ్. టీసీఎస్‌లో హెచ్చార్ తెలుసు. బెటర్ ఛాన్స్ వచ్చి తీరుతుంది. ఆల్ ద బెస్ట్..."

'జీవితంలో ఇంతకంటే పెద్ద దెబ్బే తిన్నాను. ఇదో లెక్కకాదు. డిప్రెస్ అవ్వను గాక అవ్వను' అనుకుంది.

★ ★ ★

స్వప్న అక్కా బావా వచ్చారు. వస్తూనే ఆరోగ్యం ఎలా వుందంటూ ఆరా తీశారు.

"బాగానే వుంది. ఈ వీక్‌లో సెట్ అయిపోతాన్లే. లేకపోతే డాక్టర్ని కలుస్తాను"

మావగారి వంక చూశాడు పరాంకుశం. ఆయనేదో సైగ చేశారు. తలపంకించాడు.

"నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకోవాలి స్వప్నీ. నిన్ను ఒప్పించడానికే మళ్ళీ వచ్చాం" స్వప్ని అక్క దీపిక అంది.

"నాకసలు పెళ్లే కాలేదు. మళ్ళీ పెళ్ళేంటి అక్కా" నవ్వుతూ అందిగాని అది నవ్వులా లేదు.

"పోనీ మొదటి పెళ్ళే అనుకో. వీలైన సంబంధం రెడీగా ఉంది"

"నా గురించి తెలిసిన వారెవరూ నన్ను చేసుకోడానికి సిద్ధపడరు"

"వితంతువులకు పెళ్లిళ్ళవ్వడం లేదూ? నువ్వు వారికన్నా తీసిపోయావా? "

బాధతో కమిలిపోయింది స్వప్ని మొహం. "నన్ను వితంతువుతో పోలుస్తున్నావన్న మాట"

"అహ... వూరికే... మీరు చెప్పండి..." అంది భర్తతో దీపిక.

"పెద్దవాళ్ళం. నీ మేలుకోరేవాళ్లం. మేం ఎందుకింతగా చెబుతున్నామో విను. ప్రతి మనిషికీ ఓ భద్రతని ఓ భరోసాని ఓ ఆలంబనని ఓ బాధ్యతని, లక్ష్యాన్ని, దిశని ఇచ్చే పెళ్ళి అత్యవసరం. తప్పని సరి" అన్నాడు.

"పాశ్చాత్య దేశాలవారు మన వివాహ, కుటుంబ వ్యవస్థల వంక ఆశగా ఎందుకు చూస్తున్నారో ఇప్పుడిప్పుడే నాకూ అర్థమవుతోంది"

స్వప్నిక మాటలకి విస్తుబోయారు. పిమ్మట సంబరపడ్డారు. ఇక పెళ్లికి అంగీకరించడం ఖాయం అనుకుని చిన్నగా నిట్టూర్చారు.

"ఇక నీ పెళ్ళికి ఏర్పాట్లు చేస్తాం..."

"పెళ్లికి పవిత్రత ముఖ్యం. నైతిక వర్తనం ముఖ్యం. ధర్మాచరణ ముఖ్యం. అవేవీ నాకు లేవుకదా!"

"కాలికేస్తే మెడకీ.. మెడకేస్తే కాలికీ వెయ్యాలని చూడకు. పవిత్రత అనేది మనస్సుకి సంబంధించింది. మరో దృష్టి మరో యావ లేకుండా జీవిత భాగస్వామికే అంకితమవడమే పవిత్రతంటే..."

ఆమె మాట్లాడలేదు. ఆలోచిస్తూండిపోయింది.

"మాట్లాడవేంటి? దేనిగురించి ఆలోచిస్తున్నావ్? "

"అనురాగ్"

అదిరిపడి చూశారంతా.

అది తనకి సంబంధించింది కాదన్నట్లు లోపలికెళ్లిపోయింది.

ల్యాప్‌టాప్ ఓపెన్ చేసింది.

బెంగళూరు ఫ్లయిట్‌కి వేకెంట్ పొజిషన్ ఏమిటో చూసింది. లక్కీగా ఖాళీలున్నాయి.

వెళ్లడానికీ అదేరోజున తిరిగి రావడానికీ ఆన్‌లైన్లో బుక్ చేసింది.

కంపెనీకెళ్తున్నానని చెప్పి తిన్నగా ఎయిర్‌పోర్టుకెళ్ళింది.

బెంగళూరు ఎయిర్‌పోర్టులో దిగి అనురాగ్‌కి ఫోన్ చేసింది స్వప్నిక. "నీ కంపెనీ ఎడ్రస్ చెప్పు"

అతడు చెప్పేడు. వెంటనే టాక్సీ ఎక్కింది.

కారు కంపెనీ గేటు ముందాగిందో లేదో గేటు దగ్గర నిరీక్షిస్తోన్న అనురాగ్ ముందుకొచ్చి విష్ చేశాడు.

"చాలా మారిపోయావు స్వప్నీ. సడన్‌గా చూసి వుంటే గుర్తుపట్టలేకపోదునసుకో. హెల్త్ పాడయ్యిందా వర్క్ ప్రెజరా? "

అతడికి జవాబివ్వకుండా "నువ్వు మాత్రం మారలేదు. సేమ్ ఓల్డ్ అనురాగ్"

మందహాసం చేశాడు. "ఏం పని మీదొచ్చావ్? "

"నిన్ను చూడాలన్పించింది"

షాక్ తిన్నాడు. అపనమ్మకంగా చూశాడు. పిమ్మట భుజాలు ష్రగ్ చేశాడు.

"కమాన్ స్వప్నీ..."

దగ్గర్లోని పార్కులోని పచ్చికలో చతికిల బడ్డారు.

"ఐ మిస్యూ అనురాగ్.."

సడన్‌గా అందామె. కళ్లల్లో తడిపొర కదిలింది. స్వరం కంపించింది.

"ఐ టూ..." గొణిగినట్టుగా అన్నాడు.

"మరి నన్ను చూట్టానికి రాలేదేం? ఫోన్ చెయ్యడానిక్కూడా మనస్సు రాలేదా? "

"అయామ్ ఇన్ డిఫరెంట్ సిచ్యుయేషన్. నీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు.."

"అదేమిటో నాకు తెలుసు, నువ్వు పెళ్లి చేసుకోబోతున్నావు"

చివ్వున తలెత్తాడు. అమితాశ్చర్యంతో చూశాడు. తలదించుకున్నాడు.

"నువ్వెందుకు చేసుకుంటున్నావు, ఏ పరిస్థితుల్లో చేసుకుంటున్నావు ఎవరి ఒత్తిడి వల్ల చేసుకుంటున్నావు- అని అడగడానికి రాలేదు. అన్నాళ్లు కలిసున్నాం. ఒకరంటే ఒకరికి ఇష్టం వుంది. ప్రేమ వుంది. కన్సర్న్ వుంది. అయినా అవేమీ మన అనుబంధాన్ని దృఢం చేయలేకపోయాయి. ఎందుకంటావు అనురాగ్? "

"అది టెంపరరీ అరేంజ్‌మెంట్, కమిట్‌మెంట్స్ లేని కలయిక. దాని ఆయుష్షు ఆర్నెల్లో ఏడాదో మోజు తీరే వరకునో, అంతే"

"కరెక్టుగా చెప్పావు. నేనేమిటో నీకు తెలిసింది. నీ గురించి నాకు తెలిసింది. ఇద్దరం ఒకరికొకరం బాగా అర్థమయ్యాం. అందుకు సహజీవనం- సారీ- సారీ - డేటింగ్ బాగా ఉపకరించింది. ఇప్పుడు నెక్ట్స్ స్టెప్ వేద్దాం, నీ గురించి నాకు కంప్లయింట్స్ లేవు. నా మీద నీకూ లేకపోతే మనం మ్యారేజ్ చేసుకుందాం అనురాగ్"

ఆర్తినీ ఆప్యాయతనీ అనురాగాన్నీ అనుకంపాన్నీ మిళితం చేసి అడిగింది.

## సెప్టెంబరు - 2013 చతుర ప్రవేశిక విజేతలు వీరే!

త్వరలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **నాపా మురళి**
   - పెద్ద హోతూరు, కర్నూలు జిల్లా
2. **లలిత దేవులపల్లి**
   - ఉయ్యూరు, కృష్ణా జిల్లా
3. **రామ్‌సోదర్ రెడ్డి**
   - సుర్బిర్యాల్, నిజామాబాద్ జిల్లా
4. **పాలెపు బుచ్చిరాజు**
   - వడోదర, గుజరాత్
5. **ఎం.వి.ఎస్. రామశేషు**
   - బ్రాడీపేట, గుంటూరు

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. సుమ | 6. సహదేవుడు |
| 2. ప్రభు | 7. మస్తాన్ |
| 3. లక్షరూపాయలు | 8. మాధవి |
| 4. స్కైలైన్ | 9. బ్రిటన్ |
| 5. స్వదేష్‌సింగ్ | 10. నరసింహం |

అప్రతిభుడై చూశాడు. నోట మాట రాలేదు.

"పెళ్లిలో హోమం చేస్తారు. అదెందుకో వివిధ ద్రవ్యాలను సమిధలుగా వెయ్యడమెందుకో ఇదివరకు తెలీదు. ఇప్పుడు తెలిసింది. అందులో వేసే ద్రవ్యాలేమిటో తెలుసా? మన గతం, మన అహం, నేను అనే భావం, మన తప్పొప్పులు, తప్పుడు కోరికలు, వాటన్నిట్నీ హోమంలో దహనం చేసి క్రొంగొత్త జీవితం ప్రారంభించాలన్న

మాట. ఇద్దరూ వేరు వేరు అన్న అభిప్రాయాన్ని వదిలేసి వధూవరులిద్దరూ కూడా మేం ఒక్కటి, ఒక్కటిగా వుంటాం, ఒక్కటై జీవితాంతం నడుస్తాం' అని ప్రమాణం చెయ్యడానికే కలిసి ఏడడుగులు వేసేది"

ఆమెలో కొత్తవ్యక్తి కన్పిస్తోంటే కొత్తగా చూశాడు. వింతగా చూశాడు.

"డేటింగ్ ముగిసింది. మనం పెళ్లితో ఒకటవుదాం. కొత్త జీవితం మొదలెడదాం. మనసా వాచా కర్మణా ఒక్కటై జీవిద్దాం, ఒక్కరుగా బతుకుదాం"

ఆశగా అంది. ఆర్తితో అంది. అనురాగ ధార వర్షిస్తూ అంది.

అతడు మౌనంగా వుండిపోయాడు.

"నేనిలా వచ్చి అడుగుతున్నందుకు అర్థిస్తున్నందుకు సిగ్గుపడటం లేదు. నీకు దాసోహమంటున్నానని భావించడం లేదు. ఎంచేతనంటే నువ్వు వేరు నేను వేరు అని నేననుకోవటం లేదు గనుక, ఇక హెచ్చుతగ్గులకూ యజమాని బానిస సంబంధాలకూ స్థానమే లేదు. నేను నీలో సగం నువ్వు నాలో సగం అని విశ్వసిస్తున్నప్పుడు ఎక్కువ తక్కువలేమిటి? త్రివేణి సంగమంలో గంగ యమున కలిసేక ఏది గంగో ఏది యమునో చెప్పలేం కదా? స్త్రీ పురుష సంగమమే కదా ఈ ప్రకృతి!"

ఆశ్చర్యంగా అభినందనపూర్వకంగా చూశాడు అనురాగ్, అదే సమయంలో ఇబ్బందిగా ఎంబ్రాస్సింగ్‌గా ఫీలయ్యాడు.

"మాట్లాడవేం అనురాగ్, నేను చెప్పింది తప్పా"

"కాదు. అక్షర సత్యం. కానీ... ఇలా సడన్‌గా వచ్చి లాస్ట్ మినిట్లో ఇలాంటి ట్విస్టు ఇస్తావని ఊహించలేదు. నాక్కొంచెం టైమివ్వు. నన్ను ఆలోచించుకోనీ"

"నీక్కావల్సినంత టైం తీసుకో. ఎన్ని కోణాల్లోంచి ఎన్నిరకాలుగా ఆలోచిస్తావో ఆలోచించు. నేన్నీ సహధర్మచారిణిగా అర్ధాంగిగా వుండటానికి సిద్ధంగా వున్నాను. నా బతుకూ భవితా నీ చేతుల్లో పెట్టడానికి రెడీగా వున్నాను. నువ్వేం నిర్ణయం తీసుకుంటావో నీఇష్టం"

వెళ్ళడానికుద్యుక్తురాలవుతూ లేచి నిలబడింది.

"వెళ్తువుగాన్లే"

"నీకవతల ఆఫీసుంది. నాకివతల ఫ్లయిట్ వుంది. బై అనురాగ్.."

ఆమె వెళ్తోంటే నిలబడి చూస్తుండిపోయాడు. అంతలో ఏమన్పించిందో పెద్ద పెద్ద అడుగులేసుకుంటూ వెళ్లి కలిశాడు.

"లంచ్ చేద్దాం పద" అంటూ హోటల్‌కి తీసుకెళ్లాడు.

చికెన్ బిర్యానీ ఆర్డరిచ్చి అన్నాడు "నీకిష్టం కదా. హైదరాబాద్ బిర్యానీ అంత రుచిగా వుండదు"

"నా ఇష్టాలింకా గుర్తున్నాయే"

"ఎలా మరచిపోగలను?" అనేసి నాలిక్కరచుకున్నాడు.

స్వప్నీ టాక్సీ ఎక్కబోతుంటే అన్నాడు "ఒన్ వీక్ టైమివ్వు..."

"ఇంకా ఎక్కువ తీసుకున్నా ఫర్లేదు. నేను వేరే స్థిరమైన జాబ్‌కి వీలైతే నైన్ టు సిక్స్ జాబ్‌కి ప్రయత్నిస్తాను అనురాగ్. శాలరీ తక్కువైనా సరే"

"ఎందుకలా?"

"ఒకటి ఉద్యోగభద్రత ఉంటుంది. రెండు ఫ్యామిలీకి ఎక్కువ టైము కేటాయించగలుగుతాను. మూడు ఐటీలో వున్నన్ని టెన్షన్లూ ఒత్తిళ్లూ వుండవు"

"మెచ్యూర్డ్‌గా ఆలోచిస్తున్నావు.."

"అనుభవం నేర్పిన పాఠాలు... బై... నీ డెసిషన్ కోసం నిరీక్షిస్తూంటా"

★ ★ ★

స్వప్నికకి ఎంతో వికారంగా వుంది. కడుపులో దేవుతున్నట్టుగా వుంది. కాఫీ

# మెక్‌డొనాల్డ్ వైఫల్యాలు!




అమెరికాలో మెక్‌డొనాల్డ్స్ అతిపెద్ద ఫాస్ట్ ఫుడ్ రెస్టారెంట్ చెయిన్ గల సంస్థ. మన దేశంలోనూ దీని శాఖలు ఉన్నాయి. పోటీని ఎదుర్కోవడానికి మెక్‌డొనాల్డ్స్ కొన్ని కొత్త వంటకాలను ప్రవేశ పెట్టి విఫలమైంది. జపాన్ ప్రజల కోసం మెక్‌గ్రేటిన్ క్రొకెట్ అనే బర్గర్‌ని పరిచయం చేసింది. కేబేజీ ఆకులో వేయించిన ష్రింప్‌ని, బంగాళా దుంపలను ఉంచి ఇచ్చేవారు. దీన్ని జపాన్ ప్రజలు తిరస్కరించారు. అలాగే మెక్‌పిజ్జాని అమెరికన్ ప్రజలు తిరగ్గొట్టారు. కారణం దాని రుచి చప్పగా ఉండటమే. వీటి తయారీ కోసం ఏర్పరచిన ఓవెన్‌లన్నీ వృథా అయ్యాయి. 1963లో హాలాబర్గర్‌ని పరిచయం చేసి దెబ్బ తిన్నారు. మెక్‌డొనాల్డ్స్ వినియోగదారుల్లో అధికశాతం రోమన్ కేథలిక్కులు. వారు శుక్రవారం మాంసం తినరు. వారికోసం బర్గర్‌లో ఆ రోజు మాంసం బదులు సన్నటి అనాస ముక్కని పెట్టి అమ్మడం ప్రారంభించారు. అదీ విఫలమైంది. మరో ప్రొడక్ట్ మెక్‌డిలైట్. రెండు భాగాలు గల ఇందులో కిందివైపు బ్రెడ్, మాంసం ఉంటుంది. పైభాగంలో టొమాటో ముక్కలు, పచ్చడి, ఛీజ్, ఆకులు, సాసెస్ ఉంటాయి.




తినడానికి ముందు ఈ రెంటినీ కలుపుకోవాలి. దీన్ని కస్టమర్లు ఇష్టపడకపోవడంతో ఇది కూడా నిలిచిపోయింది. విఫలమైన వారి మరో ప్రొడక్ట్ ఆర్చ్ డీలక్స్. అయితే దీనినుంచి సరైన లాభాలు రాకపోవడంతో వారే ఆపేసారు. కారణం ఇది పెద్దవాళ్లకి ఉద్దేశించిన బర్గర్. పిల్లలతో వచ్చే పెద్దలు తమ కోసం ప్రత్యేకంగా దాన్ని కొనడానికి ఇష్టపడేవారు కాదు. మెక్ లోబ్‌స్టర్ మరో విఫల తయారీ. దీని ధర 5.99 డాలర్లు. అంత ధర పెట్టి కొనడానికి ఇష్టపడకపోవడంతో ఇదీ మూలనపడింది. ఆఫ్రికా ప్రజల కోసం మెక్ ఆఫ్రికాని విడుదల చేసారు. ఆఫ్రికాలో తీవ్ర క్షామానంతరం దీన్ని పరిచయం చేయడంతో, ప్రకటనలతో ప్రచారం సరిగ్గా చేయకపోవడంతో ఇది కూడా సఫలం కాలేదు. మెక్‌లీన్ డీలక్స్‌ను సన్నబడేవారి కోసం తయారు చేసారు. అయితే దీని రుచి ఘోరంగా ఉండటంతో ప్రజలు కొనేవారు కాదు. అయితే నేటికీ బిగ్‌మెక్, క్వార్టర్ పౌండర్ విత్ ఛీజ్, ఫిల్లెట్ ఓ ఫిష్, ఛీజ్ బర్గర్లు, ఫ్రెంచ్ ఫ్రైస్ మొదలైనవి మెక్‌డొనాల్డ్‌లోని టాప్‌సెల్లర్‌గా ఉండటం విశేషం.

త్రాగిన వెంటనే వాంతి అయిపోయింది.

నీరసంగా అంది "నా హెల్త్‌లో తేడా వచ్చింది మమ్మీ. అప్పుడు ఆసుపత్రిలో హైడోస్ వాడారో ఏమో... గత ఇరవై రోజుల్నుంచీ ఇంచుమించు ఇలాగే వుంటోంది. ఇవాళ డాక్టర్ని కలుస్తాను..."

"అవసరం లేదు తల్లీ..."

"అవసరం లేదా? నేనెంతో అనీజీగా అన్‌రెస్ట్‌గా ఫీలవుతోంటే...!"

"అది కాదమ్మా. సంగతేంటంటే... నువ్వు నీళ్ళోసుకున్నావు..." రేవతి మెల్లగా చెప్పింది.

సంభ్రమానికి లోనైంది. ఆశ్చర్యం ఆనందం అపనమ్మకం ముప్పేటగా దాడి చెయ్యగా విభిన్న భావోద్వేగాలతో ఉక్కిరిబిక్కిరయ్యింది.

"నువ్వు చెబుతోంది నిజమేనా? నిజంగానే?"

"ఇది అబద్ధమాడే విషయమా.. ఆసుపత్రిలో చేరినప్పుడే డాక్టర్లు నిర్ధారించారు"

"మరిన్నాళ్ళూ నాకు చెప్పకుండా ఎందుకు దాచారు? "

"అసలే అప్‌సెట్ అయివున్నావు. ఇది తెలిస్తే ఎలా రియాక్టవుతావోనని భయపడ్డాం స్వప్నీ...

"భలే చిత్రంగా వుంది. నాకు నెల తప్పిన సంగతి నాకే తెలీదు. ఎవరైనా వింటే నవ్విపోరూ!" అనురాగ్ దూరమయ్యాడన్న టెన్షన్లో పడి పీరియడ్స్ వచ్చింది లేనిదీ పట్టించుకోనే లేదు!"

చిత్రానుభూతికి లోనవుతూ పొట్ట నిమురుకొంది.

"ఇప్పుడిప్పుడే సమాజరీతుల్ని అర్థం చేసుకుంటున్న నా కడుపులో చిన్ని బిడ్డ ఊపిరి పోసుకుంది. ఎంత చిత్రమో చూడు మమ్మీ.."

"చిత్రమే మరి.." బాధగా అంది తల్లి.

ఉత్సాహం ఆనందం ఉత్తుంగతరంగాలై స్వప్నిని ముంచెత్తసాగాయి. శరీరం ఈకకన్నా తేలికైపోతోంది. అపురూపమైనదేదో సాధించినట్టు వుంది.

తనలో తనే మురిసిపోతూంటే అనురాగ్ గుర్తొచ్చాడు. వెంటనే ఫోన్ చేసింది.

"గుడ్ న్యూస్ అనురాగ్. నీ రక్తం నా రక్తం కలిసి నా కడుపులో బిడ్డగా ప్రాణం పోసుకుంది"

అతడి ప్రతిస్పందన వినకుండానే లైన్ కట్ చేసింది.

మరి రెండు నిమిషాలకి... ఓ థాట్ వచ్చి మళ్లీ ఫోన్ చేసింది "మన అనుబంధానికి ప్రత్యక్ష సాక్ష్యం ఈ బిడ్డ అన్చెప్పి బ్లాక్ మెయిలింగ్‌కి పాల్పడను. చెట్టుకి కాయ భారం కాదు. నువ్వు స్వేచ్ఛగా నిర్ణయం తీసుకోవచ్చు.."

"అతడికెందుకు చెప్పేవే. చేజేతులా నీ జీవితాన్ని సర్వనాశనం చేసుకుంటావా పాపిష్టిదానా" ఏడ్చేస్తూ తిట్టింది రేవతి.

ర్రమాన్పడి చూసింది స్వప్ని. "అలా మాట్లాడతావేంటి మమ్మీ. మొన్న గాయత్రికి సీమంతం చేస్తున్నారని సంబరంగా చెప్పేవు. ఇవాళ నేను గర్భం దాలిస్తే ఈసడిస్తూ మాట్లాడుతున్నావు. నీకేమైంది? "

"నాకేం.. గుమ్మటంలా బాగానే వున్నాను. నీ నెత్తి మీదకే అనర్థం వచ్చిపడిందే తల్లీ. గాయత్రికీ నీకూ సాపత్యమేంటే? "

"ఇద్దరమూ గర్భం దాల్చాం"

"అయినా రెంటికీ పోలికే లేదే. ఆ అమ్మాయికి పెళ్లయ్యింది, నీకు కాలేదు. ఆమె కడుపున పుట్టినవాడు రాముడవుతాడు. నీకు పుట్టినవాడు కర్ణుడవుతాడు" చీరకొంగు నోట్లో కుక్కుకుని ఏడ్వసాగింది.

దిమ్మెరబోయింది. పెదాలు కంపిస్తున్నాయి. ఏదో చెప్పాలనుకొంటోంది గాని శబ్దం బయటికి రావట్లేదు.

"గుండెరాయి చేసుకోక తప్పదమ్మా. ఎంతో తెలివైనదానివి. ఎంతో ఎదగాల్సినంత చురుకైనదానివి. నీకే ఇన్ని కష్టాలెందుకొస్తున్నాయో అర్థం కావట్లేదు. మేమంతా బాగా ఆలోచించి అన్ని విషయాలూ కూలంకషంగా చర్చించి ఒక అభిప్రాయానికొచ్చాం.." ఆగాడు తండ్రి.

చివ్వున తలెత్తి ఏమిటన్నట్టు చూసింది.

"గుట్టు చప్పుడు కాకుండా ఎబార్షన్ చేయించేద్దాం.."

"డాడీ! కీచుగా అరిచింది. "భ్రూణహత్య మహాపాపం... నా కడుపులో ఓ బుల్లి ప్రాణి ఊపిరిపోసుకుంది. నేనిప్పుడు తల్లిని. నా చేతుల్తో శిశుహత్య చెయ్యమంటారా? నా తరం కాదు. నేనేమైపోయినా ఫర్లేదు. అలాంటి ఘోరం నేను చెయ్యను. చెయ్యలేను!" సన్నగా ఏడ్చింది.

"మొండితనం అన్ని విషయాల్లోనూ పనికిరాదు. ఈ సంఘం సత్సంతానాన్నే ఆదరిస్తుంది. గౌరవిస్తుంది. అక్రమ సంతానాన్ని ఈసడిస్తుంది. చిన్నచూపు

చూస్తుంది. నిర్లక్ష్యం చేస్తుంది. తల్లిదండ్రులిద్దరి ప్రేమ దక్కని పిల్లలు కసితో, ద్వేషంతో పెరుగుతారు. అపరాధ భావనతో ఎదుగుతారు. మోసగాళ్ళుగా, నేరగాళ్లుగా మారతారు. చదువుకున్నదానివి. అలాటి ఓ నేరగాడ్ని సమాజానికందిస్తావా చెప్పు? " ప్రశ్నించారు సుబ్బారావు.

"లేదు లేదు. నా బిడ్డని అలా కానివ్వను. ప్రేమతో పెంచుతాను. ప్రేమ పోసి పెంచుతాను. ప్రేమగా పెంచుతాను. ప్రేమ పంచేలా పెంచుతాను"

"మరి నీ సంగతేంటి? నీ బతుకు కుక్కలు చింపిన విస్తరవ్వుద్ది తెలుసా? నిన్ను కన్నందుకు నీ బతుకు చూస్తూ మమ్మల్ని ఏడవమని శపిస్తావా చెప్పు? "

"మమ్మీ! నువ్వూ తల్లివే కదా అర్థం చేసుకో ప్లీజ్.."

"అర్థం చేసుకున్న తల్లిని గనుకే నా బిడ్డ క్షేమం కోసం పాకులాడుతున్నాను"

"నా బిడ్డని బలిపెట్టా? "

"నోర్ముయ్. అదో బిడ్డ. నువ్వో తల్లివి! జరిగిందానికి నలుగురికీ మొఖం చూపించలేక సిగ్గుతో చచ్చిపోతున్నాం. మళ్లీ ఈ పెంట మా నెత్తిమీదకు తెచ్చి మమ్మల్ని నవ్వులపాలు చేస్తావా? నీకు చీమూ నెత్తురూ లేవేంటి? "

వెంటనే ఆవేదన, ఆక్రోశంతో రెచ్చిపోతున్న భార్యకి నచ్చచెప్పి గదిలోకి పంపేశారు సుబ్బారావు. ఏడుస్తూ వెళ్లిపోయిందావిడ.

"నేన్చెప్పేది జాగ్రత్తగా విని బాగా ఆలోచించు స్వప్నీ. అనురాగ్ మంచి కుర్రాడు. మనస్సు మారి వెదుక్కుంటూ వస్తాడని మాకింకా ఆశగా వుంది. అతడు రావడానికి సిద్ధపడ్డా నువ్విలా బిడ్డ తల్లివి కాబోతున్నావని తెలిస్తే వెనుకంజ వెయ్యొచ్చు.."

"నేనేంటో నా క్యారెక్టరేంటో అనురాగ్‌కి తెలుసు"

"తెలియడం వేరు, నమ్మడం వేరు. సీతా సాధ్వికే నీలాపనిందలు తప్పలేదు. సరే - నీ మాటే ఒప్పుకుంటాను. అనురాగ్ నమ్ముతాడు. కాని అతడి తల్లిదండ్రులు నమ్మాలని లేదుకదా. మరొకర్తో పెళ్లి ఖాయం చేసుకున్నారు గనుక నీ మీద లేనిపోని అభాండాలేసి తప్పించుకోవచ్చు. అందుకాస్కారం ఇవ్వడం ఎందుకు చెప్పు? కాటికి కాళ్లు చాచుకున్న వాళ్లం. మా గురించి మాకు దిగుల్లేదు. ఎంతో భవిష్యత్తున్న నీ గురించే.." కంఠం రుద్ధమవడంతో ఆపైన మాట్లాడలేకపోయారు సుబ్బారావు.

"ఇది నా సమస్య. నన్ను పరిష్కరించుకోనీ డాడీ. ఇప్పటికే మిమ్మల్ని క్షోభపెట్టాను. ఇక నిశ్చింతగా వుండండి.."

స్వప్ని మాటలకు ఉలిక్కిపడి చూశారు ఆ కన్నతండ్రి. ఆ చూపుల్నిండా భయమే వుంది!




అనురాగ్ కోరిన గడువు పూర్తయ్యింది. ఎలాంటి సమాధానమూ రాలేదు.

'అతడు పారిపోయినట్టే' అనుకుంది. శరీరంలోని సగభాగాన్ని కోసి వేసినట్టుగా విలవిల్లాడింది.

'వివాహానికి పూర్వమే శృంగారంలో పాల్గొన్న స్త్రీ అంటే ఏ పురుషుడికీ గౌరవం

వుండదు. ఆఖరికి ఆమెతో శృంగారం నెరిపిన వాడిక్కూడా. ఆకు ముల్లు సామెత ఈనాటికీ వర్తిస్తుంది'- అనుకుంది.

మెదడులోంచి అతడి తాలూకు జ్ఞాపకాలని తుడిచేసి ముందుకి సాగాలనుకుంది.

బ్యాంకుల్లో ఎన్నో ఖాళీలున్నాయనీ, వేలాదిమంది రిటైరవబోతున్నారనీ తెలిసింది. పనివేళలు, జీతభత్యాలు, ప్రమోషన్ విధానం గురించి నెట్‌లో సెర్చి చేసింది.

"నాకిదే సూటబుల్" అనుకుని బ్యాంకుల్లో ప్రొబేషనరీ ఆఫీసర్ పోస్టుకి దరఖాస్తు చేసింది. ఆ పరీక్షలకు కావాల్సిన మెటీరియల్‌ని సేకరించడంలో బిజీ అయిపోయింది.

★ ★ ★

స్వప్నికి నాలుగో నెల వచ్చింది.

ఆమె తల్లిదండ్రుల ఆందోళన రోజురోజుకి అధికమవుతోంది. మరి తట్టుకోలేక పరాంకుశానికి ఫోన్‌చేసి తమగోడు వెళ్లబోసుకున్నారు.

వెంటనే అతడామెకి ఫోన్ చేశాడు.

"ఇవతల మేం నీకు పెళ్లి సంబంధాలు చూస్తున్నాం. నువ్వా గర్భాన్ని వుంచుకోవటం బావోలేదు. ఇప్పటికే నీ ఇమేజ్ డామేజ్ అయ్యింది. ఈ సంగతి కూడా తెలిస్తే ఎవరూ ముందుకురారు. అమ్మాయి కావాలనుకుంటారు గాని బిడ్డ తల్లిని కోరుకోరు. ఈ కొత్త బంధం నీకెప్పటికీ గుదిబండే"

"అవన్నీ ఆలోచించాను. ప్రకృతి ధర్మాన్ని నిర్వర్తించాలనే నిర్ణయించుకున్నాను. సృష్టి కర్తృత్వాన్ని చేజేతులా జార్చుకోను" స్థిరస్వరంతో చెప్పింది స్వప్ని.

"సెంటిమెంటు వుంటుందనుకో. కాని బిడ్డ బాధ్యత పంచుకోడానికి అతగాడు రాడు. చట్టం కూడా నీకు సపోర్టు వస్తుందనుకోను. పెళ్లి కాలేదన్నదే పెద్ద అవరోధమై కూర్చుంటుంది"

"ఈ బాధ్యతని ఇంకొకరి తలకెత్తాలనుకోవటం లేదు బావా. నన్ను క్షమించండి"

"క్షమించడం సంగతలా వుంచు. నీ జీవితమంతా ఒంటరిగా వుండిపోవాల్సి వస్తుందేమోనని మా భయం!"

"రోట్లో తలదూర్చేక రోకలి పోటుకి వెరవకూడదని చిన్నప్పుడు చదివేను"

"ఇప్పుడు తల బయటికి తీసే అవకాశం వుంది. నువ్వు వినటం లేదంతే. అదీగాక ప్రతిబిడ్డా తన పుట్టుపూర్వోత్తరాల గురించి, సంస్కృతి - వారసత్వం గురించి, జాతి ఉన్నతి గురించి గర్వించాలని చూస్తుంది. తాను తన తల్లిదండ్రుల అక్రమ సంబంధం ఫలితమన్న ముద్రని శిలువలా జీవితాంతం మోయాలని ఎంతమాత్రం అనుకోదు. ఇది బిడ్డ మానసిక స్థితిమీద ఆలోచనలమీద ఎంత వ్యతిరేక ప్రభావం చూపుతుందో నువ్వాలోచించకపోవడం శోచనీయం"

"నాకింక ఆలోచించగల శక్తి లేదు. అలసిపోయాను. ఓడిపోయాను. మాయలేడి లాంటి జీవన విధానం వెంట పరుగెత్తి నష్టపోయాను. భ్రష్టుపట్టిపోయాను. దానికి శిక్ష అనుభవించనీండి. నా గురించి మీరెవరూ బెంగపెట్టుకోవద్దు. ప్లీజ్!"

"పోనీ అనురాగ్‌తో మాట్లాడనా? అతడు నిన్ను నమ్ముతాడు కదా?"

"తెలీదు. ఇందుకే కాబోలు 'తల్లి సత్యం.. తండ్రి నమ్మకం' అనే సామెత వచ్చింది"

★ ★ ★

శృతి పిలుస్తూ వస్తోంటే తప్పించుకోవాలని చూసింది స్వప్నిక. సాధ్యం కాలేదు.

"నన్ను చూసి పారిపోతున్నావు కదూ?"

"అహహ.. అదేం కాదుగాని ఎలా వున్నావ్"

"ఫైన్. ట్వంటీయత్‌న నా మ్యారేజ్..



స్వాగత్‌లో. నువ్వు తప్పకుండా రావాలి" హ్యాండ్ బ్యాగ్‌లోంచి ఖరీదైన వెడ్డింగ్ కార్డ్ తీసిస్తూ అంది.

"నీ గురించంతా అతడికి తెలుసా? "

"నా చదువు, ఉద్యోగం, హయిటు, వెయిటు, నక్షత్రం, రాశి తెలుసు"

"నీ బ్యాక్‌గ్రౌండ్ సంగతి...? "

"అది తెలీదుగాని ఆస్తిపాస్తులూ బ్యాంక్ బ్యాలెన్సూ తెలుసు" నవ్వుతూ చెప్పింది.

"నీ తిరుగుళ్ల గురించి రేపెప్పుడైనా తెలిస్తే? "

"అవన్నీ ఎవరు పట్టించుకుంటారు పిచ్చీ. అతడు మూడేళ్ల నుండి ఒంటరిగా అమెరికాలో వుంటున్నాడు. మడిగట్టుకుని వున్నాడని గ్యారెంటీ ఏమిటి? "

"వాదన కోసం అడగట్లేదు. ఇది వరకు ఒకర్తో తిరిగి ఇప్పుడు ఇంకొకరితో పడుకోడానికి.. జుగుప్సగా అన్పించట్లేదూ? నిజం చెప్పు? "

"దానికీ దీనికీ కంపేరిజనేమిటి? అది

అదే ఇది ఇదే. అది యౌవనపు ఉబలాటంతో కోరికల వేడితో కాలిపోతూ దగ్గరవడం. ఇది ప్రేమతో కలవడం. ఆ అనుభవం జలపాత స్నానం. ఈ అనుభవం నదీ స్నానం.." కిలకిలా నవ్వింది.

"నువ్వు మరీ ఇంత అమాయకురాలివనుకోలేదు. బీసీ కాలంలోలా ఆలోచించకు. ఇది ట్వంటీఫస్ట్ సెంచురీ. పెళ్లికి ముందెలా వున్నా పెళ్లయ్యాక ఒకరికొకరు ఫెయిత్‌ఫుల్‌గా వుంటే చాలు లైఫంతా హ్యాపీ" అంది తిరిగి తనే.

"నువ్వో ఇంటిదానివవుతున్నందుకు చాలా సంతోషంగా వుంది. సో నీ లైఫ్ సెటిలైనట్టే"

"ఎన్ని హోటల్స్‌లో ఎన్ని రకాల ఫుడ్స్ తిన్నా కడకి ఇంటిఫుడ్‌కి సెటిలవ్వాల్సిందేనే. లేకపోతే హెల్త్ పాడవ్వుద్ది" కళ్ళు చిట్లించి నవ్వుతూ స్వప్నిని గిచ్చింది.

"నీ మాటల తీరు మారలేదు"

"నీకో సంగతి చెప్పనా? నా మాటల తీరూ, నా ఫాస్ట్‌నెస్ నచ్చే నా వుడ్ బీ ఓకే అన్నాడు. ప్రీమారిటల్ సెక్స్ తప్పేమో గాని నేరం కాదు" అంటూనే అడిగింది "నీకూ అనురాగ్‌కీ ఎందుకు చెడింది? "

"జస్ట్ లైక్ దట్. నో పర్టిక్యులర్ రీజన్.."

"అతడు నిన్నిలా డిచ్ చేస్తాడనుకోలేదు"

"అతడు పెళ్లి చేసుకుంటున్నాడు. నేను కేరీయింగ్..."

మూర్ఛపోబోయింది శృతి. "నువ్వు డేరింగువో మూర్ఖురాలివో తెలీట్లేదు..."

జీవంలేని నవ్వు స్వప్నిక పెదాలమీద కదిలింది!

★ ★ ★

గాయత్రి ఆడపిల్లకి జన్మనిచ్చిందని తెలిసింది.

'జస్ట్ బోర్న్ బేబీ' కిట్ కొనుక్కొని ఆమె ఇంటికెళ్ళింది స్వప్నిక. ఎర్రగా వున్న బిడ్డని చూసి మురిసిపోయింది.

"నీ నోట్లోంచి వూడిపడినట్టుంది. నుదురు, గడ్డం సతీష్‌వే..." తేరిపార చూస్తూ అంది.

సతీష్ రాగా అతడ్నీ అభినందించింది. అతడ్తో వచ్చినతన్ని "మా పిన్నిగారబ్బాయి రాంబాబు" అంటూ పరిచయం చేసింది.

"మీరేం చేస్తున్నారు? " స్వప్ని అడిగింది.

"కాలేజీ లెక్చరర్ని.."

"హాయైన జాబ్. చీకూచింతా వుండదు"

"మీ అంత కాకపోయినా మాకూ ఒత్తిడి వుంటోందిలెండి. కార్పొరేట్ కాలేజీ కదా. జీతాలు బాగా ఇస్తారు. బాగా పిండుతారు. సిలబస్ పూర్తయ్యేవరకూ పరుగెత్తిస్తారు. ఆ తర్వాత స్టడీ అవర్లు, ర్యాంక్ వచ్చే అవకాశమున్న వారిని స్పెషల్‌గా తోమడం... ఇదంతా ఒక ఎత్తు వారం వారం పిల్లలు మా గురించి ఇచ్చే ఫీడ్ బ్యాక్ ఇంకో ఎత్తు. అది బాగోకపోతే మాకు స్పెషల్ క్లాసే! అంచేత అటు మేనేజ్‌మెంటుతోనూ ఇటు స్టూడెంట్సుతోనూ మంచిగా వుంటూ నొప్పింపక తానొవ్వక అన్నట్టు వుండాలి"

"రాంబాబన్నయ్య రచయిత కూడానే. చాలా కథలు రాశాడు" వెనక నుంచి అంది గాయత్రి.

"హమ్మో. అయితే మీతో జాగ్రత్తగా వుండాలి"

"మేమేం పాపం చేశాం? "

"కవులూ రచయితలూ వట్టి హిపోక్రాట్స్. పైకొకటి, లోపలింకొకటి. ఒక రకంగా రాస్తారు. ఇంకోరకంగా చేస్తారు. స్టేజిమీద స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ అస్తిత్వం అంటూ ఉపన్యాసాలిస్తారు. ఇంట్లో 'ఒసే తువ్వాలందుకో' అని అరుస్తారు"

"హతోస్మి! మా రచయితల మీద

మీకింత 'మంచి' అభిప్రాయం వుండటం మా దురదృష్టం. మీరేం చేస్తుంటారు- ఐ మీన్ హాబీలు"

"తినడం ల్యాప్‌టాప్‌తో కుస్తీపట్టడం"

"సాఫ్ట్‌వేర్ వాళ్లంతా నెట్ ఎడిక్ట్‌లే"

"రాంబాబు భార్య ఇటీవలే యాక్సిడెంట్లో చనిపోయింది. మళ్ళీ పెళ్లి చేసుకోవాలని చూస్తున్నాడు. నీ గురించి గాయత్రి చెప్పింది. పాజిటివ్‌గా రెస్పాండ్ అయ్యాడు. ఆ దృష్టితో పర్సనల్ విషయాలు ఒకరికొకరు తెలుసుకుంటే మంచిది. ఇందుకోసమే గాయత్రి నీకు ఫోన్ చేద్దామనుకుంది. అనుకోకుండా నువ్వే వచ్చావు" అన్నాడు సతీష్.

స్వప్ని మోము కందగడ్డ అయ్యింది. సంగతి తెలిసివుంటే వచ్చేదే కాదు. ఇప్పుడర్థాంతరంగా వెళ్లిపోతే గాయత్రి ఫీలవుతుంది.

"ఉన్న విషయం చెబుతున్నాను. నా భార్య చాలా మంచిది. అందంగా వుండేది. స్కూటర్ ప్రమాదంలో చనిపోయింది. ఆమెని మరచిపోవడం కష్టం. కాని మా బాబు గురించి తప్పటం లేదు"

"మీకు బాబున్నాడా? "

"ఏడాది వయస్సు. వాడంటే మాకు చాలా ఎటాచ్‌మెంట్. వాడి గురించే మళ్లీ పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. వాడ్ని వాళ్లమ్మలాగా చూసుకొనే అమ్మాయి కోసం చూస్తున్నాను. కన్నతల్లిని మరిపించాలి. పెద్ద మనస్సు వుంటే తప్ప అది సాధ్యం కాదు..."

"మీది పెద్ద మనస్సా? "

సూటిగా ప్రశ్నించేసరికి తడబడ్డాడతడు.

"కాబట్టే కదా మీ గురించి తెలిసి కూడా మిమ్మల్ని చేసుకోడానికి సిద్ధపడ్డాను"

"నేనిప్పుడు కేరీయింగ్. ఇప్పుడు కూడా సిద్ధపడతారా? "

అతడి మొఖాన కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

గాయత్రీ సతీష్ అవాక్కై చూశారు.

"మీ బిడ్డకి కన్నతల్లిని కాగలను. నా బిడ్డకి కనీసం పెంపుడు తండ్రి కాగలరా? "

"నాకంత పెద్దమనస్సు లేదు" విసురుగా లేచెళ్ళిపోయాడు.

★ ★ ★

'నాంచారయ్య శక్తి పూజ చేస్తాడు. దుష్టగ్రహాల స్థితి స్థానాలను మారుస్తాడు. క్షుద్రశక్తుల్ని పారద్రోలతాడు. దీర్ఘరోగాల్ని మటుమాయం చేస్తాడు. వాస్తు చూస్తాడు. దశ మార్చేస్తాడు' - ఇదీ సామాన్యుల అభిప్రాయం.

అతడి గురించి ప్రక్కింటి రమణి ఎప్పట్నుంచో చెబుతోంది. అతడ్ని కలిస్తే సర్వ కష్టాలూ అరిష్టాలూ మాయమవుతాయని సుబ్బారావు దంపతుల చెవినిల్లు కట్టుకుని పోరింది.

స్వప్నిక ఈ కొత్త ఫ్లాట్‌కి మారేకనే కష్టాలు మొదలయ్యాయని వారిద్దరూ గాఢంగా విశ్వసించారు.

గృహదోషమే కాదు, దుష్టశక్తులు ఆవహించాయన్నాడు. ఆమెని మరింత పతనం చేసిగాని శాంతించవన్నాడు. ఇంటి కొచ్చి అన్నీ పరిశీలిస్తానన్నాడు. మూర్తి జుల్లో అవసరమైనవన్నీ చేసి ఇంట్లో, ఆమె జీవితంలో శాంతి నెలకొల్పుతానని నమ్మ

## కొత్తగాలి...

**టెలివిజన్ సదావీక్షణం**
**వెన్నునొప్పి తక్షణం**
**కంటి చూపు తగ్గడం**
**ఊబకాయం పెరగడం**

– ఏకా లలితాపరమేశ్వరి,
మిర్యాలగూడ

కంగా చెప్పేడు. పిమ్మట అదే ఇంట్లో శుభ కార్యం చేస్తారని నమ్మబలికాడు.

సుబ్బారావు దంపతులు పరమానంద పడిపోయారు.

అతడొచ్చి ఇల్లంతా కలియతిరిగాడు. కళ్ళతో కొలతలేశాడు. లెక్కలేశాడు. కూర్చుని ఏవో పుస్తకాలు తిరగేశాడు. గ్రహస్థితులు లెక్కగట్టాడు.

"ఇదంతా వాస్తు పురుషుడి ప్రభావమే. వాస్తు పరమ చండాలంగా వుంది. తక్షణం ఇంట్లోంచి మారిపోకపోతే దుష్టప్ర భావం అధికమై తల్లి ప్రాణానికే ముప్పు రావచ్చు" గంభీర స్వరంతో అన్నాడు నాంచారయ్య.

దిక్కుతోచలేదు సుబ్బారావుకీ అతడి భార్యకీ.

"ఇది స్వంతిల్లు. ఇప్పటికిప్పుడు ఎక్కడికి పోగలరు. చిన్నా చితకా మార్పులైతే చేసు కోగలరు. మీరే ఇంకోదారి చూపాలి..." వేడిపాలు తెచ్చిస్తూ అంది రమణి.

పాలు తాగేక కూల్ అయ్యాడు. మళ్ళీ ఇల్లంతా పరిశీలించాడు.

స్టౌ ఓ పక్కకి జరపమన్నాడు. బీరు వాని ఇంకో మూలకి మార్చమన్నాడు. సోఫాలు టీవీ అరేంజ్‌మెంటు మార్చి తీరాల్సిందే అన్నాడు. ఇలాటివే మరికొన్ని సూచనలు చేశాడు.

శక్తిపీఠంలో నవగ్రహ పూజచేసి యంత్రాన్నిస్తానన్నాడు. దాన్ని పూజా మందిరంలో వుంచి రోజూ పూజ చెయ్యా లన్నాడు. సర్వభూత శాంతి ప్రత్యేకంగా చేస్తానన్నాడు.

"ఏమేం చెయ్యాలో అన్నీ చెయ్యండి. మా అమ్మాయి ఆరోగ్యంగా ఆనందంగా వుండాలి. ఈ ఇంట బాజాలు మోగాలి. మొత్తం ఎంతవుతుందో చెప్పండి"

అతడేవో లెక్కలేసుకున్నాడు కళ్ళు మూసుకుని.

"పదివేల ఒక్క రూపాయి అవుతుంది. దశ మారకపోతే నన్నడగండి. ఇలాటివి ఇప్పటికి ఇన్ని చేశాను" అంటూ తలమీ దున్న కాసిని వెంట్రుకలూ చూపించాడు. "అంతా సుఖసంతోషాలతో జీవిస్తున్నారు" అన్నాడు మళ్ళీ.

సుబ్బారావు దంపతులు తర్జనభర్జన పడుతోంటే "డబ్బుకోసం చూడొద్దు, శుభం త్వరగా జరగాలని కోరుకోండి.." అంది రమణి.

వెయ్యి రూపాయలిచ్చారు. అసంతృప్తిగా చూశాడు. "రేపొస్తారుగా"

అతడ్ని సాగనంపుతోంటే వచ్చింది స్వప్నిక.

"ఈ తతంగమంతా ఏమిటి డాడీ?" ఇంట్లోకెళ్తూ అడిగింది.

"ఏదో మామూలు వ్యవహారంగాని నువ్వప్పుడే వచ్చేశావేంటి?"

"ఒంట్లో బాగోలేదు. నడుంనొప్పి ఎక్కు వగా వుంది. కడుపులోని బిడ్డ కదుల్తు న్నట్టు... అనీజీగా వుంది"

ముచ్చెమటలు పోశాయి ఆమెతల్లికి. "అయ్యో అయ్యో అలాగా? ఆయన చెప్పనే చెప్పేరు. ఆలస్యం చేస్తే ప్రాణాలకి ముప్పని"

"ఎవరు చెప్పేరు? ఇందాకొచ్చినతనా?"

"వాస్తుదోషం వుందిట స్వప్నీ. మన మేదో అనుకుంటాంగాని వాస్తు ప్రభావం ఎక్కువగానే వుంటుంది. దిశమారితే దశ మారుతుందంటారందుకే..."

"అలా ఎందుకన్నారో చెప్పనా డాడీ? మనం నడుస్తోన్న దారి పయనిస్తోన్న మార్గం సరైన ఫలితాలివ్వకపోతే లేక వ్యతిరేక ఫలితాలొస్తోంటే మొండిగా అదే దారిలో వెళ్ళకూడదు. పునరాలోచన చేసు కోవాలి. అవసరమైతే దిశమార్చుకోవాలి. ఆలోచనలూ అభిప్రాయాలూ మార్చుకో వాలి. వీలుంటే లక్ష్య సాధనా మార్గాన్నీ

మార్చుకోవాలి. అంటే దిశ మారినట్టు. అప్పుడు దశ తిరుగుతుంది. ఉన్నత స్థితికి స్థాయికి చేరుకోగల్గుతారు"

ఊపిరి పీల్చుకోడానికా అన్నట్టు ఆగి అంది స్వప్నిక- "నేను చేసిందదే డాడీ. నా మార్గం నన్ను అశాంతికి, అభద్రతకి , ఆందోళనకి, అవహేళనకి, ఒంటరితనానికి తీసుకెళ్తుందని అర్థమైంది. నేననుకుంటున్న స్వేచ్ఛ విశృంఖలత్వానికి దారితీస్తుందని బోధపడింది. స్వేచ్ఛకీ పరిధులున్నాయనీ, దానికి లోబడే ప్రవర్తించాలని తెలిసొచ్చింది. స్వేచ్ఛ వుంది కదాని రోడ్డు కడ్డంపడి డ్రైవ్ చెయ్యలేం. ఇష్టమొచ్చినట్లు మాట్లాడలేం. ఇతరుల్ని నొప్పించలేం. భార్యాభర్తలిద్దరూ కూడా స్వేచ్ఛగా ప్రవర్తించొచ్చు. కానది పరిమితులకి లోబడి కుటుంబ శ్రేయస్సు లోపలే వుండాలి. అది తెలుసుకున్నాను గనుకే దిశ మార్చుకుంటున్నాను.."

'ఇంత తెలివైన స్వప్నికి ఎంత కష్టం వచ్చిందీ!' అనుకుంటూ బాధగా చూశారు తండ్రి.

"ఆసుపత్రి కెళ్దాంపద" తొందర పెట్టింది రేవతి.

"వెళ్లొచ్చేనమ్మా. మెడిసిన్స్ ఇచ్చారు. ఎలాంటి ఆందోళనకీ మానసిక ఒత్తిడికీ గురికావొద్దని చెప్పింది డాక్టర్. వాటి ప్రభావం బిడ్డమీద చాలా ఎక్కువ వుంటుందిట..."

"అందుకనే కదా సీమంతం చేసేదీ..." అనింకేదో అనబోయి తల్లి మింగేసింది.

అది గ్రహించి చిన్నగా నవ్వింది స్వప్ని.

"గతాన్నంతా తుడిచెయ్యాలి. ఎలాంటి ఆనవాళ్ళూ మిగలకూడదు. నువ్వింకోసారి ఆలోచిస్తే మంచిదేమో స్వప్నీ..." వేదనా పూరిత స్వరంతో అన్నారు సుబ్బారావు.

"డాక్టర్ ఓ మాటన్నది డాడీ! తనకేదైనా సమస్య వస్తే తన ఆలోచనల ద్వారా పరిష్కరించుకోలేకపోతే స్ఫూర్తి కోసం గీతని ఆశ్రయిస్తుందిట. నేనూ ఆపనే చేద్దామని భగవద్గీత కొనుక్కొచ్చాను. ఆటోలో వూరికే తిరగేస్తోంటే 'కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన' అన్న శ్లోకం కన్పించింది. కర్మ ఆచరించు. నీ బాధ్యత నువ్వు నిర్వర్తించు. దాని ఫలితం గురించి ఆలోచించకు అంటారు కృష్ణ పరమాత్మ. సత్కర్మ అనే విత్తనం నాటితే సత్ఫలాలు లభిస్తాయన్న సూచన నాకిందులో కన్పించింది డాడీ. గీతాకర్త శ్రీకృష్ణుడు వ్యక్తిత్వ వికాస నిపుణుడిగా స్ఫూర్తి ప్రదాతగా ప్రేరణకర్తగా అధ్యయనం చెయ్యాలిట. చేస్తాను. నా నుదుటి గీతలు మారతాయేమో చూద్దాం. మారితే ఆ మార్పు మీకు సంతోషదాయిని అవుతుందని నా ఆశ, ఆకాంక్ష!"

స్వప్ని ఎంతో ఎత్తుకి ఎదిగిపోయినట్టు ఆటుపోట్లకి తట్టుకుని తనని తాను సరిదిద్దుకుని పరిపూర్ణురాలిగా రూపుదిద్దుకొన్నట్టు అన్పించింది.

వాత్సల్యంతో అభినందన పూర్వకంగా చూశారామె తల్లిదండ్రులు.

సరిగ్గా అప్పుడు గాయత్రి ఫోన్‌చేసి "పాపం శృతి పెళ్లి ఆగిపోయిందిటే" అని చెప్పింది.

"ఏం ఎందుకు? "

### కొత్తగాలి...



**తలలు మార్చేవాడు**
**నాయకుడు**
**తనతలను మార్చుకునేవాడు**
**వినాయకుడు**

*– లోగిశ లక్ష్మీనారాయణ,*
సింహాచలం

"అనారోగ్యంగా వుందని బ్లడ్ టెస్ట్ చేయిస్తే హెచ్ఐవి పాజిటివ్ వచ్చిందట!"

"దట్ మీన్స్.. భవిష్యత్తులో ఎయిడ్స్ వ్యాధిగ్రస్థురాలవ్వక తప్పదు"

"యా!"

"మై గాడ్!"

★ ★ ★

ఉదయ కిరణాలతోబాటు వచ్చాడు పరాంకుశం.

"ఉరుములేని పిడుగులా వచ్చి పడ్డావేంటి? ఊళ్ళో అంతా బాగానే వుంది కదా?" అడిగారు సుబ్బారావు.

"బ్రహ్మాండంగా వుంది. పెళ్లిపనులు పురమాయించి వచ్చాను. స్వీట్లు తీసుకోండి. శుభవార్త మీకెప్పుడు చెబుతానా అని నిన్నట్నుంచి ఉగ్గబెట్టుకున్నాను. స్వప్నికా- ముందు నువ్వు తీసుకో..." స్వీట్స్ డబ్బా తెరచి ముందుకు చూస్తూ అన్నాడు.

ఒక లడ్డు తీసుకుంటూ "శుభవార్త చెప్పు బావా?" అంది.

"బందరు లడ్డూలమ్మా. చాలా బావుంటాయి. గుడివాడలో కొన్నాను"

"గుడివాడ వెళ్లావా?" చటుక్కున అడిగారు సుబ్బారావు.

"వెళ్లకపోతే ఎలా? వ్యవహారం గురించోమాట అనుకోవద్దూ. తర్వాత మేం అలా చెయ్యలేదు ఇలా అనలేదు అంటూ నిందలు వెయ్యనివ్వకూడదు కదా?"

"డొంక తిరుగుడు మానేసి సంగతి సూటిగా చెప్పు..."

"చెబుతాను చెబుతాను. మీరు లడ్డు తింటూ వుండండి. నేను ప్రయాణపు బడలిక తీర్చుకుంటాను. ఈలోగా ఎవరైనా కమ్మని వేడి వేడి ఘుమ ఘుమల కాఫీ ఇస్తే బావుణ్ణు..." సోఫాలో కాళ్ళు చాపుక్కూర్చుంటూ అన్నాడు పరాంకుశం.

అతడి ధోరణి, ప్రవర్తన వింతగా వున్నాయి. అతనిలో కొత్త మనిషి కన్పిస్తోంటే కించిత్తు అనుమానంగా చూశారు.

'ఏ మొగుడూ లేకపోతే అక్క మొగుడే గతి' అన్న సామెత గుర్తొచ్చింది ముగ్గురికీ ఒకేసారి. సన్నగా కంపించారు.

ఏం ఫిటింగు పెడతాడో కొంపమీదికేం ముసలం తెస్తాడోనని భయం భయంగా చూశారు.

వారి భావాలనీ భయాలనీ చదివినట్టు నవ్వేడు.

"ఫర్లేదు. నన్ను బాగానే అర్థం చేసుకున్నారు. వచ్చే గురువారమే స్వప్నిక పెళ్లి. సరిగ్గా ఎనిమిది రోజులున్నాయి. సమయం తక్కువే. హడావిడవుతుంది. అయినా తప్పదు. అంతకంటే మంచి ముహూర్తం లేదు. ఇంకా ఆలస్యం చేస్తే స్వప్నికకీ బాగోదు, అతిథులకీ బాగోదు. ఆమె ఎత్తైన పొట్టవంక అంతా చిత్రంగా చూస్తూ చాటుగా నవ్వుకోటం మీక్కూడా బాగోదు కదా మావయ్యా. అందుకనే ఈ ముహూర్తమే ఖాయం చేసేశాను.."

ఎవ్వరూ మాట్లాడలేదు. వారి చూపుల్లోని అనుమానం ముదిరి అసహ్యాతగా మారుతోంది.

"మీ పద్ధతేం బావోలేదు. ఏదో మరదల్ని ఉద్ధరిద్దామనివస్తే నా మొహాన కాఫీ నీళ్ళు పోయలేదు. శుభవార్త చెప్పినా

**కొత్తగాలి...**

**ఉరుములు..**
**మెరుపులు..**
**లేకుండా కురిసేది**
**చల్లని వెన్నెల!**

*- అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

ఒక్కరి మొహాల్లోనూ ఆనందం లేదు. నన్ను అభినందించడం లేదు. లోకంలో మంచికి విలువ లేదు. అంతేనా స్వప్నీ? "

గంభీరంగా మారిందామె. మాడ్చేసేలా చూసింది. అసహ్యాన్ని ముద్దగా చేసి అత డిమీద విసిరేసింది.

"ఇదివరకు మూర్ఖుడనుకున్నాను. తర్వాత తెలివైనవారనుకున్నాను. ఇప్పుడు పచ్చి అవకాశవాది, దుర్మార్గుడు అనుకుం టున్నాను"

"మనస్సులోని మాట కక్కేసినందుకు చాలా థాంక్స్. లోపలంతా ఖాళీ అయిపో యింది కదా.. హమ్మయ్య! నీ మనస్సు తెల్లకాగితం అయిపోయింది గనుక ఇక కొత్త కావ్యం రాసేయ్యొచ్చు.."

"పరాంకుశం! నిన్నే పురుగూ కుట్టలేదు కదా? ఆ మాటలేంటి ఆ ధోరణేంటి? " కోపం బాధ మిళితమైన స్వరంతో అన్నారు సుబ్బారావు.

"మేకవన్నె పులి. మనతో మంచిగా వుంటూ మనకేదో ఒరగ బెట్టేస్తున్నట్టు నటిస్తూవచ్చాడు. ఇవాళ నిజరూపం బయట పెట్టేసుకున్నాడు..." అత్తగారంది చీపురుకట్ట ఎక్కడుందో కళ్ళతోనే వెదు కుతూ.

"బాబోయ్! దేవుడోయ్! నేనేదో కాస్తంత సస్పెన్స్ క్రియేట్ చేస్తే నా తలంటేస్తు న్నారు నాయనోయ్" తలమీద చేతులు పెట్టుకుంటూ అన్నాడు పరాంకుశం.

అందరూ కళ్ళు పెద్దవి చేసుకుని చూశారా మాటలకి.

ఆ చూపుల్లో పిసరంత సిగ్గు వుంది. అపరాధ భావన వుంది. ఉలికిపాటూ వుంది.

"పెళ్లికొడుకెవరో అడక్కుండా ఇలా చిత్ర హింస పెట్టడం ఏం బావోలేదు"

"పెళ్లికొడుకెవరు? " ముగ్గురూ ముక్త కంఠంతో అడిగారు.

"అనురాగ్... అనురాగ్.. అనురాగ్.." గంతులేస్తూ అన్నాడు.

వెర్రి సంబరంతో వూగిపోయింది స్వప్ని.

"భయపెట్టి చంపేవుకదా" చనువుగా వీపుమీద చరిచారు సుబ్బారావు.

"పాపిష్టి ఆలోచన్లొచ్చాయి గాని మా అల్లుడు బంగారం" చెంపలు వాయించు కుంది స్వప్నిక తల్లి రేవతి.

ఆనందోద్వేగంతో ఉక్కిరిబిక్కిరవుతూం డిపోయింది స్వప్నిక.

కోయిలలు పాడుతున్నాయి. నెమళ్లు ఆడుతున్నాయి. చెట్లు తలలూగిస్తు న్నాయి.

గాలి చిందులేస్తోంది. సముద్రం ఎగిరె గిరి పడుతోంది. వెన్నెల జల్లులుగా కురు స్తోంది. సూర్య కిరణాలు ఇంద్ర ధన స్సుతో సయ్యాటలాడుతున్నాయి. గుడిలో గంటలు మోగుతున్నాయి.

ఆనందం! పరమానందం!

సమస్త ప్రకృతీ ఆనంద లోకంలా మారి పోయింది. పచ్చని తోరణాలు కట్టుకుంది. సన్నాయి రాగాలు మోగుతున్నాయి. నును సిగ్గులు జారిపోతున్నాయి.

మనస్సులో మల్లెల మాలలూగుతు న్నాయి.

"మా స్వప్నికమ్మ పెళ్లి కూతురాయెనే" చప్పట్లు చరుస్తూ పాడుతూ ఆమె చుట్టూ తిరిగాడు పరాంకుశం.

సుబ్బారావు దంపతులు సంతోషాన్ని అణచుకోలేక వూగిపోతున్నారు.

'ఈ జన్మకీ ఆనందం చాలు' అనుకుంది.

అప్పుడు గుర్తొచ్చిందా సంగతి.

చప్పున కోపం వచ్చింది. చటుక్కున ఫోన్ అందుకుంది.

"ఏయ్ అనురాగ్. ముందుగా నాకెం దుకు చెప్పలేదు? "

"ముందే తెలిస్తే థ్రిల్ వుండదుగా"



"అందుకని ఇంత సస్పెన్స్ మెయిన్‌టెయిన్ చెయ్యాలా? నిన్నెంత తిట్టానో తెలుసా? "

"ఊహించగలను. నీ శాపనార్థాలకి శక్తి వుంటే శంకుస్థాపన రాయిగా మారేవాడ్నేమో!"

"తెలిసీ దాచావన్నమాట"

"కొన్ని దాస్తేనే అందం. దాచినవి ఇంకా వున్నాయ్"

"ఏంటవి? "

"ఆ గుట్టు విప్పడానికి వేరే టైం ఫిక్స్ చేశాను"

"ఇప్పుడు చెప్పకూడదా? "

"నువ్వడక్కూడదు"

"ఎప్పుడు చెబుతావ్? "

"ఫస్ట్‌నైట్"

సిగ్గుల మొగ్గ అయ్యింది స్వప్న.

"ఎంతందంగా వున్నావే ఎవరే నువ్వూ..." పాటందుకున్నాడతడు.

"ఛీ పో..."

లైన్ కట్ చేసింది.

కొత్త కనెక్షన్ ప్రారంభమైంది మరి!

★ ★ ★

భూదేవంత అరుగు వెయ్యలేదు. ఆకాశమంత పందిరీ వెయ్యలేదు.

అయితేనేం రంగురంగుల విద్యుత్



బల్బుల తోరణాలతో వెలిగిపోతున్న కళ్యాణమంటపం దివినుంచి దేవతలు భువికి పంపిన పూల మంటపంలా వుంది.

పెద్దల ఆహ్వానాలు, కబుర్లు, పలకరింతలు, మర్యాదలు- పిల్లల ఆటలపాటలు, పరుగులు, ఆడవారి సింగారాలు.. పట్టుచీరల పరపరలు, నగల ధగధగలు వయ్యారాలు సిగ్గులు- ఆనందం వెల్లివిరిసినట్టుంది. ఎటు చూసినా సందడే. సంబరమే.

పెళ్లికొడుకు అనురాగ్ పూలపడవలాంటి కారులో ఊరేగుతూ వచ్చాడు. బ్యాండు మేళం లయబద్ధంగా మోగుతూ వాతావరణాన్ని హుషారెత్తిస్తోంది.

కారు దిగి పాంకోళ్లు తొడుక్కున్నాడు. ఒకరు చేతికి కర్రా గొడుగూ అందిచ్చారు.

కాశీయాత్ర కెళ్తానన్నాడు.

"ఇప్పుడే వద్దు నాయనా.. దానికి వేరే టైముంది గాని సర్వాలంకృతమైన మా అమ్మాయినిచ్చి పెళ్లి చేస్తాం రా" అని ఆహ్వానించాడు బావమరిది వరసయ్యే అబ్బాయి.

అనురాగ్ అంగీకరించడంతో అతడి కాళ్ళు కడిగి బెల్లంముక్క నోట్లో పెట్టాడు.

పెద్దలంతా అతడ్ని తోడ్కొని కళ్యాణ మంటపంలోకి తీసుకెళ్ళారు.

అప్పటికే స్వప్నిక చేత గణపతి పూజ, గౌరీ పూజ వగైరాలు చేయించారు.

పట్టుచీర కట్టుకుని, వడ్డాణం పెట్టుకొని మెడలో నగలు అలంకరించుకొని పుత్తడి బొమ్మలా వుంది స్వప్ని. అద్దంలో తన ప్రతిబింబం చూసుకుని 'తనేనా?' అని ఆశ్చర్యపడింది. తనింత అందంగా వుందా అని అబ్బురపడింది. పెళ్లికళ అంటే ఇదే కాబోలనీ అనుకుంది.

అంతా అభినందిస్తున్నారు. హాస్యాలాడుతున్నారు. కథానాయికగా చూస్తూ గౌరవిస్తున్నారు.

ఈ పాత్ర, ఈ ఘట్టం ఆమెని మైమరి పిస్తోంది. శరీరం మనస్సూ క్రొంగొత్త అనుభూతులతో తూలిసోలి పోతోంది. గాలిలో తేలిపోతోంది.

ఆమెని లోపలికి తీసుకెళ్ళేక అనురాగ్‌ని మంటపంలోకి తీసుకొచ్చారు. గణపతి పూజ వగైరా చేయించారు.

పిమ్మట సుబ్బారావు దంపతులొచ్చి ఆసీనులయ్యారు. స్వప్నికనీ తీసుకొచ్చారు.

వధూవరుల మధ్య తెరసెల్లా కట్టారు.

వరుణ్ని లక్ష్మీనారాయణ స్వరూపుడిగా భావిస్తూ కాళ్ళు కడిగారు కన్యాదాత దంపతులు.

> ## కొత్తగాలి...
>
> **సిరాకు**
> **టెలిగ్రాముకు**
> **పిచ్చుకలకు**
> **నివాళులు!**
>
> *– మంద రిత్విక్,*
> *హైదరాబాద్*

ఇప్పటిదాకా వధువు పోషణ, రక్షణ, సంతోషం, ఓదార్పు, ఉత్సాహం- అన్నీ తల్లి దండ్రుల బాధ్యతలు. వాటన్నిట్నీ వరుడికి బదిలీ చేస్తూ కన్యాదానం చేశారు.

'సంతానార్థం ధర్మ కార్యార్థం నేనీమెను దానం చేస్తున్నాను. ఈమెని స్నేహితురాలిగా ప్రేమాభిమానాలతో చూసుకోవాలి' అని హితవు చెప్పారు.

పిమ్మట వివాహ ధర్మాలు వివరించారు.

రుషులు ఆదేశించినట్టు క్రమశిక్షణ, ధర్మాచరణ కలిగిన జీవితాన్ని మీరిద్దరూ కలిసి గడపాలన్నారు. మతం, ప్రకృతి సంపద, శృంగార విషయాల్లో నియమాలకి కట్టుబడి వుండాలని వివరించారు.

ధర్మార్థ కామ మోక్షాల్లో ఈమె చేయి విడువనని ప్రతిజ్ఞ చేస్తూ 'నాతిచరామి' అన్నాడు అనురాగ్. 'ఈమెతోనే నా జీవితం, నా జీవితంలో సగం ఈమెయే, ఈమె లేక నాకు బతుకులేదు' - అనీ అన్నాడు.

ధర్మార్థ కామాల్లోనూ, సంతానోత్పత్తియందూ అతడ్ననుసరించి గృహస్థాశ్రమ ధర్మాలను నిర్వర్తిస్తానని స్వప్నిక ప్రమాణం చేసింది.

సుముహూర్తాన జీలకర్ర బెల్లం మిశ్రమాన్ని ఒకరి శిరస్సుపై ఒకరు వుంచారు. వాటిల్లా కలిసిపోయి జీవిస్తామన్నారు.

అడ్డుతెర తొలగించగా ఒకరినొకరు భ్రూమధ్యంలోకి చూసుకున్నారు స్వప్నికా అనురాగ్.

ఆ శుభవీక్షణానికి గుండె ఝల్లుమంది.

ఒళ్ళంతా పులకింతల్తో పులకించిపోయింది.

ఒకరికొకరు ఎంతో గొప్పగా అద్వితీయంగా అపూర్వంగా కన్పించారు. మురిసిపోయారు.

'నా జీవన హేతువైన ఈ సూత్రంతో నీ కంఠంలో మాంగల్యాన్ని కడుతున్నాను. బంధ హేతువైన మంగళ సూత్రాన్ని ధరించి నీవు నిండు నూరేళ్ళు జీవించు' అనే మంత్రాన్ని పురోహితుడు చదువుతోంటే ఆమె మెడలో మూడు ముళ్ళు వేశాడు అనురాగ్.

ఇద్దరి జీవితాల్నీ ముడివేసే సూత్రబంధాన్ని ఆశీర్వదిస్తూ వివాహానికి వచ్చిన పెద్దలంతా అక్షతలు వేసి దీవించారు.

యావత్ సమాజమే తరలివచ్చి ఆశీర్వచనాలు కురిపిస్తున్నట్టు అనుభూతి చెందారిద్దరూ.

ఒకర్తో ఒకరు పోటీపడుతూ తలంబ్రాలు పోసుకున్నారు.

వేడుకగా తిలకించారు పిల్లలూ

పెద్దలూ.

ఆమె చీరకొంగునూ అతడి ఉత్తరీయపు అంచునీ కలిపి 'కొంగుముడి' వేశాడు పురోహితుడు.

కేవలం రెండు వస్త్రాలని గాక ఇద్దరు వ్యక్తుల్ని కలిపి క్రొంగొత్త ఆకారాన్ని సృష్టించడమే దాని అర్థమని వివరించాడు.

ఒకరికొకరు 'చేదోడు'గా వుంటామని, 'చేయూత' నిచ్చుకుంటామని, ఒకరికొకరు అభయం ఇచ్చుకుంటూ పాణిగ్రహణం చేసుకున్నారు.

"నీవు సజల సఫల సంపన్నమైన ధరణివి. నేను నిర్మలమైన ఆకాశాన్ని. రా! నా ప్రాణాన్ని వివాహ సూత్రాన్ని కలిపి బంధించుకుందాం. ప్రపంచంలోని మేళన శక్తితో సత్‌పుత్రుల్నికని ప్రపంచానికి సమర్పించుకుందాం. మనిద్దరి మనస్సుల్ని మంగళ మయ భావాలతో నిమగ్నం చేసి శత సంవత్సరాల శోభను చూద్దాం" అంటూ పాణిగ్రహణ ప్రతిజ్ఞ చేశాడు.

పిమ్మట అగ్ని ప్రదక్షిణ చేశారు. మొదటి నాలుగుసార్లు స్వప్నిక ముందు నడవగా అనురాగ్ అనుసరించాడు. తర్వాత మూడుసార్లు అతడు ముందు నడవగా ఆమె అనుసరించింది. అవసరాన్ని బట్టి ఎవరు ఎవర్ని అనుసరించినా తప్పులేదని గ్రహించిందామె.

అనంతరం ఇద్దరూ కలిసికట్టుగా ఒకే జట్టుగా సప్తపది నడిచారు.

ఆహారం, శక్తి, సత్కర్మలు, సుఖం, పశు సమృద్ధి, రుతువుల అనుగ్రహం, ఏడుగురు హోతల కోసం ఏడు అడుగులు వేస్తున్నట్టు మంత్రం చదివాడు.

కలిసి ఏడడుగులు వేయడం వల్ల మంచి స్నేహితులమయ్యాం. పరస్పర ప్రేమతో అనుకూల దాంపత్యంతో కలిసి వుందాం. కలసి ఆలోచిద్దాం. మనస్సులు కలిపి నడుచుకుందాం- అంటూ మరో మంత్రమూ చెప్పేడు పురోహితుడు.

తదనంతరం అగ్ని సాక్షిగా వధూవరులిద్దరూ ప్రమాణాలు చేశారు.

"ఈ క్షణం నుంచి వధువు నా అర్థాంగి. నా వ్యక్తిత్వాన్ని ఆమెతో కలుపుతాను. ఇద్దరి కలయికతో నూతన సృష్టి చేస్తాను. నా శరీర భాగాల్లానే భార్య గురించీ శ్రద్ధ తీసుకుంటాను. ఇంటి ఆర్థిక విషయాలు చూసే బాధ్యతను నా భార్యకు అప్పగిస్తున్నాను. అన్ని ముఖ్య విషయాల్లోనూ ఆమె అభిప్రాయాలూ సలహాలూ తీసుకుంటాను. నా భార్య బాహ్యరూప మార్పుల వల్ల అనాకర్షణ పెంచుకోను. అసంతృప్తి చెందను. ప్రేమతో సత్సంబంధం కొనసాగిస్తాను. నా భార్యకి ప్రాణ స్నేహితుడిలా వుంటాను. ఆమెతో ఆత్మీయంగా ప్రవర్తిస్తాను. నా శక్తియుక్తుల్ని ఆమె సుఖసంతోషాల కోసం, శాంతి అభివృద్ధుల కోసం వినియోగిస్తాను. ఈ ప్రమాణానికి మనసా వాచా కట్టుబడి వుంటాను" అని వరుడిచేత ప్రమాణం చేయించాడు.

ఆమెతో కూడా ప్రమాణం చేయిస్తూ-

"నా జీవన శైలిని నా భర్త శైలితో కలిపి నూతన వ్యక్తిగా మేం రూపొందుతాం. అతడి అర్థాంగిగా జీవిస్తాను. బంధుమిత్రుల్ని ఆదరిస్తాను. విశ్వాస పాత్రంగా వుంటాను. అసూయ, గయ్యాళితనం నా దరికి రానివ్వను. ఆజన్మ సహచరిగా వుంటాను. నా భర్తపట్ల నా బాధ్యతలు ప్రతిఫలాపేక్ష లేకుండా నిర్వహిస్తాను" అంటూ మంత్రాలు చదివారు.

పురోహితుడు వివిధ మంత్రాల అర్థాలు వివరిస్తోంటే సరికొత్త జ్ఞాన ద్వారాలు తెరచుకున్నట్టు అనుభూతి చెందింది స్వప్నిక.

ఆమెను మరో కుటుంబానికి అప్పగించడంతో వివాహ ఘట్టం పూర్తయ్యింది.

★ ★ ★

తెల్లచీర కట్టుకుని మల్లెపూలు పెట్టుకుని

పాలగ్లాసు చేతబట్టి హంసగమనంతో గది లోకి అడుగు పెట్టింది స్వప్నిక.

సిగ్గుబరువు చేత కనురెప్పలు వాలిపో తోంటే పెదాలు చిరుకంపనకు లోనవు తోంటే యౌవనపు శోభ వెలిగిపోతోంటే దివి నుండి దిగివచ్చిన దేవకన్యలా అన్పిం చింది అనురాగ్‌కి.

అతికష్టం మీద కనులెత్తి చూసింది.

స్వచ్ఛమైన తెల్లని వస్త్రాల్లో చిరునవ్వులు చిందిస్తూ పున్నమి చంద్రుడిలా అనురాగా మృతపు వెన్నెల జల్లుల్ని కురిపిస్తూ - తన కోసం ప్రత్యేకంగా బ్రహ్మ సృజించిన మహా పురుషుడిలా అన్పించాడు, కన్పించాడు స్వప్నికకి. ఎదురెళ్ళి ఆమె చేతిలోని పాల గ్లాసందుకొని పక్కన బెట్టి ఆమెని పొదివి పట్టుకుని మంచం దగ్గరికి నడిపించుకె ళ్ళాడు.

అతడి ఎదమీద వాలిందామె.

ఆమెని సుతారంగా హత్తుకున్నాడు.

కోరికల సెగల్లేవు. అనురాగస్పర్శపు పూతలే వున్నాయి. జలపాతంలా చుట్టేసు కోలేదు. నిండు గోదావరిలా పెనవేసుకు న్నారు.

అతడు మెల్లగా కిందికి జారి ఆమె పొట్టమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆమెకళ్ళు చెమర్చాయి. గాఢంగా అతడి పెదాల్ని ముద్దాడింది.

"ఆరోగ్యం బాగుందా? "

"ఊ"

"మౌనరాగమేనా మాటలపల్లవి లేదా? "

"మీ వాళ్ళింత తేలిగ్గా ఒప్పుకుంటారను కోలేదు"

"వాళ్ళెన్నడూ అభ్యంతర పెట్టలేదు. కులాంతరమా మరోటా అన్నదీ పట్టించు కోలేదు. మీరు సంతోషంగా వుండటమే మాకు కావాలన్నారు. ఏ తల్లిదండ్రులైనా పిల్లల శ్రేయస్సే కోరుకుంటారేమో. సిని మాలు చూసి పిల్లలు పెద్దవాళ్ళని అపార్థం చేసుకుంటున్నారనిపిస్తోంది"

"కొన్ని క్షణాలపాటు మా బావగార్నీ అపార్థం చేసుకున్నాం, తెలుసా? "

"హీ ఈజ్ గ్రేట్. ఆవేశంకన్నా ఆలో చన పాలెక్కువ. బెంగళూరెళ్ళేక నువ్వను కుంటున్నట్టు నేన్నిన్ను మర్చిపోలేదు. అనుక్షణం నిన్ను గుర్తు చేసుకుంటూనే వున్నాను తెలుసా? "

"మరెందుకలా నాటకమాడావు? "

"నువ్వేమిటో నాకు తెలుసు. నువ్వు కావాలి. కాని నీలోని వక్ర ధోరణులు అక్కర్లేదు. నువ్వు వజ్రానివే. కాని సానబ ట్టాలి. పెళ్ళికి నిన్ను అనుకూలంగా మార్చాలి. అందుకని మీ బావ పరాంకు శంతో కలిసి నాటక మాడాను"

"అమ్మదొంగా! ఎంత ఏడిపించావు" తొడపాశం పెట్టింది.

"మంచు కరిగితేనే కదా పర్వత స్వరూపం తెలిసేది. భ్రమలు తొలగితేనే కదా నీ నిజ సంస్కారం బయటపడేది"

"ఏమైతేనేం నేను లక్కీ" వాటేసుకుంది మళ్ళీ.

"నీ కన్నా నా కన్నా మన బాబు లక్కీ. వాడికి తల్లి ప్రేమ తండ్రి ప్రేమ సంపూ ర్ణంగా లభించబోతున్నాయి"

"అవునవును"

"చెప్పడం మరిచాను. మా అమ్మా నాన్నా ఇంకో సంగతి అన్నారోయ్. చెప్పనా? ఆ మధ్యేదో హిందీ సినిమా చూసినప్పట్నుంచీ నేనో అబ్బాయిని తీసు కొచ్చి 'వీణ్ణి పెళ్ళి చేసుకుంటాను' అంటా నేమోనని భయపడ్డారట!"

పడీ పడీ నవ్విందామె.

ఆమెవంక అపురూపంగా, ఆరాధనగా చూస్తూ ఆమె పెదాలని తన పెదాలతో మూసే ముందు అన్నాడు-

"మొన్నటిదాకా మనం లివ్ ఇన్ పార్ట్నర్స్‌మి. ఇక లైఫ్ పార్ట్‌నర్స్‌మి" ©

# అగ్రరాజ్యతపాలా తీరూతెన్నూ!





**శాస్త్ర సాంకేతిక రంగంలో అగ్రగామిగా ఉన్న ఆ దేశ జనసంఖ్య దాదాపు 33 కోట్లు. అయితే ఆ దేశంలో రోజూ బట్వాడా అయ్యే ఉత్తరాల సంఖ్య 66కోట్లు. దీనర్థం అక్కడ సగటున ప్రతి ఒక్కరూ రోజుకి రెండు ఉత్తరాలు రాస్తారు. ఇంటర్నెట్, సెల్ ఫోన్ల యుగంలోనూ ఆ దేశంలో ఇన్నేసి ఉత్తరాలు ఇంకా రాసుకుంటున్నారంటే ఆశ్చర్యం కదూ?!**



ఇంటర్నెట్, ప్రైవేట్ రంగంలోని కొరియర్ సంస్థల దెబ్బకు కొన్ని అభివృద్ధి చెందిన దేశాల్లో తపాలా వ్యవస్థ కుప్పకూలిపోగా అమెరికాలో మాత్రం ఆ శాఖ పోటీని ఎదుర్కొంటూ దీటుగా కొనసాగుతోంది. ఏ అధునాతన పరిజ్ఞానం తపాలా శాఖను దెబ్బతీస్తుందనుకున్నారో దాన్నే వినియోగించుకుంటూ ఆ శాఖ పరుగిడుతోంది. ఈ కారణంగానే ప్రపంచంలో బట్వాడా అవుతున్న మొత్తం ఉత్తరాలలో నలభై శాతాన్ని ఆక్రమించి అమెరికా అగ్రస్థానంలో ఉంది. అధికారిక లెక్కల ప్రకారం 2012లో ఆ దేశంలో పద్దెనిమిది వేల కోట్లకు పైగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి.

అమెరికాలో బ్రిటిష్‌వారు 1692లోనే తపాలా వ్యవస్థను ప్రారంభించారు. అయితే అప్పట్లో ఉత్తరం పంపినవారు కాకుండా దానిని అందుకునేవారు ధర చెల్లించాల్సి వచ్చేది. ఈ కారణంగా తిరిగి వచ్చే ఉత్తరాల సంఖ్య పెరిగిపోయేది. దీనికి విరుగుడుగా పంపేవారే ముందస్తు ధర చెల్లించే విధానం అమలులోకి రావడంతో తపాలా వ్యవస్థ పట్టాలెక్కి ముందుకు దూసుకుపోయింది. అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పోస్ట్‌మాస్టర్ జనరల్ పదవిని ఏర్పాటు చేసి, అందులో బెంజమిన్ ఫ్రాంక్లిన్‌ను 1780లో

నియమించారు. దాంతో ఆ వ్యవస్థ మరింత వేగం పుంజుకుంది. అమెరికావారి ఆధునిక పోకడల్లో అతిముఖ్యమైనది ఒకరికొకరు గ్రీటింగ్స్ చెప్పుకోవటం. దీనివల్ల పెద్ద ఎత్తున ఉత్తరాల వాడకం మొదలైంది. దీనికితోడు వ్యాపార సంస్థలు, ఇన్సూరెన్స్ కంపెనీలు, ప్రైవేట్ సంస్థలు ఉత్తరప్రత్యుత్తరాలను తమ సంస్థల విజయానికి సాధనంగా ఉపయోగించుకోవడం ప్రారంభించాయి. కాలంతోపాటే వేగంగా అమెరికా పోస్టల్ శాఖ అనేక మార్పులను ప్రవేశ పెట్టసాగింది. ఉదాహరణకు వాహనాలు అందుబాటులో లేని పద్దెనిమిదో శతాబ్దంలో గుర్రాల ద్వారా విజయవంతంగా ఉత్తరాలను పంపిణీ చేసింది. పందొమ్మిదో శతాబ్దంలో సాధారణ వాహనాలను, ఇరవయ్యో శతాబ్దంలో వేగవంతమైన వాహనాలను ఉత్తరాల రవాణాకు వినియోగించింది. 21వ శతాబ్దంలో అనేకచోట్ల ఆటోమేటిక్ యంత్రాలను సైతం ఏర్పాటు చేసింది. మొదట్లో పోస్టుబాక్సుల రంగులు ఒక్కో




రాష్ట్రంలో ఒక్కోవిధంగా తరచూ మారుతూ గందరగోళంగా ఉండేవి. 1971 నుండి అన్నీ నీలంరంగులో తెల్లటి ఈగిల్ చిహ్నంతో ఉంటున్నాయి. 1963లో ప్రవేశపెట్టిన ఏరియా జిప్‌కోడ్ విధానంతో ఉత్తరాల పంపిణీ వేగం పెరిగింది.

దేశంలోని 15.2కోట్ల ఇళ్లు, కార్యాలయ భవనాలకు తపాలా వ్యవస్థ అందుబాటులో ఉండాలన్నది ఆ శాఖ విధానం. ఇందులో భాగంగానే 2011లో తపాలా సౌకర్యం అంతగా అందుబాటులో లేనిచోట్ల విలేజ్ పోస్టాఫీసులను స్థానికుల సహకారంతో ఏర్పాటు చేసింది.

అమెరికాలో తపాలాశాఖలో 5.22 లక్షల ఉద్యోగులు, 2.12 లక్షల వాహనాలు ఉన్నాయి. పర్యావరణ పరిరక్షణలో భాగంగా ఈ వాహనాలు తక్కువ బరువును కలిగివుంటాయి. ఇథనాల్, బయోడీజిల్‌నే వీటికి వాడతారు. దేశంలోని ముప్పైఒక్క వేల పోస్టాఫీసులు పచ్చదనం-పరిశుభ్రతను విధిగా పాటించవలసిందే.

సాంకేతీకరణలో భాగంగా 1.25 లక్షల కంప్యూటర్లు, మూడు లక్షల హేండ్‌స్కానర్‌లు, డెబ్బైవేల ఆటోమేటిక్ వెండింగ్ మిషన్లు వినియోగిస్తున్నారు. 2012లో పోస్టల్ శాఖ 57 లక్షల పాస్‌పోర్ట్ అప్లికేషన్లు స్వీకరించి రికార్డు సృష్టించింది. అలాగే తపాలా మోసాలకు పాల్పడిన 7,845 మందిని అరెస్ట్ చేయించింది.

**వింతలు – విశేషాలు**

★ రోజు పదిలక్షల మంది పోస్టల్‌శాఖకు చెందిన 'యు.ఎస్.పి.ఎస్.కామ్'ను చూస్తారు.

★ రోజుకు తపాలా ఉద్యోగుల వేతనం 15.7 కోట్ల డాలర్లు

★ ఇంటర్నెట్‌తోపాటు ప్రయివేట్ కొరియర్ వ్యవస్థ పెడ్ఎక్స్, యునైటెడ్ పార్శిల్ సర్వీస్‌ల కారణంగా 1998 నుంచి 2008 మధ్య తపాలా శాఖ సేవల్లో 29 శాతం తగ్గింది.

★ తపాలా తగువుల కారణంగా 1986-1997 మధ్యన నలభై మంది సిబ్బంది మరణించారు. వీరి మరణానికి గుర్తుగా ఎడ్మండ్‌లో స్మారక స్థూపం ఏర్పాటు చేశారు.

★ బ్రెస్ట్‌కేన్సర్ గురించి ముద్రించిన స్టాంపులు ఎనిమిదేళ్లలో 94 కోట్లు అమ్ముడయ్యాయి.

★ అమెరికా పోస్టల్ ఉద్యోగులు ఏటా 38 మిలియన్ డాలర్లను విరాళంగా ఇస్తారు.

★ 2012లో 10.9 కోట్ల మందికి మనియార్డర్లు అందజేశారు.

**కుక్కలతో పారా హుషార్!**

మన పోస్టుమెన్‌లకే కాదు, అమెరికా దేశంలోని పోస్ట్‌మెన్‌లకు కూడా కుక్కల బెడద ఉంది. ఒక్క 2012లోనే 5,879 మంది ఉద్యోగులు కుక్కల కాట్లకు గురయ్యారు. ప్రతిఏటా మేలో కుక్కకాట్ల నివారణ వారోత్సవాన్ని ఆ దేశ తపాలాశాఖ పాటిస్తోంది.

**తీసుకోవడమూ బాధ్యతే!**

అమెరికా తపాలా శాఖ మనలా ఉత్తరాలు ఇవ్వటమే కాదు, తీసుకుంటుంది కూడా. అక్కడ ఇళ్లముందు సొంత పోస్ట్‌బాక్సులు ఉంటాయి. పోస్ట్‌మెన్ వాటిలో ఉత్తరాలు వేయటమే కాకుండా, అందులో ప్రజలు వేసిన ఉత్తరాలను తీసుకెళతారు. దీనికోసం చిన్న సూచన చేయాలి. అదేమంటే పోస్ట్‌బాక్స్‌కు అమర్చిన ఎర్రబాణం గుర్తును పైకి లేపాలి. దాంతో తీసుకెళ్లాల్సిన ఉత్తరాలు ఉన్నాయని గ్రహిస్తారు. మనదేశంలో కూడా ఇలా చేస్తే ఎంతో బాగుంటుంది కదూ!?

– పుట్టా సోమన్న చౌదరి

# రాజీ



- ఆకెళ్ళ శివప్రసాద్

అనాదిగా వున్న వివాహ వ్యవస్థకి ప్రతీకగా ఆ పాత భవనంలో ఫ్యామిలీ కోర్టు వుంది. చిద్రమైపోతున్న మానవ సంబంధాలకి ప్రతీకగా గోడల్లో పగుళ్ళు, మసిబారిపోయిన మూలాలు, బూజులు, చెదలు స్పష్టంగా కన్పిస్తున్నాయ్.

ఒకలాంటి పాతవాసన రాజ్యమేలుతోంది. వరండాలో అసహనంగా జంటలు కాని జంటలు, విడిపోవాలనుకున్న జంటలు. ఎవరి కుటుంబ సభ్యులతో వాళ్ళు. గుసగుసలు, వెక్కిరింతలు, దెప్పిపొడుచుకోడాలు, మధ్యవర్తుల మంతనాలు.

వివాహబంధం తుంచుకోవడానికి ధరలు, బేరసారాలు, కరిగిపోతున్న ఆశలు, కల్లలయిపోతున్న అనురాగాలు. హడావిడిగా పరుగులు పెడ్తున్న లాయర్లు. మనసు బరువుతో కదల్లేకపోతున్న మనుష్యులు.

అప్పటికే ఆ కేసు విషయంలో ఆ యిద్దరినీ కలిపే ప్రయత్నంలో చాలా చర్చలు జరిగాయి. ఏవీ ఫలించలేదు.

చివరి ప్రయత్నంగా జడ్జిగారు అతి చిన్న విషయంలో విబేధాలు వచ్చాయని గట్టిగా నమ్మి- మొదటగా ఆమెని బోనులోకి పిల్చారు. ఆమె కుటుంబసభ్యులు ఆసక్తిగా చూస్తున్నారు.

"...నావల్ల కాదు ఆ కంపు భరించడం... ఆ మనిషి దగ్గరకొస్తేనే కడుపులో తిప్పుతోంది... వాంతి వస్తోంది... యిలాంటి మనిషిని నేను భరించలేను..." వివాహ వ్యవస్థని అడ్డంగా బద్దలు కొట్టినట్టు చెప్పేసిందామె.

మొదటిరోజు నుండి ఒకే మాట, ఇదేమాట.

ఒక చుక్క సెంట్ వాళ్ళిద్దరి జీవితాల్లో చిచ్చు పెట్టింది. మొదటిరోజు మొదటిరాత్రి నుంచి అదే గొడవ. విడాకుల వరకు వచ్చింది. 'సెంట్' వాసన భరించలేకపోతోందామె. ఆ అత్తరునే వాడతానంటాడు అతను.

జడ్జిగారు ఛాంబర్‌లోకి పిలిచి సెంట్ మార్చమన్నారు. అతను కుదరదన్నాడు.

ఆ అమ్మాయి మాటలు విన్నాక, అతన్ని బోను దగ్గరికి రమ్మన్నారు. అతను వొస్తుంటేనే జడ్జిగారికే కాదు, అక్కడ వున్న వాళ్ళందరికీ ముక్కు పుటాలకి సెంట్ వాసన గుప్పుమంది.

ఎప్పటిలాగే అతను తనదైన పద్ధతిలో "ఎలా మారుస్తానండి. 'దీని' గురించి ప్రతీది మార్చుకుంటూ పోతే నా వ్యక్తిత్వం ఏమైపోతుంది? పెళ్ళికాక పూర్వం నుండి ఈ సెంట్ వాడుతున్నాను.. యిదే ఎప్పటికీ వాడ్తాను" కచ్చితంగా చెప్పేశాడు.

అప్పటిదాకా లెక్కకు మిక్కిలిగా కౌన్సిలింగ్‌లు జరిగాయి. సెంట్ వల్ల విడిపోవడమేమిటి?

వివాహ వ్యవస్థనే ప్రశ్నిస్తోంది చిన్ని సెంట్ చుక్క! ఔను, సెంట్ పడక విడిపోవడమేమిటి?

అతను తేలుకొండి బ్రాండ్ సెంట్‌ను వదిలిపెట్టడని అర్థమయ్యింది. ఆమెకి ఆ వాసన, ఆ వాసన యిష్టపడే మనిషి, యిష్టంలేదు!! ఆ

## చతుర కథలు

వాసన మాత్రం అక్కడి గాలిలో కలిసి 'తమాషా' ని చూస్తోంది. 'పట్టు-విడుపు' వుండాలని మరో సారి చెప్పారు.

లాభం లేకపోయింది. తప్పక జడ్జిగారు విడాకులు యిచ్చేశారు!! ప్రస్తుతం అతడు విడాకులు తీసుకుని చాలా రోజులయినా పెళ్ళికాలేదని, సెంటిమెంట్‌గా సెంట్ మార్చేసి సంబంధాలు వెతుక్కుంటున్నాడు!!

ఆమె.. మళ్ళీ పెళ్ళి చేసుకోబోయేవాడు తేలుకొండి బ్రాండ్ సెంట్‌నే యిష్టపడితే ఇబ్బంది పడవలసి వస్తుందనీ ఆ సెంట్ వాసనని అలవాటు చేసుకుంది!!

Ⓒ

# ఒకడిని మించి మరొకడు

- నారంశెట్టి ఉమామహేశ్వరరావు



సాఫ్ట్‌వేర్ ఎంప్లాయి వెంకట్ ఆదివారం సాయంత్రం పార్కులో కూర్చున్నాడు. చుట్టూ కలర్స్ కోసం వెతుకుతున్నాడు కళ్లతోటే! అతడి వయస్సు అలాంటిది మరి... పెండ్లి వయసు!

అంతలో నలుగురు కుర్రాళ్లొచ్చి పక్క బెంచ్ మీద సెటిలై కబుర్లాడుతున్నారు.

'ఎలాంటి ఫిగరయినా నేనామె కాలు పట్టుకుని పాదాలు చూస్తుంటే ప్రతిమలా మారిపోవాల్సిందే! నేను చెయ్యి తీసేవరకు కనీసం కాలు కదపలేరు' మొదటివాడు చెప్పాడు గొప్పగా.

'ఓస్! కాలూ, పాదాలూ... అంతే కదా! అదే నేనయితే ఎంత సౌందర్య రాశినయినా చేతులు పట్టుకుని మృదువుగా స్పృశిస్తుంటే చూడాలిరా వారి కళ్లల్లో మెరుపు!' గర్వంగా చెప్పాడు రెండోవాడు.

'ఆపండ్రా మీ సోది కబుర్లు. మీరు కేవలం కాళ్లూ, చేతులూ తాకగలరు. అదే నేనయితే ముఖంలో ముఖం పెట్టి చూస్తాను. ఎంత అందగత్తె అయినా నా చేతుల్లో ముఖం పెట్టి నా మాటకోసం ఆగాల్సిందే!' చెప్పాడు పొగరుగా మూడోవాడు.

ఇది వింటున్న వెంకట్ ఒక్కసారి లేచి వారివైపు నడిచి పరిచయం చేసుకోవాలనుకున్నాడు. అది గమనించిన వారిలోని నాలుగోవాడు 'మీరు అంత ఆశగా పరిచయం కోసం ఇటు రానక్కరలేదు. వీళ్లిలాగే గొప్పలు చెప్పుకుని మురిసిపోతుంటారు. వీళ్లేమో ఒకడు చెప్పుల కొట్లో, రెండోవాడు గాజుల షాపులో పన్జేస్తుంటే.. ముచ్చటగా మూడోవాడు బ్యూటీపార్లర్ నడుపుతూ సినీతారలకు మేకప్ మాన్‌గా వెళ్తాడు, అంతే!' అనగానే ఉస్సూరుమన్నాడు వెంకట్.

©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
అవధాన సరస్వతి
డా. మేడసాని మోహన్
సమాధానాలు

ప్ర. 'ఓం' ఇత్యేకాక్షరం, పరబ్రహ్మ. క్షరం కానిది అక్షరం. మరి అకార, ఉకార, మకారాలు కలిసి 'ఓం'కారం అంటున్నారు. అది ఎలా?

**– చిలకమర్తి కృష్ణమాచార్యులు,** సికింద్రాబాద్

జ. అకార, ఉకార, మకారాలతో ఏర్పడిందే 'ఓం'కారం. కొన్ని అక్షరాలు కలిస్తే ఒక పదం ఏర్పడుతుంది. మన ప్రాచీన వాఙ్మయంలో అక్షరం, శబ్దం- రెండూ సమానార్థకాలుగా వాడారు. 'ఓం' ఇత్యేకాక్షరం- అన్నచోట అక్షరం అన్న పదం 'శబ్దం' అన్న అర్థంతో భాసిస్తోంది. రెండు మూడు అక్షరాలు కూడా వ్యాకరణ సంప్రదాయంలోని సంధి విశేషాలతో ఒకే అక్షరంగా ఏర్పడవచ్చు.

ప్ర. అభిజిల్లగ్నం ప్రాశస్త్యం ఏంటి? శ్రీరాములవారి కల్యాణానికి ఆ లగ్నమే నిర్ణయించడానికి కారణమేంటి?

**– టి. సుందరరామయ్య,** కరీంనగర్

జ. ప్రాచీన వాఙ్మయాన్ని పరిశీలిస్తే అనుష్ఠాన శీలురైన మహర్షులు దినపర్యంతమైన కాలవిశేషాన్ని అనేకవిధాలుగా విశ్లేషించుకొన్నారు. ఉషఃకాలం, అరుణోదయం, తపనోదయం, సంగవం (మాధ్యాహ్నిక సంధ్య), మధ్యాహ్నం, సాయంతనం, రాత్రి, అర్ధరాత్రి- ఇలా వారి వారి అనుష్ఠాన విధులు నిర్వహించుకోడానికి సమయనిర్దేశాలు చేసుకున్నారు. సంగవకాలం, మధ్యాహ్నం- ఈరెంటి మధ్య కాలాన్ని 'అభిజిత్'- అని పేర్కొన్నారు. అభి + జిత్ = ఈ రెండు శబ్దాల కలయికతో ఏర్పడిన పదం. సర్వదోషాలను జయించింది- అని అర్థసూచనం ఇందులో ఉంది. అంటే ఈ సమయంలోని లగ్నకాలం సర్వదోషాలకు అతీతమై ఉంటుంది- అని శాస్త్రవాక్కు. భగవంతుడైన శ్రీరాముని కల్యాణం సమస్త జీవులకు శుభదాయకంగా, సర్వదోషహరంగా ఉండాలనే భావంతోనే మహర్షులు ఈ లగ్నాన్ని నిశ్చయించి ఉంటారు.

ప్ర. ప్రతి సంవత్సరం పంచాంగం, కేలండరు ప్రధాన రూపకర్తలు, న్యాయనిర్ణేతలు ఎవరు? ఏది ప్రామాణికంగా గ్రహిస్తారు?

**– నేమాన సుభాష్ చంద్రబోస్,** విశాఖపట్నం

జ. ఖగోళ శాస్త్రాన్ని అధ్యయనం చేసిన శాస్త్రవేత్తలు పంచాంగం, కేలండర్లకు రూపకర్తలుగా ఉంటారు. వీరు సూర్య, చంద్ర, నక్షత్రాదుల ఉనికి, కదలికలు- ఇత్యాది అంశాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి పంచాంగాలు రూపొందిస్తారు. ఈ పంచాంగ గణనంలో దేశ కాలాదులను బట్టి కొన్ని మార్పులుంటాయి. వీటిని బట్టే ప్రామాణికత కూడా నిర్ణయింపవలసి ఉంటుంది. ఉదాహరణకు తిరుపతి- పరిసర ప్రాంతాల వారు తిరుమల తిరుపతి దేవస్థానంవారు రూపొందించిన పంచాంగాన్ని ప్రామాణికంగా భావిస్తారు.

ప్ర. పాండురాజు మరణిస్తూ తన దేహాన్ని భక్షించమని కొడుకులకు చెప్పినట్లు, కృష్ణుడు నలుగురిని తినకుండా ఆపగలిగినా, సహదేవుడు చిటికెన వేలు తిన్నందుకు అతన్ని తన అదుపులో ఉంచుకున్నారని విన్నాను. ఇది ఎంతవరకు నిజం?

**– కరణం శివానందరావు,** బెంగళూరు

జ. పాండురాజు మరణిస్తూ తన దేహాన్ని భక్షింపవలసిందిగా కొడుకులకు చెప్పినట్లుగా ఉన్న ఐతిహ్యం వ్యాసభారతంలోగానీ, కవిత్రయ

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర. మాణిక్యవీణా... శ్లోకంలో 'మాతంగ కన్యా మనసా స్మరామి' అని ఉంటుంది. సరస్వతి దేవి మాతంగకన్య కాదు కదా! వివరించగలరు?

– కె. గ్రీష్మారెడ్డి, మంచిర్యాల

జ. మన ప్రాచీన వాఙ్మయంలో మతంగ మహర్షులు ఇద్దరున్నారు. కాళిదాస మహాకవి పేర్కొన్న మహర్షి తన తపశ్శక్తితో పరాశక్తిని తన కుమార్తెగా పొందినవాడు. ఈ మహర్షి కుమార్తెగా పరాశక్తి 'శ్యామల' నామధేయంతో విలసిల్లింది. ఈమెను సరస్వతీ దేవి తేజోవిశేషంగా మహర్షులు కీర్తించారు. ఈవిధంగా ఆ దేవి మాతంగ కన్యగా కీర్తింపబడింది. మరొక మతంగుడు తన తపోబలంతో చండాలత్వం నుండి విముక్తి పొంది స్వర్గాన్ని అలంకరించిన మహర్షి.

భారతంలో గానీ లేదు. ఇది జానపదుల ప్రచారంలో ఉన్న గాథా విశేషం.

ప్ర. మరణించిన పెద్దల పేరున దేవాలయాల్లో అర్చన తదితర పూజాదులు చేయించవచ్చా?

– నిమ్మగడ్డ దేవేంద్రప్రసాద్, హైదరాబాద్

జ. మరణించిన పెద్దల పేరుతో పుణ్యప్రదేశాలలో శ్రాద్ధాదులు నిర్వహింపవచ్చు. దేవాలయాలలో అర్చనాదులు చేయకూడదు. వారి ఆత్మ శాంతి కోసం పుణ్యక్షేత్రాలలో దానధర్మాలు కూడ నిర్వహింపవచ్చు.

ప్ర. రామాయణం మనకు ఆదర్శం కదా! లక్ష్మణుడు వలచి వచ్చిన శూర్పణఖ ముక్కు, చెవులూ కోయడంలో ఆంతర్యమేంటి?

– ఎమ్. శరత్, ఒంగోలు

జ. శూర్పణఖ వలపులో ప్రేమ కన్నా కామం ఎక్కువ. 'రాక్షసీ కామమోహితా' - అని వాల్మీకి మహర్షి స్పష్టంగా పేర్కొన్నాడు. అంటే రామలక్ష్మణులను చూచిన వెంటనే శూర్పణఖలో కామం, మోహం- అనే గుణాలు పెల్లుబికాయి. ఈ రెండు దుర్గుణాలను అదుపు చేసుకోవలసిందిగా లక్ష్మణుడు ముక్కు, చెవులూ కోసి శిక్షించాడు.

ప్ర. గుడిలో దేవుని చుట్టూ 108 ప్రదక్షిణలు చేస్తే మంచి జరుగుతుందని చాలా మంది చెప్తారు. అసలు 108 సంఖ్య విశిష్టతేంటి?

– నల్లపాటి సురేంద్ర, విశాఖపట్నం

జ. మనకు సంఖ్యా శాస్త్రంలో '9' పూర్ణసంఖ్యగా చెబుతారు. 18, 27, 36 - వంటి వానిని మనం పరిశీలిస్తే 1 + 8 = 9, 2 + 7 = 9, 3 + 6 = 9, ఇలా మళ్ళీ '9' వస్తూ ఉంటుంది. అంటే ఈ సంఖ్య సమగ్రత్వానికి, సంపూర్ణత్వానికి సంకేతాత్మకం. '108' - లో కూడా 1 + 0 + 8 = 9 వస్తుంది. మధ్యలో ఉన్న పూర్ణానుస్వారం నిండుదనానికి ప్రతీక. మనం దేవాలయంలో 108 ప్రదక్షిణలు చేస్తే అర్చామూర్తి నిండైన కరుణతో మన సేవకు సంపూర్ణత్వాన్ని సంతరించి అనుగ్రహిస్తాడని విశ్వాసం. ఆస్తిక్య భావానికి ఇటువంటి విశ్వాసమే పునాది.

ప్ర. మనం అనుభవిస్తున్న జీవితం వెనక మన కర్మఫలం మాత్రమే కాకుండా మన వంశానికి చెందినవారి కర్మఫలం కూడా ఉంటుందంటారు. ఇది వాస్తవమేనా?

– కె. అభిరామ్,
పర్వతాపురం, కర్నూలు జిల్లా

జ. మనం పెద్దలు సంపాదించి పెట్టిన ఆస్తిపాస్తులకు ఏ విధంగా వారసులమవుతామో, అలాగే వారి పాపపుణ్యాలకు కూడా వారసులమవుతాం. అందుకే పెద్దలు, పిన్నలు- అందరూ కర్మఫలం, కర్మాచరణం పట్ల అప్రమత్తులై ఉండాలి.

ప్ర. తల్లిదండ్రుల మరణానంతరం వారికి మాసికాలు, సంవత్సరీకాలు క్రమం తప్పకుండా చేయలేని పరిస్థితి వస్తే లేక చేయకపోతే ఎటువంటి నష్టం జరుగుతుంది?

– రాయబారపు సంజీవ్‌కుమార్, వరంగల్

జ. మనం ఎప్పుడైనా ఒకటి రెండు రోజులు రైలులోగానీ, విమానంలో గానీ ప్రయాణం చేస్తూ ఉంటే సరియైన ఆహారం దొరకకుండా, ఏదో దొరికిన తినుబండారాలతో కాలక్షేపం చేస్తాం. గమ్యస్థానం చేరిన వెంటనే దారిలో తీసికొన్న ఆహారం కన్నా, మనకు నచ్చిన ఆహారాదులకోసం తపిస్తాం. పితృదేవతలకు సమర్పించే శ్రాద్ధాదులలో కూడా ఇలాగే భావించడం సముచితం. జీవుల అభ్యుదయానికి పితృదేవతల అనుగ్రహం కూడా కారణమవుతుంది.

వాణిశ్రీ

జారుడు మెట్లు

త్వరలో చతురలో..

సుషమ్ బేదీ (హిందీ) నవల

నన్ను క్షమించు.. చిన్నూ!

అనువాదం : ఆర్. శాంతసుందరి

అక్కినేని కుటుంబరావు

కొల్లేరు కంటనీరు

ప్ర. 'స్వయంభూ' అన్న పదానికి సరైన అర్థమేంటి? గర్భగుడిలో నూనె దీపాలు మాత్రమే వెలిగించాలనే నియమం ఎందుకు?

– వి.ఆర్. విజయలక్ష్మి, కరీంనగర్

జ. మానవమాత్రులు ఎవరూ ప్రతిష్ఠించింది కాకుండా, కేవలం మహర్షుల తపఃఫలంగానో, భక్తుల అభీష్టానుసారమో భగవంతుడు స్వయంగా ఆవిర్భవిస్తే ఆ మూర్తిని 'స్వయంభూ' అంటారు. ఇక గర్భగుడిలో శ్రేష్ఠమైన నూనె, నేయిలతోనే దీపాలు వెలిగిస్తారు. ఇతర కల్తీప దార్థాలతో దీపాలు వెలిగిస్తే పొగచూరడం-వంటి వికారాలు ఏర్పడే ప్రమాదం ఉంది.

ప్ర. గీతోపదేశంలో అర్జునుడికి కృష్ణుడు, కురుక్షేత్ర సమరంలో బంధుత్వం, అనుబంధాలకు తావులేకుండా యుద్ధం చేయమని ఉపదేశిస్తాడు. మరి బతుకు సమరంలో అనుబంధాలు మరచి ఒక్కోమెట్టు అధిగమించి పైకి వస్తే స్వార్థపరుడంటారు. దీన్ని ఎలా సమన్వయించుకోవాలి?

– తల్లాప్రగడ ప్రభాకర్, బెంగళూరు

జ. నిజ జీవితంలో కూడా బంధుత్వం కలిగినవారితో, అనుబంధం కలిగిన వారితో యుద్ధం వంటి పరిస్థితులు సంభవించినపుడు కృష్ణుడు ప్రబోధించిన ధర్మ, అధర్మ - విచక్షణ, విశ్లేషణ కూడ దృష్టిలో ఉంచుకోవాలి. కేవలం వారిని అణగదొక్కి పైకి రావడానికి అవకాశంగా తీసికోకూడదు. అటువంటి దుష్ప్రయత్నం చేస్తే తప్పకుండా స్వార్థమే అవుతుంది.

ప్ర. హిందూ మతావలంబులు పూజార్చనా వేళల్లో శంఖాన్ని ఎందుకు పూరిస్తారు? దానికి విశేషమైన, వైజ్ఞానికమైన కారణాలున్నాయా? యుద్ధ సమయాల్లో శంఖం వినియోగంతో ఏమైనా సామ్యముందా?

– శ్రీ పెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్

జ. అనుష్ఠానపరులు, సాధకులు వారి వారి మనోజయానికి చిహ్నంగా శంఖధ్వని, ఘంటాధ్వని- వంటివి చేస్తారు. అహంకార మమకారాది మనోవికారాలపై సాధకుడు సాధించిన విజయాలకు ఈ ధ్వనులు సంకేతాలు. గజేంద్రుని సంరక్షించినపుడు శ్రీమహావిష్ణువు పాంచజన్యాన్ని పూరించాడు. యుద్ధసమయాలలో రాజులు శత్రు రాజులపై యుద్ధం ప్రకటించినపుడు తమతమ సేనలలో సమరోత్సాహం పురికొల్పడానికి గానీ, యుద్ధానంతరం దిగ్విజయ సూచకంగాగానీ శంఖధ్వని చేయడం పరిపాటి.

(ఈ శీర్షిక ఇంతటితో ముగిస్తున్నాం) ©

## కర్వేకు దక్కిన అరుదైన గౌరవం

అసత్యాలు నిజాలు



సజీవంగా ఉన్నప్పుడు తపాలా బిళ్ళ జారీచేయడం చాలా అరుదుగా జరుగుతుంటుంది. ఈ అరుదైన ఘనత డా. ధోండో కేశవ్ కర్వేకి దక్కుతుంది. డా. కర్వే 1858లో జన్మించి 1962లో మరణించారు. డా. కర్వే శతజయంతి రోజున అనగా 1958 సంవత్సరం ఏప్రిల్ 18న ఆయన గౌరవార్థం ఒక ప్రత్యేక 15 పైసల తపాలా బిళ్ళను తపాలా శాఖవారు జారీ చేశారు. డా. కర్వే విద్యావేత్తగా, సంఘసంస్కర్తగా పేరు పొందారు. ఎస్.ఎన్.డి.టి. భారతీయ విద్యాలయం సంస్థాపకులైన డా. కర్వేకి భారత ప్రభుత్వం 1958లో 'భారతరత్న' బిరుదును బహూకరించి సత్కరించింది.

## వృద్ధులను గౌరవించే దేశం!



జపానులో ఎక్కువగా గౌరవం పొందే వ్యక్తులు వృద్ధులు. ఆ దేశంలో వారు తమకోసం ఏర్పాటయిన ప్రత్యేక మార్గాలలో నిర్భయంగా నడవవొచ్చు, రోడ్డును దాటవచ్చు. ఏ టాక్సీ డ్రైవరయినా రోడ్డు మీద వృద్ధుడిని చూస్తే టాక్సీ ఆపి దిగివచ్చి రోడ్డు దాటించి వెళతాడు.

హోటళ్ళలో 'వృద్ధుల విభాగం' ప్రత్యేకంగా ఉంటుంది. ఇక్కడ వీరు నెమ్మదిగా, విశ్రాంతిగా కూర్చొని, నిశ్చింతగా తినవచ్చు. చార్జీలు కూడా అంత ఎక్కువ ఖరీదులో ఉండవు. ఇతరులకు చేసే చార్జీలలో 10వ వంతు మాత్రమే! క్యూలో నిలుచున్న యువకులు వృద్ధులనుగానీ, స్త్రీలనుగానీ చూస్తే వెంటనే వారికి తమ స్థానాన్ని ఇస్తారు. రైళ్ళలోగానీ, బస్సులలోగానీ యువకులు, వృద్ధులను చూస్తే వెంటనే లేచి కూర్చోడానికి తమ సీటును ఇస్తారు. ఎందుకు ఇలా చేస్తారని ఒక జపాను పౌరుడిని అడిగితే - వారు ఆరోగ్యంగా, యౌవనంలో ఉన్నప్పుడు దేశానికి చేసిన సేవను మేము ఈవిధంగా గుర్తిస్తాం-అని చెప్పాడు.

## మొదటి పనితో ప్రారంభించు



బెత్లె హేం స్టీల్ కంపెనీ మాజీ అధ్యక్షుడైన చార్లెస్ స్క్వాబ్ సంవత్సరానికి ఒక మిలియన్ డాలర్ల వేతనం పుచ్చుకునేవాడు. ఆయనకు ముఖ్యమైన పెద్ద పెద్ద పనులు చేయడానికి వీలుకాకపోవడంతో ఇబ్బందులు పడ్డాడు. అంతేకాక తాను చేయవలసిన చిన్న చిన్న పనులు బల్లమీద పేరుకునిపోవడం చూసి విసుగెత్తిపోయి ఒకరోజున మేనేజ్‌మెంట్ కన్సల్టెంట్‌ను దీనికేం చేయాలి? అని అడిగాడు.

ఆ కన్సల్టెంట్ స్క్వాబ్‌కు ఒక తెల్ల కాగితం ఇచ్చి "తర్వాతి రోజు నీవు చేయవలసిన ఆరు ముఖ్యమైన విషయాలను ఒక వరుస క్రమంలో రాసి పెట్టుకో. రేపు ఉదయం మొట్టమొదట రాసిన పనిని ప్రారంభించి కేటాయించిన సమయంలోపలే దానిని పూర్తిచేయి. తరువాత రెండో పనిని ప్రారంభించు" అన్నాడు.

స్క్వాబ్ అలాగే చేసి అది తనకు బాగా ఉపకరించినట్లు తెలుసుకున్నాడు. తన స్నేహితులకు కూడా అలాగే చేయమని చెప్పాడు.

కన్సల్టెంట్‌కు అభినందనలు తెలియజేస్తూ ఇరవై ఐదువేల డాలర్లకు చెక్కు పంపాడు.

*గమనిక :* చతురకు నవలలు, ఇతర రచనలు, చతురంగం, ప్రవేశిక కూపన్లు పంపేవారు పారితోషికం, బహుమతులు పొందడంలో అసౌకర్యం కలగకుండా ఉండేందుకు విధిగా వారు తమ పూర్తి చిరునామా, పిన్‌కోడ్, వయసు, ఫోన్‌నంబరు స్పష్టంగా రాయాలి.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కె. విష్ణుచందన్**
ఇంటి. నెం. 3-10-83,
కొత్తబజారు, కావలి,
నెల్లూరు జిల్లా, పిన్: 524201

## చతురంగం - 30 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మా | ర | 2 కం | | 3 ప | త్ని | | 4 కం | 5 చి | కి |
| న | | 6 సు | మా | రు | | 7 ప | తు | లు | |
| 8 వా | 9 డ | డు | | 10 ల | 11 లా | టం | | 12 క | 13 రం |
| | మ | | 14 తె | | భం | | 15 నా | లు | గు |
| 16 పు | రు | షు | లం | 17 దు | | 18 కా | మం | | లు |
| 19 త్రి | కం | | 20 గా | య | 21 కు | డు | | 22 వి | |
| క | | 23 వీ | ణ | | రు | | 24 క | వా | 25 టం |
| | 26 వి | ధి | | 27 హు | | 28 క | ల | హ | ము |
| 29 మా | ల | | 30 శ | కుం | 31 త | ల | | 32 ము | క |
| 33 త్ర | యం | బ | కం | | 34 పం | త | ము | | ఆ |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. వి. దివ్య, చిలకంపాడు, వరంగల్ జిల్లా, 2. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 3. పుల్లా రంగనాథంనాయుడు, తిరుపతి, 4. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 5. టి. హేమలత, మచిలీపట్నం, 6. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 7. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 8. లకిరెడ్డి చంద్రకళ, నూజివీడు, 9. పెద్ది రాజేశ్వర్, సంగారెడ్డి, 10. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 11. లలిత దేవులపల్లి, ఉయ్యూరు, 12. కె. నాగభూషణం, మల్కాజిగిరి, 13. గౌతమి శిష్టా, హబ్సిగూడ, 14. బొట్టా శ్రీహరిరావు, విశాఖ, 15. నియాజ్ అలీ, హైదరగూడ, 16. తిప్పావఝుల వెంకటనారాయణ, మల్కాజిగిరి, 17. అరుంధతి, మల్లేపల్లి, 18. సాధనాల పద్మావతి, విజయవాడ, 19. గేదెల రామారావు, ఏలూరు, 20. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 21. కె. వాణీసుజాత, గుంటూరు, 22. ఎమ్.వి.ఎస్. రామశేషు, గుంటూరు, 23. సి. జనార్ధన సింగ్, నల్లకుంట, 24. ఇందన మల్లికార్జున్‌రావు, ఏలూరు, 25. జి. ప్రభాకర్ రావు, మల్లాపూర్, 26. ధరణి పద్మాసన, హైదరాబాద్, 27. ఎమ్. జానకీదేవి, రామంతపూర్, 28. జ్యోషి శ్రీనివాసశర్మ, మహబూబ్‌నగర్, 29. డి. శివమనోహర్, తిమ్మాపురం, కర్నూలు జిల్లా, 30. సిహెచ్. శేషుకుమార్, విశాఖ, 31. బచ్చలి శాంతకుమారి, నెల్లూరు, 32. టి. సాయిసుజన, ఆదోని, 33. ఎ. అరుంధతి, పుణె, 34. మహమ్మద్ ఖాసిం, కల్లూరు గూడెం, ఖమ్మం జిల్లా, 35. పాలెపు బుచ్చిరాజు, గుజరాత్, 36. వాసా మోహనరావు, విశాఖ, 37. వేదాల సీత, విశాఖ, 38. పిశిపాటి శైలజ, నవులూరు, 39. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 40. సి. శేషసాయి, కూకట్‌పల్లి, 41. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 42. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 43. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 44. గుర్రాల వినీత, విశాఖ, 45. జయశేషసాయి, సామర్లకోట, 46. సూరి నాగరాజు, రామవరప్పాడు, 47. వెలసిరి రమాదేవి, నల్గొండ, 48. ఎస్. నాగభూషణరావు, విజయనగరం, 49. పెద్దింటి అనంతలక్ష్మి, పెద్దాపురం, 50. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డేపల్లి, 51. పి.బి. సీతాదేవి, నరసాపురం, 52. సిహెచ్.వి. శేషతల్పరావు, విజయవాడ, 53. కె.ఎస్.వి. ఆంజనేయులు, విశాఖ, 54. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 55. గరికిపాటి శ్రీచైతన్యకృష్ణ, కాకినాడ, 56. సి. నిర్మల, తిరుపతి, 57. జాన్సీలక్ష్మి, హైదరాబాద్, 58. ఎమ్. రామచంద్రరావు, నల్గొండ, 59. తుమ్మల విద్యాసాగర్, విజయవాడ, 60. సుభాష్‌చంద్రబోస్, విశాఖ, 61. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 62. పరమాత్ముని వెంకటాచలం, సైదాబాద్, 63. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, తూ.గో. జిల్లా, 64. కొక్కెరగడ్డ శ్రీదేవి, అమలాపురం, 65. తల్లాప్రగడ భాస్కరరావు, హైదరాబాద్, 66. ఆర్. సుశీల, విజయవాడ, 67. వాడపర్తి వెంకటరమణ, విశాఖ, 68. వంకాయల చిరంజీవి, రాజమండ్రి, 69. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 70. అడపా రాజు, విశాఖ, 71. పసుమర్తి జయశ్రీ, మౌలాలి, 72. ఎమ్.వి.ఎస్. మూర్తి, కొత్తగూడెం, 73. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 74. పొణుకుమాటి లీలాప్రవీణ, కొత్తనాగులూరు, 75. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 76. ఎస్. ప్రేమలత, నిజాంపేట, 77. షేక్ నజీర్‌బాషా, కోట, 78. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 79. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 80. బిరుదు సురేష్‌బాబు, చీరాల, 81. జి.బి.ఆర్. లక్ష్మి, రాజమండ్రి, 82. బి. సునీల్ కుమార్, నూజివీడు, 83. ఎమ్.వి. శ్రీనివాసగుప్త, హైదరాబాద్, 84. ఎ. మానస, యర్రగుంట్ల, 85. కె.వి.జె. దాస్, సికింద్రాబాద్, 86. సిహెచ్.వి. కృష్ణమాచార్యులు, సైనిక్‌పురి, 87. సత్రసాల సుభాషిణి, అనంతపురం, 88. జి. సురేఖ, ఖమ్మం, 89. ఎమ్. ప్రసూన, హైదరాబాద్, 90. డి. కృష్ణకుమారి, హైదరాబాద్, 91. యనమండ్ర శాంత, విశాఖపట్నం, 92. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, 93. అమ్ముపండు, నెల్లూరు, 94. కమలారజని పువ్వాడ, గుంటూరు, 95. కె.ఎల్. ప్రసాదరావు, రాజమండ్రి, 96. అద్దంకి సీతాదేవి, మలక్‌పేట, 97. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 98. ఎన్. రామకృష్ణమూర్తి, విశాఖ, 99. ముట్నూరు ఉపేంద్రశర్మ, శ్రీకాకుళం, 100. వి. ఇందిర, విజయవాడ, 101. ద్రోణంరాజు వీరరాఘవరావు, హనుమకొండ, 102. గుర్రాల జయశ్రీ, గుంటూరు, 103. వి. వెంకటరమణయ్య, కడప, 104. బట్టు పరంజ్యోతి, సికింద్రాబాద్, 105. ఎమ్.పి. సుందరి, కూకట్‌పల్లి, 106. కోలా సత్యనారాయణ, విశాఖ, 107. తూములూరి పార్థసారథి, చైతన్యపురి, 108. ఎస్. శ్రీహరి, బెంగళూరు, 109. జి. జయచంద్ర గుప్త, కర్నూలు, 110. కె. మోహన్, బెంగళూరు, 111. బి. రామమోహనరావు, సరూర్‌నగర్, 112. గరికిపాటి రాజాదత్తాత్రేయ, కాకినాడ, 113. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 114. నల్లమోతు సుబ్బారావు, గుంటూరు, 115. శివలెంక చంద్రశేఖర్, హుమాయూన్ నగర్, 116. ఎస్. మణిమేగలై, తిరుపతి, 117. వంగూరి ప్రసన్న, గుంటూరు, 118. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 119. పి. శిరీషకుమారి, పుత్తూరు, 120. ఎమ్.వై. నారాయణ, మల్కాజిగిరి, 121. వి. సుజాత, తిరుపతి, 122. గురజాల వరలక్ష్మి, ఆత్రేయపురం, 123. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, 124. జి.ఎస్. నారాయణశౌరి, ఎల్లారెడ్డి గూడ, 125. జె. రాజగోపాలరావు, సాయినాథపురం, 126. ఎస్. ప్రభాకర్, కల్వకుర్తి, 127. జె. శివకుమార్, దిల్‌సుఖ్‌నగర్, 128. బి. శాంతి, విజయవాడ, 129. జి.వి. పద్మజ, విజయనగరం, 130. బి. రామయ్య, బర్కత్‌పుర, 131. టి. నాగేందర్‌శర్మ, సంగారెడ్డి, 132. పొనుగోటి విజయలక్ష్మమ్మ, నల్గొండ, 133. విమలామూర్తి శిష్టా, జనగామ, 134. కాశీభట్ల పద్మావతి, అనంతపురం, 135. సౌదామిని నాగరాజన్, విశాఖ, 136. ధనలక్ష్మి, నరసాపురం, 137. పి. సుజాత, గుంటూరు,

*(తరువాయి 128 లో..)*

# చతురంగం - 31 ఆధారాలు

## అడ్డం

1. దుర్యోధనుడ్ని ఇలా అంటారు (3)
3. రామపాదం సోకగానే అహల్యకు ఏమైంది? (6)
8. మజ్నూ ప్రేయసి (2)
10. క్రమం అనడానికి అచ్చతెలుగు... వావి తరువాత వచ్చేది (3)
11. స్త్రీ (2)
13. యుద్ధం (3)
15. మన్మథుడు (3)
17. స్త్రీని ఇలా కూడా అంటారు (3)
19. దర్భలు, పవిత్రమైన గడ్డి (3)
20. ముల్లు (3)
22. 'మాది'కి ఏకవచనం (2)
23. సంస్కృతంలో తండ్రి (2)
26. మాద్రి కుమారుల్లో పెద్దవాడు (4)
29. స్వప్నం అటునుంచి (2)
31. భవుడ్ని పిలవండి (2)
32. తుమ్మెద (4)
34. విష్ణురూపమైన వృక్షం (4)
36. పాము (2)
37. 'ఒప్పు'నకు వ్యతిరేకం (2)
38. 'పర్మిషన్'కు తెలుగు (4)
41. గోడమీది బొమ్మ... (2)
42. విరామం, ఆదివారం బడికి--- (3)
43. బెజ్జం, కన్నం (3)

## నిలువు

1. నాటి వెండితెర ప్రతినాయకుడు (4)
2. జూన్ తరువాతి నెల (2)
4. వాయువు (3)
5. సూర్యుడు శీర్షాసనం (2)
6. మోసాలు చేసేవాడు (4)
7. శ్రీ కృష్ణుడ్ని పెంచిన తండ్రి (3)
9. నష్టానికి వ్యతిరేకం (2)
12. నుదుట దిద్దేది (3)
14. చాటింపు దీంతో వేస్తారు (2)
16. కోయిల తలకిందులు (3)
18. నటులు చేసేది (3)
19. తెలుగులో 'రూము' (2)
21. విరాటరాజు కొలువులో ధర్మరాజు పేరు (4)
22. రోజు, గ్రామం (2)
24. తెల్లగా, మెత్తగా ఉండే ఒకలోహం (3)
25. వాంతులు, విరోచనాలతో ఒక అంటువ్యాధి (3)
27. పల్లం కింద నుంచి (2)
28. బాగు, మంచి (2)
30. కవులు రాసేవి (4)
32. దేవుడు చూపేది (3)
33. 'కత'కు ప్రకృతి (2)
35. పాదరక్ష (2)
36. --- కానిచోట అధికులమనరాదు (3)
38. తరంగం (2)
39. 'స్థిరం' వికృతి (2)
40. 'నేను' బహువచనం (2)

## ( 127 తరువాయి )

138. పి. సీతారత్నం, నరసాపురం, 139. ఎమ్. అంజనాదేవి, నిజాంపేట, 140. పి. ఉదయశ్రీ, హయత్‌నగర్, 141. ఓంప్రకాశ్ పార్సి, మహబూబ్‌నగర్, 142. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 143. ప్రమోద్‌కుమార్ సింగరాజు, రామంతాపూర్, 144. లక్ష్మణరావు మంచాళ, విశాఖ, 145. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, 146. ఎమ్. ప్రతిభ, వరంగల్, 147. జి.వి. కామేశ్వరి, విశాఖ, 148. లక్ష్మిరాజ్యం, హైదరాబాద్, 149. ఎన్. నాగేశ్వరరావు, బేగంపేట, 150. ప్రభావతి, వనస్థలిపురం, 151. మాధవ్, గుంటూరు, 152. జోగేశ్వరశర్మ, శ్రీకాకుళం, 153. మీనా జీవన్‌బాబు, చెన్నై, 154. బి.ఎస్.ఎమ్. రావు, గుంటూరు, 155. రామ్ సోదర్‌రెడ్డి, ఆర్మూరు, 156. కె. సుధీంద్రరావు, కర్నూలు, 157. కె. సుకుమార్, చిత్తూరు, 158. వత్సలరావు, చిలకలూరిపేట, 159. వి.వి. సంఘమిత్ర, కర్నూలు, 160. టి. కేశవదాసు, గుంటూరు, 161. వై.ఆర్.కె.వి. ప్రసాదరావు, శ్రీకాకుళం, 162. పి. నిరాలంబమూర్తి, బుచ్చిరెడ్డి పాలెం, 163. సిహెచ్. వెంకటేశ్వర్లు, నందిగామ, 164. చి.పు. శాస్త్రి, నిజామాబాద్, 165. జి.వి. రాఘవేంద్ర, బెంగళూరు, 166. యు.యు.యు., ఎమ్మిగనూరు, 167. కె. గ్రీష్మారెడ్డి, మంచిర్యాల, 168. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 169. పి. అచ్యుతాంబ, విశాఖ, 170. టి. సుందరరామయ్య, రాజమండ్రి, 171. పి. రామభద్రరావు, వనస్థలిపురం, 172. కె. సుధాదేవి, చీరాల, 173. పి.వి. సుబ్బలక్ష్మి, వైజాగ్, 174. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 175. టి. మధుసూదన రావు, బెంగళూరు, 176. ఎ. స్వరాజ్యలక్ష్మి, చీరాల, 177. కె.ఇ. నిలమంగై, ఆనందబాగ్, 178. వి. నాగబాబు, తాడెపల్లిగూడెం.

# చతురంగం - 31

రూ.150/- బహుమతి

గడువు తేది : అక్టోబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 ప | 5 | 6 | | 7 |
| | ■ | 8 | 9 | ■ | 10 | | | ■ | |
| 11 | 12 | ■ | 13 | 14 | | ■ | 15 | 16 | |
| 17 | | 18 | ■ | | ■ | 19 | రి | | ■ |
| ■ | 20 | | 21 | ■ | 22 | | ■ | 23 | 24 |
| 25 | ■ | 26 | | 27 | | ■ | 28 | ■ | |
| 29 | 30 | ■ | 31 | | ■ | 32 | ధు | 33 | |
| 34 | | 35 | | ■ | 36 | హి | ■ | | ■ |
| ■ | 37 | | ■ | 38 | | | 39 | ■ | 40 |
| 41 | | ■ | 42 | | | ■ | 43 | | |

పంపినవారి పేరు: ____________________

వయసు (    ) చిరునామా : ____________________

____________________

____________ పిన్ : ____________ ఫోన్ : ____________



ఆధారాలు

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# ఇంటిపెద్దనే దొంగ చేసిన వేళ!




సినిమా చూసొచ్చిన ఆ ముగ్గురూ తలుపులు తెరుచుకునే కునుకు తీస్తున్న ఆ ఇంటిపెద్దను చూశారు. ఆ పెద్దాయనను కుదిపి లేపి 'బాబు ఏడీ?' తీక్షణంగా అడిగాడు కొడుకు. 'ఇక్కడే ఉండాలే?' కళ్లు నులుము కుని చుట్టూ చూశాడా యన. 'నా బిడ్డనేం చేసారో చెప్పండి. వాడుంటే చాకిరీ చెయ్యాల్సివ స్తుందని చంపేసారా? మీ తిరుగు ళ్లకి అడ్డొస్తాడని ఏ నూతిలోనో తోసే శారా?' నిలదీసింది కోడలు. 'పోలీసుల్ని పిలవండే.. బాబును ఎవరు ఎత్తుకుపోయారో, ఈయనెవ రికి అప్పజెప్పేసి చేతులు దులుపుకు న్నాడో వాళ్లే తేల్చుతారు!' అంది వియ్యపురాలు ఫోన్ అందుకుంటూ. ఇంతకీ ఆ చిన్నారి ఏమైనట్లు? బాబు కన్పించకపోతే ఇంటిపెద్దనే అనుమానించడం ఏమిటి? ఆద్యంతం ఏకబి గిన చదివించే కాశీవిశ్వనాథ్ నవల **దత్తతకోతండ్రి!**


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. www.eenadu.net.

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## ధనం - దానం

దానం చ విధినా దేయం దేశే పాత్రే గుణాన్వితే
న్యాయాగతం ధనం చైవ న్యాయేనైవ వివర్థితం!
సంరక్ష్యం యత్న మస్థాయ ధర్మార్థ మితి నిశ్చయః!!

**భావం:** దానాన్ని విధియుక్తంగా, దేశ కాల పాత్రలని తెలుసుకొని చేయాలి. న్యాయంగా సంపాదించి న్యాయంగా వృద్ధి పరిచిన ధనాన్ని ధర్మంకోసం ప్రయత్నపూర్వకంగా కాపాడాలి.

## ఇంద్రియ జాగరూకత

మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తా సనో భవేత్!
బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి!!

**భావం:** మగాడు తన తల్లి, చెల్లి, కూతురు విషయంలో కూడా జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే ఇంద్రియాలు ఎంత బలమైనవంటే, అవి అవకాశం దొరికితే పండితులని కూడా కబళిస్తూంటాయి.

## పుణ్యాలే రక్షకాలు

వనేరణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్త కేవా ।
సుప్తం ప్రమత్తం విషయం స్థిరంవా
రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥

**భావం:** కీకారణ్యం, యుద్ధం, శత్రుకూటమి, జలం, అగ్ని- వీటి మధ్య ఇరుక్కున్నపుడు, సముద్రంలోను, పర్వతాల మీద ఉన్నప్పుడు, నిద్రావస్థలో మత్తుగా ఉన్నప్పుడు, భయానక స్థితిలోనూ మనిషిని కాపాడేవి పూర్వం చేసుకున్న పుణ్యాలే.

## భావ శుద్ధి

గంగా తోయేన సర్వేణ
మృద్భారైః పర్వతోపమైః ।
ఆమృత్యోః ఆచరేచ్ఛుచం
భావదృష్టో న శుధ్యతి ॥

**భావం:** సమస్త గంగా తీర్థంతో, కొండంత మట్టితో తోమి, మరణించే దాకా శుద్ధి చేసినా, భావ శుద్ధి లేనివాడు ఎప్పటికీ శుద్ధుడు కాడు.

## సత్యం విలువ

అశ్వమేధ సహస్రం తు
సత్యం చ తులయాం ధృతం ।
అశ్వమేధ సహస్రాద్ధి
సత్యమేకం విశిష్యతే ॥

**భావం:** నూరు అశ్వమేధయాగ ఫలితాలని, ఒక సత్యాన్ని త్రాసులో చెరోవైపు వేసి తూచితే సత్యం వైపే మొగ్గు ఉంటుంది.

## చదువు లేనివాడు

దివి పశ్యతి నోలూకః
కాకో నక్తం న పశ్యతి
విద్యావిహీనో మూఢస్తు
దివా నక్తం న పశ్యతి

**భావం:** గుడ్లగూబ పగలు చూడలేదు. కాకి రాత్రి వేళల్లో చూడలేదు. చదువు లేనివాడు రేయింబవళ్ళూ చూడలేడు.

సేకరణ : లిపి

CHATURA Telugu Monthly, October 2013. Regd No. HD/965/2012-2014 RNI/32186/78

